ఓం పరబ్రహ్మణేనమః.

పూర్వమీమాంస, అపరకృష్ణీయ, నిర్ణయసింధు,

ప్రయోగ కమలాకర, [illegible]సూత్ర,

ధర్మశాస్త్ర పురాణాద్యనుసారమై

సంగృహీతంబై లోకోపకారార్థముగా

పురాణోక్తాపరకర్మప్రకాశికయును,

# పురాణోక్త వైశ్యాపరచంద్రిక

ఈగ్రంథము,


బందరుపట్టణ నివాసులగు,

చేల్లా - నాగలింగశాస్త్రులవారి పుత్త్రుండగు

లక్ష్మీనృసింహశాస్త్రిచే


ఆంధ్రటీకా తాత్పర్యసహితముగా వ్రాయఁబడి,


స్వకీయ,

శ్రీ ఆర్యానంద ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

పంచమ ముద్రణము.—1500




దీని వెల రూ 1—8—0


మచిలీపట్టణము 1922 బచ్చుపేట

# పీఠిక.

సుజనవర్యులారా?

జననీజనకులు మృతినొందిన సమయమునందు పుత్రులు ప్రేతకర్మములను జక్కఁగ నియమయుతముగ నెఱవేర్చిరేని వారు (ఆజననీజనకులు) తమపుత్రాదులొనరించిన దానాదికర్మములకు విధింపఁబడిన పుణ్యలోకములనుబొందుదురు. మఱియువారుపితృదేవత్వముగలవారగుదురు. వారిట్లగుటచే వారానందనమునుబొంది తమపుత్రులు దీర్ఘాయుష్మంతులును, తేజోవంతులును, ధనవంతులును, అగునటులాశీర్వచనములను జేయుదురు. ఆయాశీర్వచన సామర్థ్యంబున పుత్రులుసుఖవంతులై యుందురు.

శ్లో॥ పితౄణాంచ ప్రసాదేన కర్తుర్వంశోభివర్ధతే।
శ్రేయసాంచాభివృద్ధిస్స్యాద్భూయసాముత్తరోత్తరమ్॥

తా॥ పితృదేవతల యొక్కయనుగ్రహముచేతఁ బుత్రాదుల యొక్క వంశమభివృద్ధిని బొందుటయేగాక గొప్పవగు శ్రేయస్సులుగూడ విశేషించి కలుగును.

ఔర్ధ్వదైహిక కర్మమునకు పైతృమేధికమనిపేరు. పైతృమేధికమనఁగా చనిపోయిన, మాతాపితృ మాతామహాది కారుణ్యవర్గములోని వారలకు దహనసంస్కారము మొదలుకొని సపిండీకరణాంతమువఱకును జేయుకర్మమని యభిప్రాయము.

"జ్ఞాత్వాకర్మాణికుర్వీత" అనియుండెనుకాఁబట్టికాలము తెలిసిపుత్రులు కర్మమాచరింపఁదగును- యీకలికాలమహిమవలన గొందఱుపుత్రులు మాతాపితరలను సదాదూషింపుచు వారు మృతులైనవెనుక వారికినకాలమందు శ్రాద్ధములఁ జేయకమాతల్లిదండ్రులు తినవచ్చినారా? పురోహితులకొఱకీశ్రాద్ధము లేర్పడినవనెడుముఖ్యాభిప్రాయముగలవారగుదురు.

శ్లో॥ పున్నామ్నో నరకాద్యస్మాత్పితరం త్రాయతేసుతః। తస్మాత్పుత్ర ఇతిప్రోక్తస్స్వయమేవ స్వయంభువా॥ అనఁగా ఏకారణమువలన పున్నామయను నరకమునుండి తండ్రిని రక్షింపుచున్నాఁడో ఆకారణమువలన పుత్రుఁడని స్వయముగా బ్రహ్మచే జెప్పఁబడెను.

శ్లో॥ జీవతో ర్వాక్యకరణా త్ప్రత్యబ్దం భూరిభోజనాత్। గయాయాం పిండదానాచ్చ త్రిభిఃపుత్రస్య పుత్రతా॥

అనఁగా తల్లిదండ్రుల యాజ్ఞ ననుసరించుటయు, ప్రత్యాబ్దిక శ్రాద్ధము ఆమశ్రాద్ధవిధిచే జరిపి పిమ్మట, తమతమబంధువుల కన్నదానము చేయుటయు, గయయందు పిండప్రదాన మిచ్చుటయును, ఈమూఁడు కార్యములాచరించుటచే పుత్త్రుఁడు పుత్త్రధర్మమును బొందినవాఁడగును.

అయ్యా? ప్రాచీనగ్రంథములయందు దహరము పురాణోక్తవిధిగా నొకచోట వ్రాయుటయందు ధర్మశాస్త్రములయందుఁ బ్రవీణతగల యాజ్ఞికులకుఁదప్ప తక్కిన సామాన్యజనులకుఁ గానిఁజూచి గ్రహించుటకుఁ గఠినముగానుండెను. మఱియు నీమంత్రముఁజెప్పి యీక్రియఁ జేయవలయునని యెల్లరకుఁ దెలియకయు, నడుమనడుమ ధర్మశాస్త్రము లుండుటచేఁ బ్రయోగమును వరుసగా గ్రహించుటకుఁ దెలియకయున్నది. పెక్కుదేశములయందు ధర్మశాస్త్రరీతిగఁజరుపు బ్రాహ్మణులు [illegible] బడుచుండిన కష్టము నుంతయుచెప్పనలవిగాదు. ఈపురాణోక్త ప్రయోగము [illegible] కొందఱు కొంతకాలమునకుఁ జదివియు కొన్ని ప్రయోగాదులయందు సందేహముగలవారై యీపద్ధతి దురవగాహంబని ప్రారంభింపకయే యున్నారు బుద్ధిమంతులు మఱికొందఱు ధర్మశాస్త్రగ్రంథములనే మిగుల కష్టముతో చిరకాలము పఠించి అనుజ్ఞానము గలిగిన పిమ్మటఁ బ్రయోగములను దెలిసికొనుచున్నారు. బహుజనులిట్టి శ్రమపడుటను జూచి ఈగ్రంథము ముద్రింపఁబడినది. వీనిలో పురుష పరంగా జరుపునప్పుడు పితుః ...గోత్రస్య— గుప్తస్య ప్రేతస్య యనియును, స్త్రీ వాచకమునందు మాతుర్గోత్రా నామ్నీః గుప్తాయాః... ప్రేతాయాః యనియును జరుపఁదగును. ప్రయోగాదులలో ...స్య అనుచోట గుప్తస్య యని గ్రహించవలెను. అయ్యా! దీనియందు చెప్పుటకైనను స్ఖాలిత్యములుండిన పక్షమందు వానిని వివరముగా వ్రాసిమాకుఁబంపించిన పక్షమున మరాబోవు (రీ)కూర్పులో సవరించెదను. కాఁబట్టి బుధోత్తములను బ్రార్థించెదను.

# గ్రంథస్థవిషయములు.


| విషయములు. | పుట. | విషయములు. | పుట. |
|---|---|---|---|
| పీఠిక | 3 | శ్రాద్ధకర్తృభోక్తృనియమములు | 20 |
| మృతికిదోషనక్షత్రములు | 1 | సర్వప్రాయశ్చిత్తము | 21 |
| దోషయుక్తతిథివారములు | | ఉత్క్రాంతిప్రయోగము | 23 |
| మంచినక్షత్రములు | ,, | తిలపాత్రదానప్రయోగము | 24 |
| మృతి చక్రము | 3 | కర్ణమంత్రపఠనము | 25 |
| మాతాపితృభక్తి | 4 | షణ్ణిమిత్త ప్రాయశ్చిత్త ప్రయోగము | 26 |
| పుత్రస్వరూపము | ,, | తిథ్యాదిశాంతిప్రయోగము | 27 |
| దానస్వరూపము | 6 | హోమప్రయోగము | 28 |
| ప్రాయశ్చిత్త ప్రకరణము | 8 | గింజల హోమము | ,, |
| జీవప్రాయశ్చిత్త ప్రకరణము | 9 | ఔర్ధ్వదేహికకర్మప్రయోగము | 29 |
| హోమ ప్రకరణము | 10 | దహనప్రయోగము | 31 |
| కర్మాచరణఫలము | 11 | కర్తృవపనము | 34 |
| ఉత్క్రాంతి విషయము | 12 | శిలాప్రతిష్ఠాపనము | 35 |
| తిలపాత్ర దానము | 13 | నిత్యకర్మ ప్రయోగము | 36 |
| కర్ణమంత్ర పఠనము | ,, | వాసోదక దానము | 37 |
| షణ్ణిమిత్తప్రాయశ్చిత్తవిధి | 14 | తిలోదక దానము | ,, |
| మధుపర్క దానము | ,, | పిండ ప్రదానము | 38 |
| మరణకాల దోష శాంతి | 15 | శిలా నైవేద్యము | ,, |
| త్రిపుష్కర మరణము | 16 | వాయస పిండము | ,, |
| ద్విపుష్కర మరణము | ,, | సంకల్ప విశేషము | 39 |
| స్నాననియములు | 16 | సంచయనకాలము | 39 |
| తిలోదక వాసోదకనిర్ణయము | 18 | శవాగ్నినష్ట ప్రాయశ్చిత్తము | 40 |
| తిలోదకాదినిషేధము | ,, | సంచయనప్రయోగము | 41 |
| శ్రాద్ధఫలనిరూపణము | 19 | | |

| విషయములు. | పుట. | విషయములు. | పుట. |
|---|---|---|---|
| కుంభే అస్థిసిధానము | 43 | సూతకాది ప్రాయశ్చిత్తము | 90 |
| గంగాంభస్యస్థిసిక్షేపణము | [illegible] | విద్ధస్య ప్రాయశ్చిత్తము | 91 |
| నగ్నప్రచ్ఛాదనము | 46 | సువాసినీప్రాయశ్చిత్తము | 92 |
| నవశ్రాద్ధము | 48 | దుర్మరణప్రాయశ్చిత్తము | 92 |
| దశాహప్రయోగము | 52 | నారాయణబలిప్రయోగము | 93 |
| శిలోద్వాసనము | 54 | పునర్దహనక్రియ | 98 |
| కర్మణః పుణ్యాహవాచనము | 55 | విషూచీసుశూచిజాడ్యమృతి | 99 |
| గృహశుద్ధి విషయము | 56 | నారాయణబలికాలపరిమితి | 99 |
| పుణ్యాహవాచనము | ,, | పవిత్రనిర్ణయము | 99 |
| వృషోత్సర్జన విషయము | 57 | మండలవిధానము | 100 |
| వృషోత్సర్జన ప్రయోగము | ,, | ఉదకుంభశ్రాద్ధము | 101 |
| రుద్రకలశ పూజా | 61 | శ్రాద్ధభోక్తృ సంఖ్యా | ,, |
| గోవృషభవివాహప్రయోగము | 62 | వైతరణీగోదాన విషయము | 102 |
| గోవృషభమార్జనము | 63 | పాలాశవిధి దేశాంతరగతమృతి | ,, |
| బలిప్రదానము | 65 | కర్మానంతరంజీవించుట | 103 |
| ఏకోద్దిష్టశ్రాద్ధ విషయము | 66 | రజస్వలాకృతసూత్రిః స్పర్శనము | ,, |
| ఏకోద్దిష్టశ్రాద్ధ ప్రయోగము | ,, | సపిండీకరణమునకు కర్తలు | 104 |
| షోడశశ్రాద్ధవిధి | 68 | పౌత్రపత్నీరజోదర్శనము | ,, |
| షోడశశ్రాద్ధ ప్రయోగము | 69 | సర్పహతశ్రాద్ధప్రయోగము | 105 |
| సపిండీకరణ ప్రయోగము | 75 | మృతాశౌచాంతర్గతశ్రాద్ధం | 109 |
| స్త్రీలకున కల్ప విశేషము | 81 | దశ దానమంత్రములు | 110 |
| వైతరణీగోదానము | 86 | విశేషదాన మంత్రములు | 111 |
| స్వర్గపాథేయము | 87 | షోడశ మహాదానములు | 112 |
| మాతుః సపిండీకరణము | 88 | మృతాహస్సు తెలియనిచో | 113 |
| గర్భిణీమరణ ప్రయోగము | ,, | మృత్తికాస్నాన ప్రయోగము | 114 |

| విషయములు. | పుట. | విషయములు. | పుట. |
|---|---|---|---|
| గయా శ్రాద్ధఫలము | 115 | దానాదిఫలనిరూపణము | 130 |
| సువాసినీత్వనిర్ణయము | 116 | కారుణ్య విషయము | 136 |
| కర్తృనిరూపణము | ,, | కారుణ్య నిబద్ధములు | 138 |
| కర్తృ భార్యారజస్వలా | 117 | శ్రాద్ధాదులవలన పితృదేవతలు సంతోషించుట | 142 |
| ౧౧ దినంబున జ్ఞాత్యాశౌచము | 118 | పంచగవ్యప్రాశనము | 145 |
| త్రైపక్షికాది శ్రాద్ధకాలము | 119 | (ఆశౌచ నిర్ణయము) | |
| ఊనత్రయములకు కాలము | 119 | రజస్వలాశౌచము | 147 |
| స్నానోదక నిర్ణయము | 120 | జాతాశౌచ ప్రకరణము | ,, |
| జీవత్పితృకు శ్రాద్ధనిషేధము | ,, | మృతాశౌచము | 149 |
| తిలతర్పణ నిషేధము | 121 | పితృగృహమందు కన్యామృతి | 150 |
| దర్భతిలతర్పణఫలము | 122 | మాతాపితృమృతి | ... |
| తాంబూల చర్వణము | 123 | భ్రాతృభగినీల మృతి | 150 |
| మాతృగర్భాంతర్మధ్యే పితృమృతి | 123 | మేన మామమృతి | 151 |
| అనేక మాస ప్రకరణము | 124 | మేనమామ భార్యామృతి | 151 |
| శవమునకుకూడా వెళుటకు నియమములు | 127 | మేనల్లుని మృతి | |
| శ్మశానమునకుపోబడిన శవము జీవించునప్పుడు చేసేవిధి | ,, | మాతామహునియొక్క మృతి | 151 |
| నిత్యకర్మయందు శిలానష్టము | 128 | దౌహిత్రుని మరణము | 151 |
| సంవత్సర విమోకంబున తిథిద్వయ శ్రాద్ధ నిర్ణయము | ,, | మాతామహీ మరణము | ,, |
| మృతతిథినిర్ణయము | 129 | భార్యయొక్క తల్లిదండ్రులమృతి | ,, |
| శ్రాద్ధకాలంబున త్యాజ్యవిషయము | 130 | అల్లుడి మృతి | 152 |
| | | స్యాలకుని మృతి | 152 |
| | | పితృభగినీల మృతి | 152 |
| | | మాతృభగినీల మృతి | 152 |
| | | బాంధవ్య మరణము | 152 |

| విషయములు | పుట |
|---|---|
| జనక తల్లిదండ్రుల మరణము | 152 |
| దత్తకుడిమృతి | 153 |
| ఆచార్యమరణము | 153 |
| అతిక్రాంతాశౌచము | 153 |
| దశాహమాధ్యశ్రుతం | 154 |
| మూడుదినముల లోపలమృతి | 154 |
| మాతాపితృ మృతి | 154 |
| ఔరసపుత్ర మృతి | 154 |
| పది దినములు నైనచో | 154 |
| జ్ఞాతి మృతి | 155 |
| ఆశౌచ సంపాతము | 156 |
| శవస్పర్శ | 158 |
| ధర్మశవమునకు నియమము | 158 |
| (పైతృమేధిక కారికలు) | |
| గృహాలంకరణము | 159 |
| ఉష్ణోదకస్నాన నిషేధము | 159 |
| దేవతార్చన నిషేధము | 159 |
| ఆదమన కాలము | 159 |
| ఆశ్వలాయన గోత్రక్రమం | 160 |
| విప్రార్చన విధిః | 160 |
| పాదప్రక్షాళనము | 160 |
| కర్తృభోక్తృరుపవేశనవిధి | 160 |
| భోక్తురాశౌచమ్ | 161 |
| కర్తురాశౌచం | 161 |
| ప్రారంభవివరణమ్ | 161 |

| విషయములు. | పుట. |
|---|---|
| జానునిక్షేపవిధి | 162 |
| ఘృతపాత్ర నిధానమ్ | 162 |
| చిత్రగుప్తబలినిషేధః | 162 |
| సువాసినీభోజనవిధిః | 162 |
| అగ్నిశ్రవణవిధిః | 162 |
| పితృసూక్త నిషేధః | 163 |
| పిండదానమనౌ | 163 |
| కర్తుశ్శ్రాద్ధశేషాన్నభోజనః | 163 |
| ఉపవాసి శ్రాద్ధశేషాన్న భోజననిషేధః | 163 |
| భిన్నగోత్రాణాంపితృశేషాన్న భోజననిషేధః | 163 |
| శూద్రస్య పితృశేషాన్న దాననిషేధః | 164 |
| శూన్యతిథ్యనంతరదినే కర్తవ్యత్వేవిధిః | 165 |
| సూతకాంతరితశ్రాద్ధనిర్ణయః | 165 |
| సంవత్సరవిమోక శ్రాద్ధవిధిః | 165 |
| శ్రాద్ధనిమంత్రితగాయత్రీసంఖ్య | 166 |
| ఉపనయన వివాహానంతరశేషమాసాపర్యంతం శ్రాద్ధకర్తవ్యం | 166 |
| అనేకశ్రాద్ధసన్నిపాతే...... | 167 |
| గర్భిణీఆశౌచ సస్నాతకాభావః | 167 |

| విషయములు. | పుట. |
|---|---|
| జీవత్పితృకస్య తర్పణనిషేధః | 168 |
| బోధాయనామావాస్యానిర్ణయః | 168 |
| సౌరమాసతిథినిర్ణయః | 168 |
| శ్రాద్ధవిఘ్నే ఆమశ్రాద్ధవిధిః | 168 |
| అపుత్రాయాః రజస్వలాయాః భర్తృశ్రాద్ధవిధిః | 169 |
| పాదప్రక్షాళనవిధిః | 169 |
| పాదప్రక్షాళనోదకమార్జన | 170 |
| ఆచమనప్రకారః. | 170 |
| గంధధారణమ్ | 170 |
| పరివేషణవిధిః. | 171 |
| భోక్తురన్నస్పర్శనిషేధః. | 171 |
| పరివేషణపాత్రాణి. | 171 |
| మధుదానవిధిః. | 171 |
| అథవికిరవిధిః. | 172 |
| వికిరానంతరం ఆచమనాభావేదోషః. | 172 |
| పిండత్రిదానవిధిః, | 172 |
| ఉచ్ఛిష్టసన్నిధిస్వరూపమ్. | 172 |
| ఉచ్ఛిష్టపరిత్యాగః. | 173 |
| భోజనపాత్ర చాలనమ్. | 173 |
| శ్రాద్ధశేషాన్న భోజనవిధిః. | 174 |
| ఏకాదశ్యుపవాసాదినియమే | 174 |
| వైశ్వదేవవిధిః. | 175 |
| శ్రాద్ధాంగతర్పణనిషేధః. | 175 |
| మహాలయతర్పణం. | 176 |
| పితృవ్యాదికారుణ్యశ్రాద్ధేతర్పణవిధిః | 176 |
| సపిండీకరణాను మాసికాదిషు తర్పణవిధిః. | 176 |
| సువాసినీశ్రాద్ధేసువాసినీభోజన | 177 |
| ఆశౌచదినేశ్రాద్ధవిఘ్నే | 177 |
| రజస్వలాకర్తృకభర్తృశ్రాద్ధం | 177 |
| ఆచమన విధిః | 178 |
| శ్రాద్ధేతత్రదాన నిషేధః | 178 |
| పాద ప్రక్షాళనం | 178 |
| రజస్వలాశంకోత్పత్తౌ శ్రాద్ధనిషేధః | ,, |
| పితృపుత్రయోరేకకాలక్షౌర విధిః | 179 |
| వామభాగేజలపాత్ర నిషేధః | 179 |
| రజస్వలాసూతికాపత్యోః రజశుద్ధతా | 179 |
| వ్యుత్క్రమమృతానాం శ్రాద్ధం | 179 |
| ఏకోద్దిష్టవిధిః | 180 |
| విశ్వేదేవాస్త్రయోదశ | 180 |
| తత్తన్నియమాః | 180 |
| ఉపవీతినాకర్తవ్యస్థానాన్యాహ | 181 |
| అథ సోదకుంభశ్రాద్ధవిధిః | 181 |

విషయాస్సమాప్తాః



శ్రీరస్తు.

# మృతికి దోష నక్షత్రములు.



నిర్ణయామృతే॥ శ్లో॥ రోహిణ్యాం వసుపంచకే త్రిపదభే యుగ్మాంఘ్రిభే పైతృభే। నందకామ చతుర్దశీ భృగుకుజార్కేష్వేషు భద్రే తిథౌ। ప్రేత శ్రాద్ధమృతీసపిండ కరణ త్రైపక్షికోనత్రయా। శ్చేద్వాంశత్రయ మాప్నువంతి కురుతే మాసద్విపక్షద్వయే॥

తా॥ రోహిణి, ధనిష్ఠ- శతభిషము- పూర్వాభాద్ర- ఉత్తరాభాద్ర- రేవతి- కృత్తిక- మృగశీర్ష- పునర్వసు- ఉత్తర- చిత్ర- విశాఖ- ఉత్తరాషాఢ- మఘ- ఈనక్షత్రములయందు ప్రేతకర్మయు- మరణము- సపిండీకరణము- త్రైపక్షికము- ఊనమాసికములు మొదలుగాగల ప్రేతకార్యములు చేయకూడదు అనఁగా దోషముగల నక్షత్రములని భావము

## దోషయుక్తతిథివారములు.

పాడ్యమి- విదియ- షష్ఠి- సప్తమి- ఏకాదశి-ద్వాదశి- త్రయోదశి- చతుర్దశి- ఈతిథులు దోషముగలవి. వారములు- శుక్ర, కుజ, భానువారములు దోషముగలవి. శనివారము మాత్రము మధ్యమ పక్షమని కొందఱు చెప్పిరి.

## మంచినక్షత్రములు.

జ్యోతిస్సంగ్రహే॥ శ్లో॥ మృతతిథిషు యదాస్యాత్సోమసౌమ్యార్యవారా। న్యాగిశుభ ఫలదాని ప్రోచ్యతే ధర్మవిద్భిః। తురగ భరణీ పుష్య స్వాతిహస్తార్ద్రమిత్ర। శ్రవణజల సమేతాః జ్యేష్ఠమూలాస్తథైవ। భుజగమపిచపూర్వా ఫల్గునీ నామధేయమ్। సకల మునుగణానాం శస్యతే ప్రేతకార్యే॥

తా॥ అశ్వని- భరణి- ఆర్ద్ర- పుష్యమి- ఆశ్రేష- పుబ్బ- హస్త- స్వాతి- అనూరాధ- జ్యేష్ఠ- మూల- పూర్వాషాఢ- శ్రవణము- ఈనక్షత్రములు ప్రేతకార్యములకు మంచివి, వారములలో సోమ- బుధ- గురువారములు ప్రశస్తములు,

ప్రాచీనగ్రంథే॥ శ్లో॥ మృతేతు దహనేచైవ ప్రేతధిష్ణ్య ప్రవేశనే। పుణ్య క్షేత్రే పుణ్యతీర్థే పుణ్యతీర్థేఽస్థినిక్షేపే। యుగ్మాంఘ్రి భే త్రిపదభే రోహిణ్యాం పైతృభే తథా ధనిష్ఠాపంచకేచాపి ప్రేతకార్యం న కారయేత్॥

తా॥ మృతతిథియందును, దహనమందును, ప్రేతయొక్క గృహమందు ప్రవేశించుటయందును, పుణ్యతీర్థములు సేవించుటయందును, అస్థినిక్షేపణమందును, ద్విపాది- త్రిపాది- రోహిణి- మఘానక్షత్రములయందును, ధనిష్ఠాపంచకముందును ప్రేతకర్మముచేయకూడదని భావము.

గ్రంథాంతరే॥ శ్లో॥ నందాభద్రా కామభూత। భౌమశుక్రార్కవాసరాః। దహనే మరణేచైవ। తద్దోషం త్రిగుణం భవేత్॥

తా॥ ౧-౨ ౬-౭-౧౧-౧౨-౧౩-౧౪ ఈతిథులయందును, రవి-శుక్ర-కుజవారములయందును దహనమరణములు జరిగెనేని అమరణమొందిన స్థలమందు మరణమును దహనమును జరిగిన స్థలమునందు దహనమును మూడుపర్యాయములు జరుగునని తాత్పర్యము

కించ। శ్లో॥ తిథ్యుడు యోగే గ్రామే వారోడ్వోగే వాటికాయామ్ తిథివారోడ్వోగే గేహే మరణం పునర్భవతి॥

తా॥ పైనజెప్పిన దోషతిథులు నక్షత్రములు గూడగా మరణమునొందెనేని యాగ్రామములో తిరిగి మరణము జరుగుననియును, నక్షత్రవారములు గూడెనేని వాటికయందు తిరిగి దహనము జరుగుననియును, తిథివారనక్షత్రములు గూడియుండెనేని మరణమొందిన గృహమందు తిరిగి మరణము జరుగుననియును తాత్పర్యము.

మాసనిర్ణయము॥ శ్లో॥ ద్విపాదే త్రీణిమాసాని త్రిపాదేచ చతుష్టయమ్। తద్గృహం వర్జయేద్ధీమాన్ షణ్మాసం వసుపంచకే॥

టీక॥ ద్విపాదినక్షత్రములగు మృ- చి- ధ- ఈనక్షత్రములయందు మరణమునొందెనేని మూడుమాసములవఱకును- త్రిపాదినక్షత్రములగు- కృ- పున- ఉఫ- విశా- ఉత్తరాషాఢ ఈనక్షత్రములయందు నాలుగుమాసములవఱకును ధ- శత- పూభా- ఉభా- రే ఈనక్షత్రములయందు మరణమునొందెనేని ఆఱుమాసములవఱకును యేగృహమునందు మరణమొందెనో ఆగృహము విడువవలెనని తాత్పర్యము.

# అథ మృతిచక్ర నిర్ణయము

## మృతిచక్రము:

| కృ | ఆశ్లేష | మ |
|---|---|---|
| రో | పుష్య | పూఫ |
| మృ | పున | ఉఫ |
| | ఆర్ద్ర | |
| | ఉ-షా | |
| | శ్రవణ | |
| అ | రేవతి | శ |

శ్లో॥ సూర్యాధిష్ఠితతారకాదిగణయేచ్చక్రే ద్విబాహ్యాంతరే।
బాహ్యాంత్రీణి పునఃపునస్త్రిగణయేదీశాన్య దిక్షుక్రమాత్॥

తా॥ మృతిదినమున సూర్యుడే నక్షత్రమునందుండునో అది మొదలు ఈశాన్యదిక్కు నుంచి చక్రమధ్యము వఱకు ౪ నక్షత్రములను తదుపరి నక్షత్రము మొదలుకొని క్రమము గా లిఖించవలెను. చక్రమధ్యస్థితనక్షత్రము మొదలుకొని తూర్పువఱకు ౪ నక్షత్రములును, క్రమముగా ఆగ్నేయము మొదలు చక్రమధ్యము వఱకు ౪ నక్షత్రములను ఈప్రకారము ఈశాన్యదిక్కునుంచి ప్రాగాదిగా విదిక్కులయందు ౩ ను దిక్కులయందు ౪ ను ఆరోహణావరోహణ క్రమముగా వ్రాసిచూడవలెను,

శ్లో॥ మృతికాలేందునక్షత్రం యత్రతిష్ఠతి తత్క్రమాత్।
అంతరంగే త్రిపక్షస్యాన్మధ్య కక్ష్యాద్విపక్షకమ్।
అంత్యేచ పక్షమేకంస్యాద్బాహ్యే శేషానపోహభాక్॥

తా. మృతికాలనక్షత్రము చక్రమధ్యమందుంటే అగ్రహారము ౪౫ రోజులు విడువవలెను. దానికి చుట్టువున్న ౭ గదులలోవుంటే ౧ ఒకమాసము విడువవలెను, దానికి చుట్టువున్న ప్రహారీలోపలయుంటే ౧౫ రోజులు విడువవలెను, చక్రమునకు వెలుపటనుంటే ఆయింటివారికి దోషములేదు గాని ఆయాదిక్కులయందున్నవారికి దోషము.

ఇతి మృతిచక్ర నక్షత్రవిచార స్సమాప్తః.

అథమాతాపితృభక్తి.

లోకమునందుండు జంతుజాలములో నంతయు మానవజన్మము త్తమము అదిజన్మాంతర సుకృత పరిపాక విశేషముచేతఁగలుఁగ వలసినదేకాని మఱియొక దానివలనఁగలుగునదికాదు, అట్టిదుర్లభమైన జన్మములభించియు మాతాపితృభక్తిజ్ఞాన మనునవి పట్టుపడకపోయిన ఈజన్మమువ్యర్థమైపోవును, కాఁబట్టి నరునకెన్నటికిగాని వానివానితల్లిదండ్రులు జగజ్జననీ జనకస్వరూపులై యుందురు. ఇట్టితల్లిదండ్రులయెడ భక్తిజేయుట ప్రథమకర్తవ్యమని తద్విషయకమైన ప్రమాణము.

శ్లో॥ నాస్తిమాతృసమం దైవం నాస్తిపితృసమోగురుః।
తయోఃప్రత్యుపకారోపి నకథంచనవిద్యతే॥

తా॥ తల్లితో సమానమైన దైవములేదు- తండ్రితో సమానమైనగురుఁడులేదు ఎందుచేతననఁగా ఆతల్లిదండ్రులకు (వారుకనిపెంచి కాపాడుచువచ్చిన ఉపకారమునకై) ప్రత్యుపకారమును యోచించితే యెన్నివిధములను కానరాదు. కావునకృతజ్ఞులమైయుండవలె

శ్లో॥ మాతాపితాచసుప్రీతౌ స్యాతాం పుత్రగుణైర్యది।
సపుత్రస్సకలం ధర్మం ప్రాప్నుయాత్తేనకర్మణా॥

తా॥ తల్లిదండ్రుల నానందపరచుటయే సర్వసుకృత మనఁబడును, అదిలేక యెన్ని పుణ్యములను జేసినను వ్యర్థమని భావము

పుత్రస్వరూపము.

శ్లో॥ పున్నామ్నో నరకాద్యస్మాత్పితరంత్రాయతేసుతః।
తస్మాత్పుత్ర ఇతిప్రోక్తస్స్వయమేవ స్వయంభువా॥

టీక॥ యస్మాత్- ఏందువలన, పున్నామ్నః- పుత్తుఅను పేరుగల, నరకాత్=దుఃఖానుభవమునుండి, పితరం= తండ్రిని. సుతః= కొడుకు, త్రాయతే= కాపాడుచున్నాడో తస్మాత్= అందువలన, స్వయంభువా= స్వయముగా పుట్టిన బ్రహ్మచేత, స్వయమేవ= తానుగానే పుత్రః + ఇతి= పుత్త్రుఁడనిప్రోక్తః= అనిచెప్పఁబడుచున్నాడు అనఁ

గాపుత్రుడు పుట్టుటచే తండ్రికి సద్గతినిచ్చుచున్నాడు, వీడుపుట్టుటచేత తండ్రియొక్క నరక దుఃఖము నివర్తించును-ధర్మమును ప్రజాసంతతి పరంపరను తనతో పోనియ్యక పెంచినదగుటయే తండ్రికిదుఃఖనివృత్తి.

శ్లో॥ అజాతమృతమూర్ఖాణాం మృతాజాతౌ వరౌసుతౌ।
తౌకించిచ్ఛోకదౌపిత్రోర్మూర్ఖస్త్వత్యంతశోకదః॥

టీక॥ (మూడువిధములు సంతానములు- పుట్టనివి- పుట్టిచచ్చినవి, పుట్టిమూర్ఖులయినవి,) అట్టి అజాత=పుట్టనివాడు మృత=చచ్చినవాడు, మూర్ఖాణాం=మూఢుండనెడు ముగ్గురిలో, మృత + అజాతౌ=చచ్చినవాడు పుట్టనివాడనెడు ఇద్దఱును-వరౌసుతౌ = శ్రేష్ఠులైనకొడుకులు, (ఎందువల్లననిన) తౌ=వారలు, పిత్రోః తల్లిదండ్రులకు, కించిత్ + శోకదౌ= కొంచమనఁగా తలచినప్పు డొకప్పుడుమాత్రమే వ్యసనమునిచ్చువారలు- మూర్ఖః + తు=మూఢుండైన కొడుకైనచో అత్యంతశోకదః= మిక్కిలి దుఃఖకరుఁడుగానుండును అనఁగా కొడుకుమూర్ఖుడయ్యెనేని తల్లిదండ్రులు ఎప్పుడును దుఃఖపడుదురనుట

శ్లో॥ జీవతోర్వాక్యకరణాత్ ప్రత్యబ్దం భూరిభోజనాత్।
గయాయాం పిండదానాచ్చ త్రిభిఃపుత్రస్యపుత్రతా॥

టీ॥ జీవతోః= బ్రతికయున్న తల్లిదండ్రులయొక్క,వాక్యకరణాత్=మాట నెరవేర్చుటచేతను-ప్రత్యబ్దం=తల్లిదండ్రులు చనిపోయినవెనుక ప్రతిసంవత్సరము నందును- భూరిభోజనాత్= విస్తారముగా శ్రాద్ధభోజనంబుల నిడుటచేతను-గయాయాం= గయాక్షేత్రమువందు-పిండదానాత్ చ= విష్ణుపదీశ్రాద్ధము చేయుటచేతను-త్రిభిః= ఈమూడింటిచేతనే-పుత్రస్య=కొడుకునకు-పుత్రతా=పుత్రత్వము అనఁగా తండ్రిచెప్పినట్లు వినుచుండి పిదప కృతజ్ఞతతో పితృధర్మమునుపాలించువాఁడు గనుక పుత్రుడనఁబడును,

శ్లో॥ ప్రజయా చపితౄన్ పూర్వానన్నృణో దివిమోదతే।
పుత్రేణలోకాన్ జయతిపౌత్రేణానందమశ్నుతే।
అథపుత్రస్యపౌత్రేణనాకమేవాధిరోహతి।
అతోగృహీయోభవతి పుత్రస్సహ్యపుత్రతా॥

టీ, అనృణః= గృహస్థుఁడై పితృఋణ విముక్తిబొందినవాఁడు-ప్రజాయా= సంతానముచేత-పూర్వాన్ పితౄన్=పితృపితామహ ప్రపితామహులను తన వెనుకటి వారలగు పితృలనందరిని-(పుత్రోత్పాదన రూపధర్మాచరణచే సంతృప్తులంజేసి) దివి=తేజోలోకమువందు- మోదతే= సంతసించును, (మఱియు) పుత్రేణ= ధర్మముగా గలిగినకొడుకుచే-లోకాన్= ఐహికజనులను-జయతి= జయించుచున్నాఁడనఁగా వీనిచే నారంభింపఁబడిన కార్యములను కొనసాగించువాఁడుగను, తమయథ మణ్ణోత్తమణ్ణాదులను నిర్వహించు

కొనువాఁడు గనుక ఉండునట్టివాఁడు కొడుకు గనుక లోకులెల్లఁ దలఁచు తనకు లేకపోవుటయే జయమనవచ్చును, అటుగాక పోయిన- లోకాన్= పారత్రికలోకంబులను=జయించు ననఁగా। నా పుత్రునిచే నియ్యఁబడు తిలోదకాదులచే పుణ్యలోకంబుల నొందుదునని భావము పౌత్రేణ= మనుమునిచే-ఆనంత్యమశ్నుతే= సుఖము ననుభవించుననఁగా నావంశమిట్లే యభివృద్ధినొందెగదా నేను పితృఋణవిముక్తి కొఱకు పుత్రుని బడసినట్లు పుత్రుఁడును పుత్రుని బడసెనని యానందింతును - అథ=అటుపిమ్మట, పుత్రస్య పౌత్రేణ= కొడుకు యొక్క మనుమునిచే-నాకం+ఏవ= బ్రహ్మలోకమునే - అధిరోహతి=ఎక్కుననఁగా నతని పుణ్యంబు బహుళంబని భావము-అతః=అందుకలన యః పుత్రః=ఏ పుత్రుఁడు-గృహీ భవతి= సంసారిగా నేర్పడునో=తస్య= అట్టివానికే- పుత్రితా హి=పుత్రత్వము గలదుగదా- ఎవ్వఁడు కాని ఇట్టివాని కొడుకని పేరుపొంది ధర్మమునవలంబించి సంసారియనంబడి పరోపకార నిరతుండై యుండునో వాఁడు కొడుకు గాని ఎవండో వీడొకయానామధేయుఁడు అబ్బ పేరు చెరుచువాఁడనిపించు మూఢుఁడు కొడుకు కాఁడని తాత్పర్యము

## దానస్వరూపము.

దానము సాత్త్వికమని- రాజసమని- తామసమనియు మూఁడువిధములు

శ్లో॥ దాతవ్యమితి యద్దానం దీయతేఽనుపకారిణే।
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్॥

తా॥ అనఁగా దానము ఇయ్యఁదగినదని తలఁచి తనకుపకారమును జేయని వానికే యుక్తదేశమందును యుక్తకాలమందును తగిన పాత్రమందు నివ్వఁబడుచున్నదో ఆ దానము సాత్త్వికదానమనియును.

శ్లో॥ యత్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వా పునః॥
దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్॥

తా॥ ఏది ప్రత్యుపకారము కొఱకుగాని ప్రతిఫలము కొఱకుగాని వ్యసనముతో నియ్యఁబడుచున్నదో అది రాజసదానమనియును.

శ్లో॥ అదేశకాలే యద్దానం అపాత్రేభ్యశ్చ దీయతే।
అసత్కృతమవజ్ఞాతం తత్తామసముదాహృతమ్॥

తా॥ యే దానము అదేశమందును అకాలమందును, అపాత్రములందును, అమర్యాదతో తెలియకయియ్యఁబడుచున్నదో ఆ దానము తామసదానమని భగవద్గీతా ప్రమాణము కలదు. ఈ మూఁడువిధములైన దానముల

లో మొదటిదైన సాత్త్వికదానము శ్రేష్ఠతమైనదియు, ఆవిధముగ జేయుట చే మిగుల పుణ్యములభించుననియును, రెండవదైన రాజసదానము సాధారణమైనదనియు, ఆరీతిని చేయుటచే పుణ్యములభించదనియు, మూఁడవదగు తామసదానము నింద్యింపదగినదనియు, ఆవిధముగ దానము సేయుటచే పాపమే తప్పకలభించుననియు అనేకప్రమాణములు గలవు.

శ్లో॥ కింతస్య దానైః కింతీర్థైః కింతపోభిః కిమధ్వరైః।
వ్రుదిస్థో యస్య భగవాన్మంగళాయతనో హరిః॥

తా॥ మనమున నీశ్వరధ్యాన నిష్టలేక బయట డాంబికుడై యెన్ని దానములు చేసినను వ్యర్థము, ఎన్నితీర్థములు సేవించినను ఫలములేదు, ఎన్ని తపంబులు సలిపినను లాభములేదు, యెన్ని యజ్ఞముల నాచరించినను నిష్ఫలము హృదయశుద్ధితో దైవమును ధ్యానించుచు జేసిన దానతీర్థతపో యజ్ఞాదులు సఫలంబులని భావము, కావున నెల్లప్పుడును దైవవ్యస్తధియుండై కర్మాచరణము చేయుట మంచిదని ఫలితార్థము-

శ్లో॥ దేశేకాలేచ పాత్రేచతద్దానం సాత్త్వికం స్మృతమ్॥

అన్నట్లు సమయమును కనిపెట్టి దానము చేయవలసినది.

శ్లో॥ కన్యాగతే భాస్కరేతు పితౄణాం దత్తమక్షయమ్।
తా॥ సూర్యేవృశ్చిక సంక్రాంతే నిరాశాః పితరోగతాః॥

సూర్యుని కన్యాయనము మొదలు మహాలయకాలంబున పితృదేవతలకివ్వఁబడినకవ్యము అక్షయంబగును. వృశ్చికసంక్రమణము వెళ్లినపిమ్మట పితృదేవతలు భగ్నాశులై తమవంశస్థులను శపించిపోయెదరన్నట్లు కాలమును దెలిసి కర్మమును చేయవలసినది.

శ్లో॥ దుర్భిక్షేచాన్న దాతారం సుభిక్షే ధనదాయినమ్।
హేమంతే వస్త్రదాతారం గ్రీష్మేంబువ్యజనప్రదమ్।
అతపేఛత్రదాతారం పాదుకా ప్రదమేవచ।
ఆర్తత్రాణ విధాతారం దానశౌండం ప్రచక్షతే।
తద్యోగకాలేయద్దత్తం కించదప్యధికం భవేత్॥

తా॥ కరువులో అన్నమును సుభిక్షకాలంబునధనంబును చలికాలంబున వస్త్రమును గ్రీష్మకాలంబున నీరుగాని మొదలైనవాటిని ఎండకాలమున గొడుగును పాదరక్షలనుభయార్తిసమయంబున అభయరక్షణంబును కోరినయిన నుపయోగించునటుల చేసినవా

డు గొప్పవారలని పేరుపొందగలఁడు, అన్నట్లుయేద్రవ్యమేకాలంబున నెవ్వనికి ధర్మముగ నుపయోగపడునో దానిని వానికప్పుడే యిచ్చుట మంచిది



## ప్రాయశ్చిత్త ప్రకరణము.

యజమానుఁడు బుద్ధిపూర్వకముగనైనను, అజ్ఞానము వలననైనను ప్రమాదమువలననైనను, అనిచ్ఛవలననైనను, పరేచ్ఛవలననైనను చేసిన పాపములకు ప్రాయశ్చిత్తమును జేసికొనవలనని ప్రాయశ్చిత్తకాండము చెప్పుచున్నది

శ్లో॥ ప్రాయశ్చిత్తైరపైత్యేనః అనియుండెను. ప్రాయశ్చిత్తమును నాస్తిక్యాదిభావముచేఁ జేసికొనకయున్న వారలకు,

శ్లో॥ ప్రాయశ్చిత్తమకుర్వాణాః పాపేషునిరతానరాః।
అపశ్చాత్తాపినఃకష్టాన్నరకాన్ యాంతిదారుణాన్॥

తా॥ ప్రాయశ్చిత్తాదులు జరిగించుకొనక పాపనిరతులై పశ్చాత్తాపరహితులైన మానవులు దారుణమైన నరకములను బొందుదురని స్మృతులు ఘోషించుచున్నవి ఆప్రాయశ్చిత్తములు అనేకవిధములుగానున్నవి వానిభేదములు స్మృతులయందును మూలగ్రంథములయందును చూడఁదగును

మను॥ శ్లో॥ ప్రాయశ్చిత్తం చికిత్సాంచ జ్యోతిషం ధర్మనిర్ణయమ్।
వినాశాస్త్రేణ యోబ్రూయాత్తమాహుర్బ్రహ్మఘాతకమ్॥

తా॥ ప్రాయశ్చిత్తమును, ఔషధమును, జ్యోతిషమును, ధర్మశాస్త్రంబును శాస్త్రమూలకముగక చెప్పువాడు బ్రహ్మహత్యఁజేసినవాఁడగును, కావున యజమానుఁడు చేసినపాపములు జక్కఁగ విచారించి తగు ప్రాయశ్చిత్తముపదేశింపవలెను

వృద్ధహారీత సంహిత-షష్ఠాధ్యాయమందు,

శ్లో॥ అగ్నివర్ణాంసుర్వాంపీత్వా సురాపానద్విజాతయః।
మరణాచ్ఛుద్ధిమృచ్ఛంతి శూద్రస్సువ్రతమాచరేత్॥

తా॥ సురాపానముచేసిన శూద్రునకు ప్రాయశ్చిత్తము కలదుగాని, ద్విజులకుకళకళ కాగిన సురను ద్రాగి మృతినొందుటయే ప్రాయశ్చిత్తము, ఈప్రాయశ్చిత్త భేదములు గ్రంథవిస్తర భీతిచే నిచ్చట వ్రాయనైతిని,

తాను జ్ఞానాజ్ఞానమువలన చేసిన పాపములకు వెంటనే ప్రాయశ్చిత్తము జేసికొనవలెను. ౬-౩-౧౪ సం॥ కాలపరిమితి ౭-౫-౩-౧ ఏడుగురుగాని యైదుగురుగాని ముగ్గురుగాని యొకరుగాని బ్రాహ్మణసభ చేసి తాంబూలముతో సువర్ణముగాని వెండిగానివిశేషముగా దక్షిణ సమర్పించి సాష్టాంగ ప్రణామములు జేసి పిమ్మట సభికులు ఏమికార్యముఅనియడిగినపైని, (కర్త) మమజన్మ ప్రభృత్యే తావత్పర్యంతం సమనుష్ఠితానాంజ్ఞానాజ్ఞాన కామాకామసకృదసకృత్కాయిక వాచికమానసిక సాంసర్గికస్పృష్టాస్పృష్ట భుక్తాభుక్త పీతాపీత జ్ఞాతాజ్ఞాత సకలపాతకాఽతిపాతకోపపాతక సంకలీకరణాఽపాత్రీకరణ జాతిభ్రంశకరణప్రకీర్ణ పాతకానాం సర్వేషా మనుగ్రహం కృత్వాప్రాయశ్చిత్త ముపదిశంతు భవంతః॥ అనిపలికి॥

శ్లో॥ సర్వే ధర్మ వివేక్తారో గోప్తారస్సకలాద్విజాః।
మమదేహస్య సంశుద్ధిం కుర్వంతుద్విజసత్తమాః।
మయాకృతం మహాఘోరంజ్ఞాతమజ్ఞాతకిల్బిషమ్।
ప్రసాదః క్రియతాం మహ్యం శుభానుజ్ఞాం ప్రయచ్ఛత।
పూజ్యైఃకృతః పవిత్రోహం భవేయంద్విజసత్తమైః॥

తా॥ ధర్మవిచారణజేసిరక్షించునట్టి ద్విజులారా, నాయందనుగ్రహించిజన్మము మొదలుగ జ్ఞానాజ్ఞానములచే జేసినపాపము నివర్తించునట్లు ప్రాయశ్చిత్తముపదేశించి నన్ను పవిత్రునిజేయుండని ప్రార్థించవలెను. పుత్రాదులుచేయునపుడు(అస్యజన్మప్రభృతి యని యుచ్చరించవలె) అటుపైని సభ్యులువానిశక్త్యనుసారముగ ప్రాయశ్చిత్తము ననువాదకుడగు విప్రునిద్వారా తెలియజేయవలెను, అటుపైనిగంధాదిపరిమళ ద్రవ్యములచే సభ్యుల ననువాదకుని పూజించి యథానుసారముగ దక్షిణసమర్పించవలెను. అటుపైనిసభ్యులుఅముక ప్రాయశ్చిత్తేన పూతోభవత్వ మంగయుతేనయథాశక్తిప్రత్యామ్నాయ ద్వారాచీర్ణేనత్వంశుద్ధోభవిష్యసి॥ యనియనువాదకునిచే తెలియజేసినపైని। అనుగ్రహోయం। అనిపలికిరిక్త తిథియందు నదిమొదలగు పుణ్యక్షేత్రములందు స్నానము ఆచమనము జేసి దేశకాలముల కీర్తించి॥ మమజన్మప్రభృతియని మొదలుగమీద జెప్పినట్లుసంకల్పించి॥ సభ్యోపదిష్టమముక ప్రాయశ్చిత్తం పూతోభవత్వమంగయుతమముక ప్రత్యామ్నాయద్వారాయథాశాలంకరిష్యే॥ నమః॥యనియుచ్చరించి శ్లో॥ యానికానిచపాపానిబ్రహ్మహత్యాసమానిచ। కేశానాశ్రిత్యతిష్ఠంతితస్మాత్కేశాన్వపామ్యహం అనిపలికి॥కక్షోపస్థములు వర్జించివిమ్రాసము-గడ్డము,

గోఘ్నము లేయించుకొని ఆయుగ్మలముని దంతధావనముచేసి" నదియందు స్నానము జేసి ...ముచేసి స్మరించి "సమస్త పాపక్షయార్థం" అనిస్మరించి గోమయము మృత్తికయు గోమూత్రము- గోక్షీరము- పెరుగు- నేయి- కుశోదకము- వీట్లచే స్నానముచేసి- స్నానమహాసంకల్పము నువిని స్నానముజేసి సూర్యనారాయణమూర్తినిమనసా స్మరించి ॥ 3 మాఱును అర్ఘ్యమిచ్చి ॥శుద్ధవస్త్రమును ధరించి బొట్టునుంచుకొనిపిమ్మట గోప్రదక్షిణ మాచరించవలెను.

శ్లో॥ నమస్తేకపిలేభద్రే నమస్తేలోకపావని।
సర్వదేవప్రియేనిత్యం జగత్పూజ్యే నమోనమః॥

యనుచు గోప్రదక్షిణము చేసి అనంతరమందు తన పాపనివృత్తి కొఱకు గోదానము జేయవలెను. ముందుగా బ్రాహ్మణ పూజనొనర్చి యథావిధిగా గోదానము జేయువలెను. అప్పుడు మంత్రము,

శ్లో॥ యజ్ఞసాధన భూతాయా విశ్వస్యాఘప్రణాశనీ।
విశ్వరూపధరోదేవః ప్రీయతాం మేనయాగవా।
గవామంగేషుతిష్ఠంతి భువనానిచతుర్దశ।
యస్మాత్తస్మాచ్ఛివంమేస్యాదిహలోకేపరత్రచ॥

తనశక్తికొలది దానదక్షిణలిచ్చి పిమ్మట దశదానములు పాపహారుడగు విష్ణువునకు ప్రీతిగాజేసి బ్రాహ్మణులను సంతోషపరచి తన శక్తికొలది బ్రాహ్మణసమారాధనము చేయించి లేదా బియ్యము మొదలగు పదార్థములనిచ్చి పంచగవ్యమునకు పూజజేసి పిమ్మట భక్షించి గాని, లేకయాదినముపవాసము జరిపి మఱుదినమునందు పంచగవ్యము భక్షింపవలయును.

## హోమప్రకరణము.

పరాశరస్మృతియందు. శ్లో॥ తస్మాచ్ఛూద్రం సమాసాద్య సదాధర్మపథేస్థితమ్। ప్రాయశ్చిత్తం ప్రదాతవ్యం జపహోమ వివర్జితమ్॥

అని హోమము నిషేధింపఁబడియున్నది కనుక విప్రద్వారము గహోమమనుట చింత్యము-పిమ్మట బంధుభోజనము- దేవతాదర్శనము జేయవలెను. తానుచేసిన పాపములకు ప్రాయశ్చిత్తము మరచిన యె

డల హీనజన్మప్రాప్తి- నరకప్రాప్తి- రోగప్రాప్తి- మూకత్వాంధత్వాది ప్రాప్తి- దారిద్ర్యప్రాప్తి- మొదలగునవి పాపభేదాను సారముగ తత్తత్కాలమ్మాను సారముగా గలుగునని శాస్త్రములవలన తెలియుచున్నందున తాను తెలిసిగల శాస్త్రై పాపనిదాన బులయిన రాజసాదిసకలవృత్తులవలనజనించెడి కామక్రోధాదులనువిడిచిప్రవర్తించుటముఖ్యకర్తవ్యము.



## కర్మాచరణాఫలము.

శ్లో॥ సునిర్వృత్తాః క్రియాచేత్స్యాదా శౌచనియమైస్సహా।
పాప్నువంతి పితౄత్వాం హిప్రయుతాః కర్త్రబ ధనః॥

తా॥ మాతాపితరులు మృతినొందిన సమయమునందు పుత్రులు ప్రేతకర్మములను చక్కగనియమయుతముగ నాచరించెడి యతనిమాతాపితృవులు తత్కాలానుకూలముగ విధింపబడిన పుణ్యలోకములను బొందుదురు. యిదియునుగాక మాతాపితృవులు పితృతేజస్సుము గలవారగుదురు. అట్లగుటచేతఆనందమును బొంది తమపుత్రులు దీర్ఘాయువంతులును తేజోవంతులును ధనవంతులును అగునటుల వాశీర్వచనములనుజేయుదురు, ఆయాశీర్వచనసామర్థ్యమున పుత్రులు సుఖవంతులై యుందురని తాత్పర్యము,

శ్లో॥ పితౄణాంచ ప్రసాదేన కిన్నర్వం శోభిస్యతే। ·
శ్రేయసంచాభివృద్ధిర్స్యాద్వర్యాయసాముత్తరోత్తరమ్॥

తా॥ పితృదేవతలయొక్క యనుగ్రహముచేత పుత్రులయొక్క వంశము అభివృద్ధిని బొందుటయేగాక గొప్పవగు శ్రేయస్సులుగూడ విశేషించికలుగుననితా॥

పురాణోక్తమున జెప్పబడును ఆమశ్రాద్ధమేను॥ సుమంత్రః॥ శ్లో॥
నదాచైవతు మంత్రాణామామశ్రాద్ధం సిధీయతే॥ వృద్ధ్వీచందోదయే॥

శ్లో॥ పురాణోక్తోపి సామాన్యంవృద్ధిశ్రాద్ధంచ సర్వదా।
నమస్కారేణ మంత్రేణకుర్యాదామాన్నపత్సిదా॥

తా॥ పురాణోక్తమగు క్రియలతోను సామాన్యశ్రాద్ధమును వృద్ధిశ్రాద్ధమునుగూడ నమస్కారమంత్రముతో ఆమద్రవ్యముచేతనే చేయవలెనుట,

కించ॥ వేదవ్యాసీయేధర్మశాస్త్రే ప్రథమోధ్యాయః,

శ్లో॥ బ్రాహ్మణక్షత్రియవిశస్త్రయో వర్ణాద్విజాతయః।
శ్రుతిస్మృతిపురాణోక్త ధర్మయోగ్యాస్తునేతరే।

శూద్రోవర్ణశ్చతుర్థోపి వర్ణత్వాద్ధర్మమర్హతి।
వేదమంత్రస్వధాస్వాహా వషట్కారాదిభిర్వినా॥

తా॥ బ్రాహ్మ క్షత్రియ వైశ్యులు మువ్వురు ద్విజాతులు, వీరలు శ్రుతి స్మృతి పురాణ ధర్మయోగ్యులు ఇతరులు కారు, శూద్రులు నాలవవర్ణమువారయినప్పటికిని వర్ణములలో చేయుటవల్ల ధర్మమునకు దగినవారు గాని వేదమంత్రస్వధాస్వాహావషట్కారాదుల కర్హులుగారు, తక్కినవిషయములు నిర్ణయసింధువునందు చూడవలయును,



## ఉత్క్రాంతి విషయము.

ఛందోగపరిశిష్టే॥ శ్లో॥ దుర్బలంస్నాపయిత్వాతు శుద్ధచేలాభిసంవృతే
దక్షిణాశిరసంభూమౌ బర్హిష్మత్యాం నిధాపయేత్।
ఘృతేనాభ్యక్తమాప్లావ్య శుద్ధవస్త్రోపవీతినా।
చందనోక్షిత సర్వాంగే సుమనోభిర్విభూషయేత్।
హిరణ్యశకలాన్యస్య క్షిప్త్వాఛిద్రేషు సప్తసు।
ముఖేష్వథాపిధాన్యేనం నిర్హరేయుస్సుతాదయః॥
కర్ణనేత్రేముఖేఘ్రాణే హిరణ్యశకలంన్యసేత్॥

తా॥ ప్రాణములు క్షీణించగానే స్నానము చేయించి శుద్ధమైన బట్టబరచి దర్భలతో గూడిన భూమియందు దక్షిణశిరస్సుగా బండుకొనబెట్టి శుద్ధవస్త్రోపవీతముగ ఘృతము చేబూసి- చెవులు- నేత్రములు- ముఖము - ఘ్రాణరంధ్రములనను గేడింటియందు సువర్ణశకములనుంచి ముఖముగప్పి కుమారుడు మొదలగువారు గొనిపోవలెననుట

దివోదాసీయమందు—ఋణధేనుదానము.

శ్లో॥ అజన్మప్రార్జితం పాపం మనోవాక్కాయ కర్మభిః।
తత్సర్వం నాశమాయాతు గోప్రదానేన కేశవ॥
యను మంత్రముతో ధేనుదానము చేయవలెను.

వ్యాసవచనము॥ శ్లో॥ ఆసన్నమృతు నాదేయ గాస్సవత్సాతు పూర్వవత్। తదభావేతు గౌరేవ నరకోత్తారణాయవై॥

తా॥ మరణకాలమందు వత్సతోగూడిన గోవునుగానిలేనిగోవు నైనను నరకముద్ధరించుటకు దానముచేయవలెననుట

మదనరత్నమందు జాతుకర్ణ్య వచనమెట్లనిన.

శ్లో॥ ఉత్క్రాంత్యాదీని దానాని దశదద్యాత్స్మృతస్యతు।
గోభూతిల హిరణ్యాజ్య వాసో ధాన్య గుడానిచ।
రౌప్యం లవణమిత్యాహుర్దశదానాన్యనుక్రమాత్॥
ఏతాని దశదానాని నరాణాం మృత్యుజన్మనోః।
కుర్యాదభ్యుదయార్థంతు ప్రేతత్వేపి పరత్రవై॥

తా॥ గోభూతిల హిరణ్యాదిదానములు పదియు జన్మకాలమందభ్యుదయముకొఱకును మరణకాలమందు సుగతికొఱకును జేయవలెను "మరణాంతరమపి ఏతన్నామైవ కర్తవ్యః ప్రాణముపోయినపిమ్మటగూడ పైనజెప్పిన విధిప్రకారము" కర్మములజేయవలయును

## అథ తిలపాత్రదానము.

బ్రాహ్మ్యే॥ శ్లో॥ తామ్రపాత్రంతిలైః పూర్ణం ప్రస్థమాత్రం ద్విజాయతు।
సహిరణ్యంచ యోదద్యాచ్ఛ్రద్ధావిత్తానుసారతః। సర్వపాప విశుద్ధాత్మా లభేత గతిముత్తమామ్॥

తా॥ రాగిపాత్రలో నొకశేరునువ్వులుపోసి యథాశక్తిహిరణ్యముతో బ్రాహ్మణునికి దానముచేసిన సర్వపాపములుపోయి యుత్తమగతిని బొందుదురనుట

## కర్ణమంత్రపఠనము.

పరిశిష్టే.—మ్రియమాణస్య కర్ణేతు పుణ్యాన్మంత్రాజపేత్తతః॥

తా॥ మరణకాలమందు పుణ్యమంత్రముల వానికర్ణమందుజపింపవలెననుట,

పద్మపురాణే॥— శ్లో॥ కృష్ణాయ వాసుదేవాయ హరయే పరమాత్మనే।
ప్రణతః క్లేశ నాశాయ గోవిందాయ నమోనమః॥ ఇమం మంత్రం జపం కుర్యాత్సకృద్వా ప్రత్యహం నరః। సర్వపాప వినిర్ముక్తో విష్ణులోక మవాప్నుయాత్॥

తా॥ కృష్ణాయనమః- వాసుదేవాయనమః విష్ణవేనమః- గోవిందాయనమః అను నీమంత్రంబును ప్రతిదినంబు నొక్కమాఱుజపించిన నరుండు సర్వపాపములనుండితొలగి విష్ణులోకంబును పొందుదురనుట

## షష్ఠీమిత్ర ప్రాయశ్చిత్తవిధి.

స్మృతులయందు చెప్పఁబడిన ప్రకారము- ఊర్ధ్వోచ్ఛిష్టము- అధోచ్ఛిష్టము- అంతరిక్షమరణము. ఆశౌచమరణము- ఖట్వాదిమరణము- అను నానావిధంబులగు మరణముల యందును-చండాలశ్వపచాదులవలనఁ గలిగిన మరణంబులందును విప్రవాక్యానుసారముగా కృచ్ఛత్రయంబులను ప్రాయశ్చిత్తార్థంబుగ నాచరింపవలయును.

అందుకు ప్రమాణము.—స్మృతితత్త్వనిర్ణయే,

శ్లో॥ ఊర్ధ్వోచ్ఛిష్టే హ్యధోచ్ఛిష్టే అంతరిక్షమృతే తథా।
ఆశౌచమరణే చైవ కృచ్ఛత్రయ ముదాహృతమ్॥

తథాచ॥ శ్లో॥ ఊర్ధ్వోచ్ఛిష్టే త్వధోచ్ఛిష్టే ఖట్వాయాం మరణే తథా।
అంతరామరణే చైవ ఆశౌచ మరణే తథా।
అగ్నిహోత్రే మరణే చైవ త్రిభిఃకృచ్ఛ్రైర్విశోధనమ్॥

స్మృతిసంగ్రహే॥ శ్లో॥ అస్నాత్వా మరణే ఘోరే ఆశౌచమరణే సతి।
ఉచ్ఛిష్ట మరణే చైవ ఖట్వాయాంమరణే తథా॥
చండాల శ్వాన సంస్పృష్టే హ్యాకాశ మరణే సతి।
చండాలాన్మరణే వాపి త్రిభిఃకృచ్ఛ్రైః పృథక్ పృథక్॥

శ్లో॥ విప్రవాక్యానుసారేణ పరిత్యాజ్యాయ విధర్వథా।
కృత్వాతుదహనంకార్య మన్యథాకిల్బిషీభవేత్॥

శుధ్యతీతివిశేషః॥ ఇతిషష్ఠీమిత్రప్రాయశ్చిత్తవిధి స్సమాప్తః



## మధుపర్కదానము.

వారాహే॥ శ్లో॥ దృష్ట్వాసు విప్రాలం హ్యేకం యమునాస్నానుసారిణమ్ పరియాణకాలేతునరో మంత్రేణవిధిపూర్వకమ్॥ మధుపర్కంత్వరక్ గృహ్యా ఇమం మంత్ర ముదీరయేత్ ॥ గృహాణచేమం మధుపర్కమాద్యం । సంసారనాశనకరం త్వమృతేనతుల్యం । నారాయణేనరచిత భగవత్ప్రియాణామ్ । దాహేంనశాంతి కరణం సురలోకపూజ్యమ్॥

అన్నేనైవతుమంత్రేణ దద్యాచ్చ మధుపర్కకమ్।
నరస్యమృత్యుకాలేతు పరలోకసుఖావహామ్॥

తా॥ మరణకాలమందు పుత్రులు మొదలైనవారు మధుపర్కము దెచ్చి గ్రహించి యీ శ్లోకము త్రమును చ్చరించి పరలోకసుఖమునిచ్చు మధుపర్కము యివ్వవలెను.

మరణకాల దోషశాంతి విధానము.

యమః-, శ్లో॥ సంతాయాంగాః ప్రదాతవ్యా భద్రేభూమిరనంతరమ్।
విప్రేభ్యోదీయతేయేన సదోషస్త్రవిద్యతే॥
గృహస్థానేషు మృతిప్రాయశ్చిత్తమాహ॥ మార్కండేయః॥

శ్లో॥ భానౌకుజేశనౌవస్త్రం తత్రద్యోగం ప్రదాపయేత్।
భృగోహిరణ్య సహితం వస్త్రదానం విశోధనమ్॥

తదాహమరీచిః॥ శ్లో॥ భద్రేభూమిపరిదానంస్యా త్రిపాదక్షేహిరణ్యదః। వాగేవారాధ స్వైవత్స్యం వాసోదానం విధీయతే॥ రక్తవస్త్రం కుజేభానౌ శ్వేతంశుక్రే ప్రకల్పితమ్। శనైశ్చరేతుసీలంస్యాదేతద్దోషోపశాంతయే॥ దద్యాచ్ఛుద్ధి మవాప్నోతి హ్యదత్వా దోషమాప్నుయాత్ ద్విత్రిపాది నక్షత్రి మరణే వస్త్ర సహిత హిరణ్యాదానం కుర్యాత్॥
ధనిష్ఠా పంచక మరణే ప్రాయశ్చిత్తమాహ.—మదనరత్నే॥

శ్లో॥ ఏకాశీతిపలంకాంస్యం। తదర్థంవా తదర్థకమ్।
నవపత్రిపలంవాపి దద్యాద్వి ప్రాయశ్చిత్తికః॥

పక్షాంతరమాహ॥ శ్లో॥ యమాయధర్మరాజాయ మృత్యవేచాంతకాయచ। వైవస్వతాయకాలయ। సర్వభూతక్షయాయచ।ఔదుంబరాయ దధ్నాయ నీలాయపరమేష్ఠినే। వృకోదరాయచిత్రాయ చిత్రగుప్తాయ వైకరిమాత్।

ఇతి ఆహుతిత్రయం హోమంకుర్యాత్- ప్రేతముఖే హిరణ్యావా-పంచరత్నానివాప్రక్షిపేత్। అథత్రిపుష్కర ద్విపుష్కరాదిమరణే గోభూతిలాదీన్ బ్రాహ్మణాయదద్యాత్॥ విశేషోనిర్ణయసింధౌజ్ఞేయః॥

త్రిపుష్కర మరణము.

| వారములు. | తిథులు. | నక్షత్రములు |
|---|---|---|
| ఆది | ద్వాదశి | మఖ |
| సోమ | ఏకాదశి | విశాఖ |
| మంగళ | దశమి | ఆర్ద్రా |
| బుధ | తృతీయ | మూల |
| గురు | షష్ఠి | శతభిషక్ |
| శుక్ర | ద్వితీయా | రేవతి |
| శని | సప్తమి | ఉ-షా |

నిర్ణయామృతే। శ్లో॥ ద్వాదశ్యర్క మఖాయుక్తా। విశాఖై కాదశీందునా। కుజార్ద్రా దశమీచైవ। ద్వితీయాభృగు రేవతీ। తృతీయాబుధమూలేన। గురుషష్ఠి శతోడునా। సప్తమ్యాషాఢ మందాభ్యాం సప్తయోగాస్త్రి పుష్కరాః॥

అథద్విపుష్కరయోగః॥ మదనరత్నే గార్గ్యః॥

శ్లో॥ యదిభద్రాతిథీనాంస్యాద్భానుభౌమశనైశ్చరైః॥
త్రిపాన్నక్షైశ్చసంయోగోద్వయోర్యోగో ద్విపుష్కరః॥

అథదహననియమః

పుత్రికృతశవము దహనము చేయునపుడు పంచాంగము విచారించ నవసరము లేదు.

గాలవః॥—శ్లో॥ ప్రథమేహనికర్తవ్య వపనంచానుభావినామ్।
ప్రేతస్య కేశశ్మశ్రాదివాపయిత్వాథదాహయేత్॥

తా॥ ప్రథమదినమందు కర్తక్షౌరము జేసికొని ప్రేతకు కేశములు మీసముగడ్డము మొదలుగ క్షౌరము జేయించి యటుపైదహింపవలెనని గాలవవచనము.

మనుః—శ్లో॥ దక్షిణేన మృతం శూద్రం పురద్వారేణనిర్హరేత్॥

తా॥ శూద్రశవము దక్షిణముగ దీసికొనిపోవలెను- అనుప్రమాణముగలదు- లోకమందు సర్వజనులు వారివారి వీలుప్రకారముపోవుచున్నారుగదా,

కమలాకరస్మృతౌ॥ మనుః — శ్లో॥ అనుపాత్రేణాన్న మాదాయ ప్రేత మగ్ని పురస్సరమ్। ఏకోనుగచ్ఛేత్తత్సార్ధ మర్ధమార్గ స్థితో భువి। ఊర్ధ్వ మాదహనం కార్య మాసీనో దక్షిణాముఖః। సవ్యం జాన్వాచ్య శనకై స్సతిలం పిండదానవత్। అథ పుత్రాదిరాప్లుత్య కుర్యాద్దారుచయం మహత్। తతోత్తానం నిపాత్యైనం దక్షిణాశిరసం ముఖే॥

తా॥ క్రొత్తకుండతో అన్నము అగ్నిహోత్రిముదీసికొని ముందుగా కర్తనడువవలెను, వానివెనుక నందరునడుచుచు అర్ధమార్గమందు శవమునుంచి దక్షిణముఖముగా నెడమకాలువంచి తిలలతో పిండదానవిధిగా అన్నము భూమిపైనుంచి యిట్లు మూడు దింపులు జరిపి పుత్రులు మొదలయినవారు స్నానముచేసి కట్టెలుచాలా చితిగాచేర్చి దానిపై దక్షిణశిరస్సుగా శవమును వెలికిలబరుండబెట్టి ముఖమునదగ్ని నిచ్చువరకొందరు అన్నము నడుమ బియ్యమునుపయోగించుచున్నారు.

శుద్ధితత్త్వే - హారలతాయామ్॥ శ్లో॥ స్వగోత్రజైర్గృహీత్వాతు చితాయాం స్థాప్యతే శవః। అధోముఖో దక్షిణాదిక్చరణస్తు పుమానపి। ఉత్తానదేహా నారీతు సపిండైరపిబంధుభిః॥

తా॥ తనగోత్రమువారు శవమును చితిపై బెట్టునప్పుడు పురుషుడైనచో నధోముఖముగను దక్షిణశిరముగను, స్త్రీయైనచో వెలికిలగానుంచవలెను.

ప్రచేతః- శ్లో॥ నగ్నదేహం దహేన్నైవ కించిద్దేయం పరిత్యజేత్॥

తా॥ ప్రేతమును దిగంబరునిగా దహింపఁగూడదు తీసివేయవలసినది మరియేదైనను పరిత్యజింపవచ్చును.

క్రియానిబంధే గరుడః॥ శ్లో॥ ఉదధారామవిచ్ఛిన్నాం సించేత్కర్తా ప్రదక్షిణమ్। స్కంధావసక్తకుంభేన పాదతః పరితశ్చితేః॥

తా॥ నీళ్లతో నిండినకుండను కర్త భుజముపైనుంచుకొని పాదములవైపు మొదలుకొని యవసరముగా దక్షిణముగా మొదలుగ చితిచుట్టును నీళ్లధారపడునట్లు ప్రదక్షిణము చేయవలెను.

మరియు ఏకాలమునందు మాతాపితృమరణము బోధాయనస్మృతిలో దాహాంత మొక్కతంత్రము, సంచయనము నొకతంత్రము, ఉదకపిండదానాదికము వేరువేరుగ జేయునది. అనుగమనమందు నిటుల జేయుచున్నది.

ఇతి దహననియమము సమాప్తము.

ఔశనసస్మృతౌ పంచమాఽధ్యాయే॥—.. శ్లో॥ దత్వా శ్రాద్ధం తతో భుక్త్వా సేవతే యస్తు మైథునమ్। మహారౌరవమాసాద్య కీటయోనిం వ్రజేత్పునః॥ శుచిరక్రోధనశ్శాంత స్సత్యవాదీ సమాహితః। స్వాధ్యాయంచ తథా ధ్యానం కర్తా భోక్తా విసర్జయేత్॥ శ్రాద్ధం దత్వాఽపరశ్రాద్ధం భుంజతే యే ద్విజాతయః॥ మహాపాతకినస్తుల్యా యాంతి తే నరకాన్బహూన్॥

తా॥ శ్రాద్ధకర్తయు- భోక్తయు- మైథునమును జేసినయెడల మహారౌరవనరకము నొంది మఱల పురుగుల రాశియందు బుట్టుచున్నారు. శ్రాద్ధకర్తయు భోక్తయు పరిశుద్ధులై క్రోధరహితులై శాంతులయి సత్యవాదులయి స్వస్థచిత్తులయియుండి వేదమును ధ్యానమును విడువవలయును ఏద్విజులు శ్రాద్ధమును బెట్టి యితరశ్రాద్ధమందు భుజింపుదురో అట్టివారు మహాపాతకిసములయి నరకములను బొందుచున్నారు.

కించ॥— శ్లో॥ ఆమంత్రితో బ్రాహ్మణో వై యోఽన్యస్మై కురుతే క్షణమ్। ఆమంత్రయిత్వా యో మోహాదన్యం వాఽఽమంత్రయేద్ద్విజః॥ స తస్మాదధికః పాపీ విష్ఠాకోఽభిజాయతే। శ్రాద్ధే నిమంత్రితో విప్రో మైథునం యోఽధిగచ్ఛతి॥ బ్రహ్మహత్యామవాప్నోతి తిర్యగ్యోనిషు జాయతే। నిమంత్రితస్తు యో విప్రో హ్యధ్వానం యాతి దుర్మతిః॥ భవంతి పితరస్తస్య తన్మాసం పాంసుభోజనాః। నిమంత్రితస్తు యః శ్రాద్ధే ప్రకుర్యాత్కలహం ద్విజః॥ భవంతి తస్య తన్మాసం పితరో మలభోజనాః॥ తస్మాన్నిమంత్రితశ్శ్రాద్ధే నియతాత్మా భవేద్ద్విజః॥

తా॥ శ్రాద్ధమునందు నిమంత్రితుడై మఱియొక శ్రాద్ధమందు క్షణమును గ్రహించువాడును, ఒకరిని పిలచి మోహముచేత మఱియొకరిని పిలుచువాడును వీరిద్దరధిక పాపులై పురుగుల రాశియందుబుట్టెదరు. ఎవరు శ్రాద్ధమునందు నిమంత్రితుడై మైథునమును చేయునో వాడు బ్రహ్మహత్యను బొంది పశుపక్షి మృగాదులయందు జనించును, ఏదుష్టబ్రాహ్మణుడు నిమంత్రితుడై భోజనముచేసి ప్రయాణము చేయునో అతని పితృదేవతలు మాంసము మాసము ధూళి భుజించువారలగుచున్నారు, ఏద్విజుడు శ్రాద్ధమందు నిమంత్రితుడై కలహమును చేయునో వాని పితరులు ఆమాసము మలమును భుజింపువారగుచున్నారు, అందువలన శ్రాద్ధమందు నిమంత్రితులగు ద్విజులు నియతచిత్తులయి యుండవలయును.

యుగ్మాజీయ్యే॥ శ్లో॥ దంతధావనమభ్యంగం నఖకేశనికృంతనమ్। కర్తా చైవ తు పూర్వేద్యుర్భోక్తా చైవ పరేఽహని। దంతధావనతాంబూలం క్షౌరాభ్యంగమభోజనమ్। రత్యౌషధపరాన్నంచ శ్రాద్ధకర్తా వివర్జయేత్।

తా॥ శ్రాద్ధకర్తయు పూర్వదినమునందు శ్రాద్ధభోక్తయగుదినమునందు దంతధావనము
ను అభ్యంగనమును నఖకేశనికృంతనమును తాంబూలమును క్షౌరమును అభోజనమును
సురతమును పరాన్నమును విడువవలయును. శ్రాద్ధకర్తృభోక్తృ నియమములు సమాప్తము

---

## సర్వప్రాయశ్చిత్తము.

కర్తా సచేలం స్నాత్వా ఆచమ్య॥ ఏవం + ప్రీత్యర్థం + గోత్రస్య నామ
ధేయస్య ఇహ జన్మని జన్మాంతరేషు సమస్తపాపక్షయార్థం సర్వప్రా
యశ్చిత్తమాచరిష్యే॥ అస్తు ఇతి పరిషద్భిః ఆజ్ఞాం గృహీత్వా॥ శ్లో॥ సమస్త + స్వీ
కృత్య...జన్మాభ్యాసాత్ జన్మప్రభృతి ఏతత్ క్షణపర్యంతం మధ్యే వయసి కాలే
బాల్యయౌవన కౌమారవార్ధకేషు జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థాసు మ
నోవాక్కాయ కర్మేంద్రియ వ్యాపారైః రహసి ప్రకాశే చ జ్ఞానతో ఽజ్ఞానత
శ్చత్వయాకృతానాం ప్రకాశకృతమహాపాతక చతుష్టయ వ్యతిరిక్తానాం
ప్రకాశకృతానాం మహాపాతకాతిదిష్టరూప మహాపాతకప్రతాఽతిదేశి
కరూపాతిపాతకానాం ప్రకాశకృతమహాపాతకసమరూపానుపాతకానాం
ఉపపాతకానాం సంకలీకరణానాం మలినీకరణానాం అపాత్రీకరణానాం
జాతిభ్రంశకరాణాం-అవకీర్ణకానాం- ప్రకీర్ణకానాం-రహస్యకృతానాం
మహాపాతకానాం- రహస్యకృతమహాపాతకాతిదిష్టరూప మహాపాతక
ప్రతాతి దేశికరూపాతి పాతకానాం- రహస్యకృత మహాపాతకసమరూ
పాతి పాతకానాం ఉపపాతకానాం-సంకలీకరణానాం- మలినీకరణానాం
అపాత్రీకరణానాం-జాతిభ్రంశకరాణాం అవకీర్ణకానాం- ప్రకీర్ణకానాం
ఏవంబహూనాం బహువిధానాం సర్వేషాం పాపానాం అజ్ఞానతస్సకృ
త్కృతానాం- అజ్ఞానతోభ్యస్తానాం- జ్ఞానతస్సకృత్కృతానాం- జ్ఞాన
తోభ్యస్తానాం- అజ్ఞానతో జ్ఞానతశ్చాత్యంతాభ్యస్తానాం - అజ్ఞానతో
జ్ఞానతశ్చ నిరంతరాభ్యస్తానాం అజ్ఞానతో జ్ఞానతశ్చ చిరకాలాభ్యస్తానాం
బహూనాం- బహువిధానాం- సర్వేషాం పాపానాముపనోదకం ప్రాయ
శ్చిత్తం ఉపదిశేతి విజ్ఞాప్య- పునః ప్రణమ్య తిష్ఠేత్। హే యజమాన- తవ
జన్మాభ్యాసాజ్జన్మప్రభృత్యేతత్క్షణపర్యంతం మధ్యే వయసి కాలే బాల్య

యౌవన కౌమార వార్ధకేషు జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థాసు మనోవాక్కా-
యః కర్మేంద్రియవ్యాపారైః రహసి ప్రకాశేచ జ్ఞానతో ఽజ్ఞానతశ్చ స్వయం
కృతేభ్యః- ప్రకాశకృత మహాపాతక చతుష్టయవ్యతిరిక్తేభ్యః । ప్రకాశ
కృత మహాపాతకాఽతిదిష్టరూపమహాపాతకవ్రతాఽతి. దేశికరూపాతి
పాతకేభ్యః ప్రకాశకృతమహాపాతక సమరూపానుపాతకేభ్యః ఉపపాత
కేభ్యః - సంకలీకరణేభ్యః- మలినీకరణేభ్యః- అపాత్రీకరణేభ్యః జాతి
భ్రంశకరేభ్యః- ప్రకీర్ణకేభ్యః - రహస్యకృతేభ్యో మహాపాతకేభ్యః
రహస్యకృతమహాపాతకాఽతిదిష్టరూపమహాపాతకవ్రతాఽతిదేశిక రూ
పాఽతిపాతకేభ్యః- రహస్యకృతమహాపాతక సమరూపానుపాతకేభ్యః ఉ
పపాతకేభ్యః- సంకలీకరణేభ్యః- మలినీకరణేభ్యః- అపాత్రీకరణేభ్యః-
జాతిభ్రంశకరేభ్యః- అవకీర్ణకేభ్యః- ప్రకీర్ణకేభ్యః- అజ్ఞానతస్సకృత్కృ
తేభ్యః-అజ్ఞానతోఽభ్యస్తేభ్యః- జ్ఞానతస్సకృత్కృతేభ్యః - జ్ఞానతోఽభ్య
స్తేభ్యః- అజ్ఞానతో ఽజ్ఞానతశ్చాత్యంతాభ్యస్తేభ్యః అజ్ఞానతో జ్ఞానతశ్చ
నిరంతరాభ్యస్తేభ్యః అజ్ఞానతో జ్ఞానతశ్చ చిరకాలాభ్యస్తేభ్యః- బహు
భ్యః- బహువిధేభ్యస్సర్వేభ్యః పాపేభ్యః(త్వం)ముక్తో భూయాః ముక్తో
భూయాః ఇత్యనుగృహ్ణంతు భవంతః- ఇత్యుచ్చైర్వదేత్ ॥ ఏవం + గు॥
మమజన్మాభ్యాస జన్మప్రభృత్యేతత్క్షణపర్యంతం - సమస్తదోష పరి
హారణార్థం స్వర్ణధాన్యఆజ్యకృచ్ఛ్రాణ్యాచరిష్యే॥

శ్లో॥ స్వర్ణంపవిత్రమమలం స్వర్ణంపాపప్రణాశనమ్। స్వర్ణంహి
శంకరోయస్మా దతశ్శాంతింప్రయచ్ఛమే॥ బ్రాహ్మణాయ సువర్ణదానం
దద్యాత్ ॥

శ్లో॥ ధన్యాంకరోషిదాతార మిహలోకేపరత్రచ। యస్మాత్తస్మా
చ్ఛివంమేస్యా దతశ్శాంతిం ప్రయచ్ఛమే॥ (ధాన్యం)

శ్లో॥ కామధేనోస్సముద్భూతం సర్వక్రతుషుసంస్థితమ్। దేవా
నామాజ్యమాహారం మతశ్శాంతింప్రయచ్ఛమే ॥ (ఆజ్యం)

శ్లో॥ హిరణ్యగర్భగర్భస్థం హేమబీజం విభావసోః। అనంతపుణ్య ఫలద మతశ్శాంతిం ప్రయచ్ఛమే ॥ (హిరణ్యం)

ఇదం కృచ్ఛ్రప్రత్యామ్నాయం యథాశక్తి హిరణ్యం శ్రీ మహావిష్ణు ప్రీతిం కామయమానస్తుభ్యమహం సంప్రదదే న మమ ॥ శ్రీగోవింద గోవింద ॥ ఏవం + స్థ ॥ సర్వప్రాయశ్చిత్త గోదానమాచరిష్యే ॥ నమః ॥ తదంగ బ్రాహ్మణ పూజాం కరిష్యే ॥ నమః ॥ శ్రీమహావిష్ణు స్వరూపస్య బ్రాహ్మణస్య ఇదమాసనం దదామి ॥ ఉభాభ్యామిదం పాద్యం దదాము ॥

శ్లో॥ నమోస్త్వనంతాయ సహస్రమూర్తయే సహస్రపాదాక్షి శిరోరుబాహవే। సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే సహస్రకోటి యుగధారిణే నమః ॥ అయం గోః + సకలారాధనైః స్వర్చితమస్తు ॥

శ్లో॥ గవామంగేషు తిష్ఠంతి భువనాని చతుర్దశ। యస్మాత్తస్మాచ్ఛివం మే స్యాత్ అతశ్శాంతిం ప్రయచ్ఛమే ॥ అస్మై బ్రాహ్మణాయ + ప్రతిగృహీత్రే శ్రీనామ శర్మణః + నాం శ్రీమహావిష్ణు ప్రీతయే సర్వ ప్రాయశ్చిత్త గోదానం తుభ్యమహం సంప్రదదే న మమ ॥

శ్లో॥ దేవస్య ప్రీతయే దానం గృహ్ణాత్వర్ఘ్యమతుష్టయే। బాహుభ్యాం పుష్టహస్తాభ్యాం పుణ్యకర్మ ప్రవర్తయే ॥

ప్రతిగృహ్ణాతు॥ గోదాన సాద్గుణ్యార్థం దక్షిణాం తు + న మమ ॥. విధి ప్రకారేణ దశదానాని కుర్యాత్ ॥ సర్వప్రాయశ్చిత్తం సమాప్తమ్.

## ఉత్క్రాంతి ప్రయోగము

యస్య పురుషస్య మరణే సంప్రాప్తే సతి- పుత్రాదిః కర్తా శుచిర్భూత్వా- శుచౌ దేశే గోమయేనానులిప్య। తత్ర శుద్ధోదకం సంప్రోక్ష్య। కుశాన్ పరిస్తీర్య। తిలానవకీర్య। పితరం దక్షిణశిరసం నిధాయ ॥ స్నాత్వా ఆచమ్య శ్రీగోవింద గోవింద- కేశవాయ నమః + + + పుణ్యతిథౌ + గోత్రస్య + స్వజన్మాభ్యాసాజ్జన్మ ప్రభృతి మరణకాల పర్యంతం సంభావిత సమస్త పాపక్షయార్థం సుఖేన ప్రాణోత్క్రమణ సిద్ధ్యర్థం ఉత్క్రాంతి సంజ్ఞిక గోదానమాచరిష్యే॥ నమః ॥ తదంగ బ్రాహ్మణపూజాం కరిష్యే॥ శ్రీమ

హావిష్ణుస్వరూపస్య బ్రాహ్మణస్య ఇదమాసనం దదామి। ఉభాభ్యామిదం పాద్యం దదామి॥ నమః॥ అస్తు॥

శ్లో॥ నమోస్త్వనంతాయ సహస్రమూర్తయే సహస్రపాదాక్షిశిరోరుబాహవే। సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే సహస్రకోటి యుగధారిణేనమః॥ శ్రీమహా + అయంవో గంధః అలంకారార్థా ఇమేఅక్షతా స్సంతు తా స్సకలా రాధనై స్స్వర్చితమస్తు॥

శ్లో॥ అత్యుత్క్రాంతౌ ప్రవృత్తస్య సుఖోత్క్రమణ సిద్ధయే। తుభ్యం సంప్రదదే ధేను మిమాముత్క్రాంతిసంజ్ఞికామ్॥ గవామంగేషు + ప్రయచ్ఛమే। అస్మై బ్రాహ్మణాయ శ్రీమహావిష్ణుస్వరూపాయ + గోత్రాయ + బ్రాహ్మణాయ ప్రతిగ్రహీత్రే। శ్రీమాన్ గోత్రః + దాతా ధర్మపత్నీ సమేతోహం యజమానస్య పితుః + గోత్రస్య ... స్య సుఖేన ప్రాణోత్క్రమణసిద్ధ్యర్థం ఉత్క్రాంతిసంజ్ఞిక గోదానం తుభ్యమహం సం - నమమ। శ్లో॥ దేవస్యప్రీతయే దానం గృహ్ణామ్యార్యమతుష్టయే। బాహుభ్యాం పుష్టహస్తాభ్యాం పుణ్యకర్మ ప్రసూతయే। ఇతిగృహ్ణీయాత్। గోదానసాద్గుణ్యార్థం దక్షిణాం తుభ్యమహం సంప్రదదేనమమ। ఇతి దక్షిణాందద్యాత్॥ అనేనమయాకృతేనోత్క్రాంతిసంజ్ఞిక గోదానేన దక్షిణాదానేనచపితుః + గోత్రస్య + సుఖేనప్రాణోత్క్రమణ సిద్ధిరస్త్వితిభవంతో బ్రువంతు। సుఖేన + రస్తు। (స్త్రీణాంతు। మాతృగోత్రాయాః + నామ్న్యాః జన్మాభ్యాసాజ్జన్మప్రభృతి + గోదానమాచరిష్యే నమః ఇతి స్త్రియః।) ఉత్క్రాంతిప్రయోగస్సమాప్తః

## తిలపాత్రదాన ప్రయోగము.

శ్రీగోవిందగోవింద శ్రీమహావిష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య + పుణ్యతిథౌ + పితుః + గోత్రస్య + + + స్య సమస్తపాతకక్షయార్థం సుఖేనప్రాణోత్క్రమణసిద్ధ్యర్థం తిలపాత్రదానమాచరిష్యే। నమః॥ అస్తు॥

శ్లో॥ తిలాఃపాపహరానిత్యం విష్ణోర్దేహసముద్భవాః। పాపంహరతుమేక్షిప్ర మతశ్శాంతింప్రయచ్ఛమే। అస్మైబ్రాహ్మణాయ +

శ్రీమహావిష్ణుప్రీత్యర్థం తిలపాత్రదానంసదక్షిణాకం సతాంబూలం. పితుః × గోత్రస్య + + + స్యసుఖేనప్రాణోత్క్రమణసిద్ధ్యర్థం తిలపాత్రదానంతుభ్యమహం సంప్రదదే (నమమ) పాత్రాభావే హిరణ్యసహిత తిలదానంకుర్యాత్ ॥ఆచమ్య॥ఏవంగుణ + పుణ్యతిథౌ శ్రీపరమేశ్వర ప్రీత్యర్థంస్వర్ణధాన్యాజ్యకృచ్ఛ్రాణ్యాచరిష్యే। బ్రాహ్మణమాహూయ॥

శ్లో॥ స్వర్ణంపవిత్రమమలం స్వర్ణంపాపప్రణాశనమ్। స్వర్ణంహి శంకరంయస్మాదతశ్శాంతిం ప్రయచ్ఛ మే॥ ధన్యంకరోషి దాతార మిహ లోకేపరత్రచ। యస్మాత్తస్మాచ్ఛివం మే స్యాదతశ్శాంతింప్రయచ్ఛ మే॥ కామధేనోస్సముద్భూతంసర్వక్రతుషుసంస్థితమ్। దేవానామాజ్యమాహారమతశ్శాంతింప్రయచ్ఛ మే ॥ హిరణ్యగర్భగర్భస్థం హేమబీజంవిభావసోః॥ అనంతపుణ్యఫలదమతశ్శాంతిం ప్రయచ్ఛ మే॥

స్వర్ణధాన్యఆజ్యకృచ్ఛ్రత్రయ ప్రత్యామ్నాయయథాశక్తిహిరణ్యం శ్రీమహావిష్ణుప్రీతింకామయమానః తుభ్యమహంసంప్రదదే (నమమ) ఏవంగుణ + ధర్మాందశదానానికరిష్యే॥నమః॥ అథదశదానాని॥

శ్లో॥ గోభూతిలహిరణ్యాజ్యవాసోధాన్యగుడానిచ। రౌప్యంలవణమిత్యాహు ర్దశదానాః ప్రకీర్తితాః॥ గోభూతిల + నమమ (అభావేహిరణ్యదానంకుర్యాత్ ) ఇతి తిలపాత్రదానప్రయోగస్సమాప్తః.

— కర్ణమంత్రపఠనము. —

ఏవంగుణ + పుణ్యతిథౌపితుః + సమస్తపాపనివృత్తిద్వారా పుణ్యలోకావాప్త్యర్థం నారాయణాదిదివ్యనామస్మరణమాచరిష్యే॥ నమః॥

శ్లో॥ నారాయణోనామనరోనరాణాం ప్రసిద్ధచోరఃకథితఃపృథివ్యాం అనేకజన్మార్జితపాపసంచయం హరత్యశేషంస్తుతమాత్రఏవ॥ శ్లో॥ గోవిందేతికరబ్రహ్మా గోవిందేతిత్రివర్ణకమ్। సకృదుచ్చారితం యేనవిష్ణుసాయుజ్యమాప్నుయాత్ ॥ ప్రాణతః క్లేశనాశాయ గోవిందాయనమోనమః॥

నారాయణ-గోవింద। కృష్ణ-వాసుదేవ- ఇత్యాదిదివ్యనామా నిష్ఠం

| | |
|---|---|
| అథ కేశవాది నామహోమం కేచిత్కుర్వంతి. | కొందరు కేశవాయనమః అనునది మొదలు కేశవనామముల చేతనే చేయుచున్నారు. |
| ఛేదప్రదేశం సూత్రేణ సంగ్రథ్య | గర్భమును ఛేదించిన స్థలమును నూలితో కుట్టవలెను. |
| ఏవం × ధర్మిణ్యుదర ఛేద ప్రాయశ్చిత్తార్థం గోదానంహిరణ్యదానంచకుర్యాత్ ॥ | గోదానహిరణ్య దానమును చేయవలయును. |
| శిశుఃమృతశ్చేత్ ఖననంకుర్యాత్ ॥ | శిశువుమృతి పొందినట్లాయెనా భూమియందు పాతిపెట్టవలెను. |

ఇతిగర్భిణీమృతిప్రయోగస్సమాప్తః

## సూతికా [రజస్వలా] ప్రాయశ్చిత్తము.

ప్రథమంశుద్ధజలేనస్నాపయిత్వా॥ కర్తా స్నాత్వా॥ పూర్వవస్త్రం పరిత్యజ్య॥ నూతనవస్త్రంధృత్వా॥ శ్రీగోవిందగోవిందఏవంగుణ × తిథౌ మాతుః + గోత్రాయాః × దాయ్యాః ప్రేతాయాః జాతిసూతకమధ్యే [రజోమధ్యే]మరణేనతద్దోష పరిహారార్థంసూతికామరణ రజస్వలామరణ] ప్రాయశ్చిత్తం కరిష్యేనమః॥ ఇతిసంకల్ప్య॥ ప్రేతంశుద్ధజలేనస్నాపయిత్వా॥శుద్ధవస్త్రంధృత్వా॥ప్రాయశ్చిత్తంకృత్వా॥కృచ్ఛ్రత్రయాణిగోదానానిచకుర్యాత్ ।తద్దోషపరిహారార్థంతిలపాత్రదానంకుర్యాత్ । అథవాగ్రే శేగోమయేనానువిప్య॥ నూతనవస్త్రేణమంటపంనిర్మాయ॥ తత్రతండులాన్నిక్షిప్య॥ చతుర్దిక్షుకలశాన్ ప్రతిష్ఠాప్య॥ తీర్థరాజాయనమః ఇతిఉదకంనిధాయ॥తత్కలశేషుపంచపల్లవాన్ పంచామృతాన్ నిక్షిప్య॥ నూతనసూత్రమావేష్ట్య । శ్లో । మృత్తికే బ్రహ్మరూపేత్వం । మృత్తికే విష్ణురూపిణీ । సుకృతందుష్కృతంచైవ మాంపాహియమరాంగణే॥ కలశేషుమృత్తికాంనిధాయ । ఋత్విగ్వరణం కృత్వా॥ అథవరుణపూజాం సమాచరేత్ ।శివ మహేశ్వరస్త్ర్యంభుః...శత...॥ సురాస్త్వా మభిషిం...

సర్వకామార్థసిద్ధయే ॥ అయోధ్యా మథురా...దాయకాః॥ ఇతికలశో దకైః సూతికాయాః [రజస్వలాయాః] శిరసి మార్జయిత్వా శ్వేతవస్త్ర మాచ్ఛాద్య। బ్రాహ్మణేభ్యోదక్షిణాం దద్యాత్ ॥ రజస్వలామృతావ ప్యేవంకుర్యాత్ ॥ శ్రీరామరామరామ॥

౧౦౮ పసుపుముండలు గేసి ౧౦౮ మాఱులు ఆ పేతికుమృత్తికా స్నానములు చేయించవలెను. పిమ్మట మార్జనము చేయవలెను.

ఇతి సూతికా[రజస్వలా]మృతిప్రాయశ్చిత్తస్సమాప్తః॥

విధవా ప్రాయశ్చిత్తము.—

స్నాత్వా। పూర్వోక్త...థౌ అముక గోత్రాయాః అముకనా మ్న్యాఃమమ్మాభ్యాదిజన్మప్రభృత్యేతత్క్షణపర్యంతం సంభావితానాం పాపానాం అన్నన భోజన తాంబూలచర్వణ మలిన వస్త్రధారణ దే హారక్షణ పుణ్యతీర్థరాహిత్య-గంధపుష్పపరిమళాది ద్రవ్యధారణ- ఏకా దశ్యుపవాసరాహిత్య బృందావనతులసీ తీర్థరాహిత్యతిష్ఠన్మాత్రవిసర్జ న- పాపకర్మాచరణ-రహసి పరపురుషభాషణ- నానావిధ దుష్కర్మ యుక్త మాతాపిత్రాది దూషణశ్వశురాదీనాం శుశ్రూషరాహిత్యసదా పరదూషణ దేవబ్రాహ్మణ గురుతిరస్కార పరస్త్రీదోషనిరూపణఆత్మ విక్రయ శిశుహనన గోహననపరద్రవ్యాపహారణ మిత్రద్రోహ భోజన సమయే పంక్తిభేదన అజ్ఞానతో రజస్వలాన్యోన్య స్పర్శాది సంపాదిత మహాపాపానాం కాయికవాచిక మానసిక పాతివ్రత్య ధర్మలోపానాం అజ్ఞానతస్సకృత్కృతానాం అజ్ఞానతో భ్యస్తానాం ప్రకాశకృతా నాం మహాపాతక చతుష్టయ వ్యతిరిక్తానాం ప్రకాశకృతానాం మహా పాతకాఽతిదిష్టరూప మహాపాతక న్యూనాఽతిదేశిక రూపాఽతిపాతకా నాంప్రకాశకృత మహాపాతకసమరూపాను పాతకానాంఉపపాతకానాం సంకలీకరణానాం మలినీకరణానాం అపాత్రీకరణానాం జాతిభ్రంశక రా ణాం అనకీర్ణ కానాంప్రకీర్ణకానాంరహస్యకృతానాం మహాపాతకానాం ఉపపాతకానాంఏవంబహూనాం బహువిధానాంస ర్వేషాంపాపానామప

నోదకప్రాయశ్చిత్తం నిశ్చిత్య। మామనుగృహ్ణంతు భవంతః । అథకృచ్ఛ్ర
త్రయాణాంచ గోదానం చ కుర్యాత్ । శేషం సర్వప్రాయశ్చిత్తవత్ ॥

ఇతి విధవాప్రాయశ్చిత్తం సమాప్తమ్॥

## సువాసినీప్రాయశ్చిత్తము.

ఆచమ్య॥ ఏవం + తిథౌ జన్మాభ్యాసాజ్జన్మప్రభృత్యేతత్క్షణపర్యంతం... విహారణార్థం సర్వప్రాయశ్చిత్తం కరిష్యే॥ దక్షిణాం గృహీత్వా అముకగోత్రాయాః అముకనామ్న్యాః జన్మాభ్యాసాజ్జన్మప్రభృత్యేతత్ క్షణపర్యంతం మధ్యవర్తినికాలే సంభావితానాం పాపానాం వ్యక్తక్రియాపరత్వ హీనజాతిపరపురుషసహవాస దేవబ్రాహ్మణదూషణ గురుతిరస్కార ఆత్మవిక్రయ- రసద్రవ్యాదివిక్రయ, పతివచననిరాకరణ- పరదూషణ- పరస్త్రీదోషనిరూపణ- ఆరంభవ్రతత్యాగ సదాదుర్భాషణ అన్యగృహవాస- సదాకోపస్వభావ- శిశుహనన- గోహనన- పరద్రవ్యాపహరణ- మిత్రద్రోహ- భర్తృశ్వశురశుశ్రూషరాహిత్య భర్తరి దేశాంతరగతే దేహాలంకరణ, కన్యావిక్రయ- విశ్వాసఘాతుక- విషదాయకత్వ- పంక్తిభేదన- శిశువధ- గృహస్థద్రవ్యాదీనాం చౌర్యవిక్రియ- సదామలినత్వ- అజ్ఞానతః రజస్వలాభాండస్పర్శనాదీనాం సర్వేషాం పాపానాం- మహాపాతకానాం ఉపపాతకానాం సంకలీకరణానాం మలినీకరణానాం అపాత్రీకరణానాం జాతిభ్రంశకరాణాం అవకీర్ణకానాం ప్రకీర్ణకానాం రహస్యకృతానాం మహాపాతకానాం రహస్యకృతమహాపాతక సమరూప ఉపపాతకానాం ఉపపాతకానాం ఏవం బహూనాం బహువిధానాం సర్వేషాం పాపానామపనోదకం యథాశక్తి ప్రాయశ్చిత్తం నిశ్చిత్య ఉపదిశంతు మామనుగృహ్ణంతు భవంతః॥ అనుగృహీణ॥ అథకృచ్ఛ్రత్రయం కుర్యాత్। గోదానం చ కుర్యాత్ । శేషం పూర్వవత్ ॥ ఇతి సువాసినీ ప్రాయశ్చిత్తప్రయోగస్సమాప్తః

## దుర్మరణ ప్రాయశ్చిత్తము.

ఏవంగుణ × తిథౌ యజమానస్య పితుః + గోత్రస్య + ... ప్రేతస్య ప్రమాదాచ్చండాలత్వే హతస్య దుర్మరణ... ప్రాయశ్చి

త్తంకరిష్యేనమః। వరుణద్దక్షిణాంగృహీత్వా॥ సమస్తనంత...పదా॥పితుః + దుర్మరణప్రాయశ్చిత్తాధికారసిద్ధిరస్తు॥అథకృచ్ఛ్రత్రయంకుర్యాత్ బ్రాహ్మణానుజ్ఞయా నావాసదీపాన్నవ ధేనుదానాదియథాశక్త్యాచరిష్యే॥ ఇతిసర్వప్రాయశ్చిత్తాదిసర్వంపూర్వవత్ గ్రంథవిస్తరభయాన్నలిఖ్యతే॥

## నారాయణ బలిప్రయోగము.

పితుః + గోత్రస్య + ...ప్రేతస్య పూర్వసంచిత ఇహజన్మనిదుర్మరణజనితపైశాచికనివృత్తిద్వారా శాశ్వతపుణ్యలోకావాప్త్యర్థం దుర్మరణనారాయణ బల్యాఖ్యంకర్మకరిష్యమాణస్తదంగ శ్రేవలిదాండో x పుణ్యాహవాచనంకరిష్యేనమః॥ ఆదౌగణపతిపూజాంకరిష్యే। గణపతిపూజాంపుణ్యాహంకృత్వా। పవిత్రంధృత్వా॥ శ్రీగోవింద గోవిందపూర్వోక్త x తిథౌ పితు + గోత్రస్య x స్యపూర్వసంచితఇహజన్మనిదుర్మరణజనిత పైశాచిక నివృత్తిద్వారా పుణ్యలోకావాప్త్యర్థంయథాశక్తిప్రాయశ్చిత్తం కరిష్యేనమః కరిపద్దక్షిణాం గృహీత్వా సమస్తనంత x కృత్వా॥ పితుః + గోత్రస్య + స్యదుర్మరణజనిత పైశాచికబాధానివృత్తిద్వారా పుణ్యలోకావాప్త్యర్థం నారాయణబల్యధికారం సిద్ధిరస్తు॥అథకృచ్ఛ్రత్రయందద్యాత్॥ అథ నదీతీరేగోమయేన చతురస్రమండలంకృత్వా। తన్మధ్యే రంగవల్లీం కృత్వా॥ నూతనవస్త్రద్వయంపరిస్తీర్య॥ తత్రపంచప్రస్థపరిమితతండులాన్నిక్షిప్య॥ పంచకలశాన్నిధాయ॥

శ్లో॥ ఆయాహిప్రేతగంభీరైః పూర్వైస్సౌమ్యైః పథోత్తమైః॥ ప్రజానాంస్మభ్యమాయచ్ఛ రయిందీర్ఘాయుదేవచ॥ ఇతిమంత్రేణమధ్యకలశే ప్రేతమావాహ్య।

శ్లో॥ పూషాంగోపాయమహాయూనా త్వద్వపాపాపనుత్తయే! నహానిరసంగత స్సుస్తానంతరాంగిరః। ఇతి పూర్వకలశే నారాయణమావాహ్య॥

శ్లో॥ వృషాధిరూఢందేవేశం సర్వలోకైకకారకం। ధ్యాయేద్విహస్తదిభిస్తుత్యంమమపాపంవ్యపోహతు॥ ఇత్యుత్తరకలశేరుద్రమావాహ్య॥

శ్లో॥ విరించిం వాక్పతిం శ్వేత పద్మస్థం పద్మసన్నిభం । అక్షస్రక్కుండి
కాభీతి దానహస్తం విభావయే । ఇతి పశ్చిమకలశే బ్రహ్మాణమావాహ్య॥
శ్లో॥ రక్తదృష్టిం పాశహస్తం యమం మహిషవాహనం । కాలాంతకరాళ
వదనం నీలాంగం భీషణం భజే॥ ఇతి దక్షిణకలశే యమమావాహ్య॥ అథ
ఇంద్రాద్యష్టదిక్పాలకానావాహ్య॥
శ్లో॥ ఇంద్రోమరావతీనాథః శచీదేవ్యాస్తు నాయకః। వజ్రాయుధశ్చ ప్రా
చీశః తస్యచైరావతో గజః॥ ఇంద్రం సాంగం + స్థాపయామి పూజయామి॥
శ్లో॥ అగ్నిస్తేజోవతీవాసీ స్వాహాదేవ్యాః ప్రియః పతిః। మేషారూఢ
శ్శక్తిధరః దిశ్యాగ్నేయ్యాం ప్రతిష్ఠితః॥ అగ్నిం లోకపాలకమా + మి॥
శ్లో॥ యమస్సంయమనీనాథః శ్యామలాయామనః ప్రియః। దండభృ
న్మహిషారూఢో దక్షిణస్యాం దిశిస్థితః॥ యమం లోకపాలకమా + మి।
శ్లో॥ కృష్ణాంగనాపురంయస్య దీర్ఘాభార్యానగోహయః త్రికుంతో
నిరృతిశ్చ నైరృత్యాం దిశిసంస్థితః । నిరృతిం లోకపాలకమా + మి॥
శ్లో॥ పుర్యోశ్రద్ధావతీయస్య ప్రియభార్యాచ కాళికా। నక్రవాహః పాశ
ధరో వరుణః పశ్చిమేశ్వరః॥ వరుణం లోకపా + మి॥
శ్లో॥ వాయుర్గంధవతీనాథః కించనస్యాం జనాప్రియా । సారంగవా
హో ధ్వజభృత్ వాయవ్యాం దిశివర్తతే॥ వాయుం లోకపా + మి॥
శ్లో॥ కుబేరశ్చాలకాయాంతు చిత్రరేఖాప్రియాంగనా। వాయోర్వా
హః ఖడ్గధరః ఉదీచ్యాం దిశివర్తతే॥ కుబేరం లోకపా + మి॥
శ్లో॥ యశోవతీశ ఈశానః పార్వతీపతిరీశ్వరః । ఈశాన్యాం దిశిసంభా
తి వృషారూఢస్త్రిశూలభృత్ । ఈశానం లోకపాల + మి॥
శ్లో॥ శుద్ధస్ఫటికసంకాశం సహస్రాదిత్యవర్చసం । పిలజీమూతసంకా
శం నీలాంజనసమప్రభం॥ క్షేత్రపాలకమావా + మి॥
శ్లో॥ మహావిష్ణుం శంఖపద్మ సుదర్శనగదాధరం। ధ్యాయేహం నీలగా
త్రాంగం పద్మస్థ కమలాపతిం॥ విష్ణుమా + మి॥ అచ్యుతమావాహయామి॥
అనంతమావాహయామి॥ గోవిందమావాహయామి॥ అథకలశేషు

పంచామృతాని పంచరత్నాని పంచత్వక్పంచపల్లవానిచనిధాయ॥ అథకల
శపూజాంకరిష్యేనమః॥ శ్లో॥ కలశస్యముఖే + సమాశ్రితాః॥ గంగేచయ
మునేకృష్ణే...కురు॥ ఆయాంతు...సంప్రోక్ష్య॥ శ్లో॥ శిరశ్శ్రోత్రంతథా
నాసామోష్ఠం జిహ్వాంతథైవచ। కంఠంకుక్షించహృదయం కటింబాహూ
తథాంగుళీః। ఊరూజానూచపాదాంతం తత్రన్యాసంవినిర్దిశేత్॥ స్థిరో
భవ...స్థిరాసనంకురు॥ అథషోడశోపచారపూజాంత్సమాపయేత్॥ అత్ర
కేశవాది చతుర్వింశతినామపూజాంకుర్యాత్॥ క్షీరాన్నంనివేద్య॥ పితుః
దుర్మరణజనితపైశాచిక విముక్తిద్వారా పుణ్యలోకావాప్తింకరోతు॥ పు
ణ్యలోకావాప్తిరస్తు॥ అథ హోమవిషయోవైకల్పికః॥ తత్కరణే బ్రాహ్మ
ణైః కార్యః॥ హోమార్థంఋత్విగ్వరణంకుర్యాత్॥ ఏవంగుణ...తిథౌ
పితుః...గోత్రస్య...స్యశాశ్వతి పుణ్యలోకావాప్త్యర్థం- అంధత్వమూ
కత్వకాణత్వబధిరత్వపైశాచికబాధానివృత్త్యర్థం తదుక్తహోమంకరిష్యే
నమః॥ అగ్నిప్రతిష్ఠాపనాది హోమప్రయోగాంతంబ్రాహ్మణైః కార్యః॥
అత్రతిలాజ్య తండులకునసహిత హోమంకుర్యాత్॥ యజమానస్యాపి

ప్రేత...గోత్రాయ...ఇదంనమమ। బ్రహ్మణేనమః॥ రుద్రాయనమః॥ య
మాయనమః॥ వైవస్వతాయనమః॥ శ్లో॥ పూషాతోషాయమేభూయా
త్సర్వపాపానుత్తయే। సహస్రకిరణంవీత స్సముస్తాశాంతరాంతరః॥
శ్రీనారాయణాయ...ఇదంనమమ॥ శ్లో॥ శంఖచక్రగదాపద్మరాజమాన
కరాంబుజం। సువర్ణవర్ణపురుషమూర్తింహృదివిభావయే॥ నారాయ
ణాయ ఇదంనమమ॥ఇతి అష్టోత్తరశత హోమంకుర్యాత్॥ ౧౦౮॥ అథా
ష్టదిక్పాలకహోమంకరిష్యే॥ ఇంద్రాయనమః॥=== ఈశానాయనమః॥
ఊర్ధ్వపురుషాయనమః॥ పృథివ్యైనమః॥ అగ్నయేనమః॥ రుద్రాయనమః॥
అస్మిన్ కర్మణిమంత్రవిపర్యాస కాలవిపర్యాస కర్మవిపర్యాస సమస్త
ప్రాయశ్చిత్తార్థం కేశవాదిహోమం కరిష్యేనమః॥ కేశవాయనమః॥...
శ్రీకృష్ణాయనమః॥ అథశుద్ధోదకమార్జనంకుర్యాత్॥ ఆచార్యాయబ్రాహ్మ
ణ్యే దక్షిణాందద్యాత్॥ తతోబలిప్రదానార్థం దక్షిణాభిముఖోభూత్వా॥

గోమయేన అష్టదిక్షు మండలాని కృత్వా। తత్ర దర్భాన్ పరిస్తీర్య। దర్భోప
రి తిలోదకం దదామి॥ ౮॥ ఏవం గుణ...తిథౌ పితుః... గోత్రస్య...స్య దుర్మర
ణజనిత పైశాచిక బాధా నివృత్త్యర్థం నారాయణబలి ప్రదానాని కరిష్యే
నమః। నారాయణాయ ఇమం పిండం దదామి। రుద్రాయ ఇమంపిండం
దదామి। వైవస్వతాయనమః। ఇమంపిండం దదామి॥ తతః సంకర్షణాది
కృష్ణాంతేభ్యః పిండాన్ దద్యాత్। ఏతేషాం తిలోదకాని కుర్యాత్। అథ గో
దానాని దశ దానాని చ కుర్యాత్॥ అనేక దుర్మరణ జనిత పైశాచిక బాధా
నివృత్త్యర్థం దుర్మరణ బలిప్రదానైః...పితుః...గోత్రస్య...స్య శాశ్వత
విష్ణులోకావాప్తిరస్త్వితి భవంతో బ్రువంతు। శాశ్వత...రస్తు। నారా
యణ-బ్రహ్మ-రుద్ర-యమాః కలశోదకాని మధ్యమకలశే కించిన్నిక్షిప్య।
కర్తా శేషోదకేన ఆత్మానంమార్జయేత్। బలిపిండానుద్వాస్య। మంటప
దానం ఆచార్యాయ దద్యాత్॥ మధ్యమ కలశోదకం దహనదేశే అథవా
అన్యదేశే నిక్షిపేత్॥ స్నాత్వా॥ శుద్ధవస్త్రాణి ధారయేత్॥ బ్రాహ్మ
ణానాహూయ॥ పవిత్రం ధృత్వా॥ ఏవంగుణ...తిథౌ పితుః...గోత్రస్య...
స్య దుర్మరణ నారాయణ బలిశ్రాద్ధం కరిష్యే నమః॥ పరిషద్దక్షిణాం గృ
హీత్వా॥ సమస్తసంప...కర్తుం అధికార సంపదస్తు॥ ఏవం...థౌపితుః...

గోత్రస్య...స్య దుర్మరణ నారాయణబలిశ్రాద్ధం ఏకోద్దిష్టవిధానేన సదై
వమద్య కరిష్యే నమః॥ పితుః...స్య నారాయణ బలిశ్రాద్ధే కుశచ్ఛేదనం
కుర్యాత్। విష్ణుపానుగ స్థానేక్షణః కర్తవ్యః క్షణం దదామి॥ బ్రహ్మపా
నుగ స్థానేక్షణం దదామి। రుద్రపానుగస్థానేక్షణం దదామి। యమపాను
గస్థానేక్షణం దదామి। వైవస్వతపానుగస్థానేక్షణం దదామి। పితుః... గో
త్రస్య...స్య స్థానేక్షణం దదామి। అక్రోధనైశ్శౌ...శ్రాద్ధకర్మ కరిష్యే।
అథ గోమయేన షణ్మండలాని కృత్వా। పాద్యస్థానే నాతుతా ఇమే కుశాః-
పుష్పసహిత ఇమే అక్షతాః- అయం గంధః- ఇమే కుశాః సకలారాధనైః...
మస్తు॥ ఏవం షణ్మండలాన్యభ్యర్చ్య। పితృమండలే తిలేన కార్యం। విష్ణు
పానుగ స్వాగతం నమః స్వాగతమిదం తే పాద్యం నమః॥ నమో బ్రహ్మణ్య...

నమోనమః॥ ఏవం క్రమేణపాదావ్రక్షాళనంకుర్యాత్ । కర్తాస్వయంచ పాదౌప్రక్షాళ్య॥ అథ సర్వత్రవిష్టరందద్యాత్ । ఏవం...పితుః...గోత్రస్య.. స్య నారాయణబలి శ్రాద్ధకర్మకరిష్యేనమః॥తిలాః॥ కేత్॥ సర్వే ఆహ్మద్రవ్య పదార్థాశ్చ చ హోభవంతు॥ అథ సర్వత్రావాహనాఽననతిలాసదద్యాత్ । అథార్ఘ్యం । విష్ణునానుగ ఇదం తే అర్ఘ్యందదామి॥ బ్రహ్మనా + అర్ఘ్యందదామి । రుద్రనా × అర్ఘ్యందదామి । యమసానుగ ఇదం తేఅర్ఘ్యందదామి॥ వైవస్వత సానుగ ఇదం తేఅర్ఘ్యందదామి॥ పితః × గోత్ర...ఇదం తేఅర్ఘ్యందదామి । ఇతి ప్రత్యేకప్రత్యేకం బ్రహ్మణహస్తేఅర్ఘ్యందద్యాత్ । సర్వత్రగంధందద్యాత్ । అలంకారార్థం అక్షతాః దద్యాత్ । శీతవాతోష్ణ...ప్రయచ్ఛమే॥ సర్వత్రవస్త్రదానం దద్యాత్ । తదభావేఇమేకుశాః॥ ఇతిఅర్చనం సంపూర్ణమ్...స్తు॥

{ బ్రాహ్మణులవద్ద (విస్తళ్ళు) వేసి-బియ్యము-పెసలు-మినుములు-నేయి-మిర్చి మొదలగునవి తనశక్తికొలదిసమర్పింపవలయును. }

శ్లో॥ పుండరీకాక్షగోవింద వాసుదేవజనార్దన । మయార్పితమిదంద్రవ్యం పవిత్రింకురుసర్వదా॥ విష్ణుసానుగఇదమామంసోపస్కరం సదక్షిణాకం సతాంబూలం విష్ణుసానుగప్రీతియే సంప్రదదేనమమ॥ బ్రహ్మసానుగఇదమామం...సంప్రదదేనమమ॥రుద్రసానుగఇదమామం...నమమ వైవస్వతసానుగఇదమామం + నమమ॥ మేనోత్రాయ + య ఇదమామం + నమమ॥గయాయాంద త్తమస్తు॥ ఏవంగుణ × తిథౌ పితుః + గోత్రస్య × స్య నారాయణ బలిశ్రాద్ధేపితరం + గోత్రం + ఉద్దిశ్యత్వయాకృత నారాయణ బలిశ్రాద్ధేనపితుః + గోత్రస్య × స్య దుర్మరణజనిత పైశాచికబాధానివృత్తిద్వారా పుణ్యలోకావాప్తిరస్త్వితిభవంతో బ్రువంతు॥ దుర్మరణ + రస్తు॥ (తిగదశంత్య శేత్) ఆమవాత్రేఅమృతభోజనేతృప్తిరసీతికర్తాతృప్తోభవఇతిబ్రాహ్మణాఃవదేయుః॥ఏవం + తిథౌపితుః ...గోత్ర...స్య దుర్మరణజనిత పైశాచికబాధానివృత్త్యర్థం తిలోదకపిండప్రదానానికరిష్యేనమః॥ పూర్వభాగేవిష్ణుపిండం- పశ్చిమభాగే బ్రహ్మ

పిండం- ఉత్తరభాగే రుద్రపిండం- దక్షిణభాగే యమపిండం - పురోభాగే
వైవస్వతపిండం- మధ్యే ప్రేతపిండందద్యాత్ ॥ అథగోమయేనానులిప్య॥
దర్భాన్ పరిస్తీర్య॥ దర్భోపరితిలోదకందదామి॥ విష్ణుసానుగప్రీతయేఏష
తేపిండోనమమ॥ గయాయాందత్తమస్తు॥ బ్రహ్మసానుగప్రీతయే ఏషతే
పిండోనమమ॥ గయాయాందత్తమస్తు॥ రుద్రసా... మస్తు॥ యమసానుగ
...మస్తు॥ వైవస్వతసా...మస్తు॥ ప్రేతే...గోత్రాయ...యఏషతే పిండో
నమమ॥ గయాయాందత్తమస్తు॥ తూష్ణీంపిండశేషంనిధాయ॥ పిండోప
రితిలోదకందదామి॥ పిండపూజాంకృత్వా ॥ గోదానంకృత్వాః పితుః...
గోత్రస్య...స్య దుర్మరణజనిత నారాయణ బలిశ్రాద్ధ పిండప్రదానేన
పితుః...దుర్మరణజనిత పైశాచికబాధానివృత్తిద్వారా పుణ్యలోకావా
ప్తిరస్త్వితిభవంతో బ్రువంతు ॥ యజమానస్యపితుః...దుర్మరణ...రస్తు॥
తిలోదకంత్యజేత్ ॥ అంధత్వ మూకత్వ కాణత్వ బధిరత్వ పైశాచిక బా
ధానివృత్తిరస్తు॥ గయాయాంపిండసద్మశాభవంతు ॥ పిండానుద్వాసయి
ష్యే॥ ఉద్వాసయ (సవ్యం) అయోధ్యా మధురా...శతం॥ పిండస్థానే
శాంతిరస్తు- పుష్టిరస్తు- తుష్టిరస్తు- వృద్ధిరస్తు- గృహే ధనధాన్యసమృ
ద్ధిరస్తు॥ తతః బ్రాహ్మణాశీర్వాదః॥ గోత్రాభివృద్ధిరస్తు॥ వంశాభివృద్ధిరస్తు॥
అస్యగృహే శ్రీమహా...రస్తు ॥ ఏవం నారాయణబలిశ్రాద్ధంపూర్వా
హ్ణేకార్యం॥ దుర్మరణబాధావిముక్తింకరోతు॥ ఇతిఅపరచంద్రికాయాం
దుర్మరణ నారాయణ బలిప్రయోగస్సమాప్తః॥

{ కొందరు కేశవాది పదిరెండు నామంబులుచేతపన్నిద్దఱుబ్రా
హ్మణులను ప్రేతోద్దేశంబుగానొకవిప్రునిన్ని మొత్తము ౧౩ గురి
ని నియమించుదురు- ప్రేతశబ్దములు వసుశబ్దములు మొదలగున
వి దేశాచారముల ననుసరింపవలయును. }

## పునర్దహన క్రియ.

స్మృత్యంతరే॥ శ్లో॥ దేశాంతరమృతానాంతు రాజభిర్వావిషాదిభిః॥
తేషామంగంకళాశాద్యైః కృత్వాదేహంపునర్దహేత్॥

తా॥ దేశాంతరమందు మరణము నొందినవానియొక్కయు, రాజదండనచే మృతినొందిన వానియొక్కయు, విషాదులచే మరణము నొందినవానియొక్కయు, శరీరమును పలాశాదులచే నిర్మించి పునర్దహన సంస్కారమును జేయవలెను.

## అథ విషూచీ మశూచీ జాద్యమృతిః

శ్రాద్ధమయూఖే మార్కండేయః॥ శ్లో॥ మారీతుద్వివిధా ప్రోక్తాతంత్రేషువివిధేష్వపి। మశూచి రేకమగదం విషూచిరపరే విదుః ॥ ఏతద్వ్యాధిమృతా యేచ హ్యసంస్కార్యాన రైస్తదా। ఖననం కార్యమిత్యాహుర్మునయః కాలకోవిదైః॥ పంచమే చైవ పక్షే తు కార్యా చోత్తరక్రియా । నియమం చైత దుల్లంఘ్య కామాదజ్ఞానతోపివా । కుర్వంతియే నరాస్తేతు హ్యశుభం ప్రాప్నువంతిహి॥ ప్రేతస్యచాంధ నరక ప్రాప్తి రేవన సంశయః। క్రేతంత్రం ప్రకుర్యుస్తేన్వాస్య వర్ణానుసారతః॥

తా॥ కలరావ్యాధులచేతగాని. మశూచిబాధలచేగాని ప్రజలు మృతిబొందినప్పుడు వెంటనే ఖననముచేసి ౫ పక్షమందు ప్రేతమునకు జరుపవలసిన మంత్రసల్లాపము మొదలగు ప్రేతశ్రాద్ధములన్నియు జరుపవలెను కొందరు యీమార్గమును అవలంబింపక వెంటనే శ్రాద్ధములుచేయుదురు ఆపక్షమందు ప్రేతకు, నరకప్రాప్తియు, కర్తలకశుభమును వాటిల్లునని శ్రాద్ధమయూఖమందు చెప్పఁబడినది,

## నారాయణబలి కాలపరిమితిః.

దుర్మృతస్య పురుషస్య సంస్కారాత్పూర్వం వత్సరాంతే షాణ్మాసే త్రిమాసేవా త్రిపక్షే వా సద్యోవా యథోక్త ప్రాయశ్చిత్తం కృత్వా నారాయణబలింకృత్వా మంత్రసంస్కారంకుర్యాత్ ।

కేచిత్పక్షః॥ ప్రేతతంత్రం నిర్వర్త్య తతః ఏతన్నియమేన నారాయణబలింకార్యమితి కేచిత్ ॥

## పవిత్ర నిర్ణయము.

లిఖితధర్మశాస్త్రే॥ శ్లో॥ చతుర్భిర్దర్భపుంజైస్తు బ్రాహ్మణస్యపవిత్రకమ్।
ఏకైకంన్యూనముద్దిష్ట వర్ణానాంతుపవిత్రకమ్॥

తా॥ బ్రాహ్మణునికి నాలుగుదర్భలచేతను, క్షత్రియునికి మూడుదర్భలచేతను, వైశ్యునికి రెండుదర్భలచేతను, శూద్రునికి నొకదర్భచేతను, పవిత్రమును జేయవలయును.

శ్లో॥ కుశమూలేస్థితో బ్రహ్మ కుశమధ్యే జనార్దనః।
కుశాగ్రే శంకరస్తిష్ఠేత్ త్రయో దేవ వ్యవస్థితాః॥

తా॥ కుశమొదలు బ్రహ్మ- కుశమధ్యమందు విష్ణువు కుశాగ్రమందు శంకరుండు నుందురు. కాబట్టి ఈముగ్గురు దేవతలు దర్భయందు వ్యవస్థితులైరి.

శ్లో॥ జపేదానేచ హోమేచ స్వాధ్యాయే జలతర్పణే। యజ్ఞోపవీతే మాంజ్యాంచ తథా కుశపవిత్రకే। బ్రహ్మగ్రంథింవిజానీయా దన్యత్రతు యథారుచి ॥

తా॥ జపకాలమందు, హోమకాలమందు, దానకాలమందు, అధ్యయనకాలమందు జలతర్పణకాలమందు, యజ్ఞోపవీతమందు, మౌంజియందు అటుగనే కుశలోఁ జేయఁబడిన పవిత్రమందు బ్రహ్మముడి, వేయవలయునని తెలిసికొనవలయును ఇతరకర్మల యందు ఇష్టమైనముడి వేయవలయును.

శ్లో॥ అంగుష్ఠమూలేచ తథా ప్రాజాపత్యంవిచక్షణైః । అంగుళ్యగ్రే స్మృతం దైవం పిత్ర్యం తర్జనిమూలకే ।

తా॥ బొట్టనవ్రేలడుగున బ్రహ్మతీర్థము, వ్రేళ్లకొనయందు దైవతీర్థము, తర్జని వ్రేలడుగున పితృతీర్థము, చెప్పఁబడినదని తాత్పర్యము.

ఇతి అపరచంద్రికాయాం పవిత్రనిర్ణయస్సమాప్తః.

## మండల విధానము.

లిఖితస్మృతౌ పంచమోఽధ్యాయః॥ శ్లో॥ చతురశ్రం బ్రాహ్మణస్య త్రికోణం క్షత్రియస్యచ । వర్తులంచైవ వైశ్యస్య శూద్రస్యాభ్యుక్షణం స్మృతమ్ ॥

తా॥ బ్రాహ్మణునకు చౌకము - క్షత్రియునకు ముక్కోణము - వైశ్యునకు గుండ్రము - శూద్రునికి నీరుచల్లుట చెప్పఁబడియున్నవి.

లఘుఅత్రిసంహితాయాం పంచమోఽధ్యాయః॥ శ్లో॥ బ్రహ్మ విష్ణుశ్చ రుద్రశ్చ శ్రీహుతాశనఏవచ । మండలాన్యుపభుంజంతే తస్మాత్కుర్వంతి మండలం । యాతుధానాః పిశాచాశ్చ క్రూరాశ్చైవతు రాక్షసాః॥ హరంతి రసమన్నస్య మండలేన వివర్జితే। గోమయం మండలం కృత్వా భోక్తవ్యమితి నిశ్చితమ్ ॥

తా॥ బ్రాహ్మణుని మండలమునకు బ్రహ్మయు, క్షత్రియుని మండలమునకు విష్ణువు, వైశ్యునిమండలమునకు రుద్రుఁడు, శూద్రునిమండలమునకు శ్రీహుతాశనుఁడు నధిదేవతలై యామండలముననధివసింతురు గావున మండలములనెల్లప్పుడు చేయవలయును అట్లు చేయనియెడల రాక్షసులు పిశాచాదులు క్రూరులైన యసురులు యన్నాగమును నపహరించెదరు. ఇతి అపరచంద్రికాయాం మండలవిధి స్సమాప్తః.

ఉదకుంభశ్రాద్ధము.

హేమాద్రౌ స్మృతిసముచ్చయే॥ శ్లో॥ ఏకాదశాహాత్ప్రభృతి ఘటస్తోయాన్నసంయుతః। దినేదినే ప్రదాతవ్యో యావత్సంవత్సరం ద్విజైః॥

తా॥ ౧౧ వ దినము మొదలు నుదకుంభముతో గూడిన ఆమద్రవ్యములను ప్రతి నిత్యము సంవత్సరమువఱకు నొక విప్రునికి దానము చేయవలయును.

మదనరత్నే గౌతమః॥ శ్లో॥ అదైవం పార్వణశ్రాద్ధే సోదకుంభమధర్మకం। కుర్యాత్ప్రత్యాబ్దికాచ్ఛ్రాద్ధాత్సంకల్పవిధినాన్వహమ్॥

తా॥ ప్రత్యాబ్దికపర్యంతము పార్వణశ్రాద్ధ ధర్మములన్నియు నక్కఱలేకుండగ దైవహీనముగ సంకల్పవిధిచే నుదకుంభశ్రాద్ధము మాత్రము ప్రతిదినము చేయవలెననుట.

ఉదకుంభశ్రాద్ధమందు పిండము వైకల్పికము. “అహరహరన్నమస్మై బ్రాహ్మణాయోదకుంభంచ దద్యాత్పిండమప్యేకే నిపృణంతి” యని హేమాద్రిలో పారస్కరవచన మున్నది. తక్కిన విశేషములు నిర్ణయసింధువునఁ జూడఁదగును.

దేవజ్ఞానీయే గరుడః॥ శ్లో॥ ప్రత్యహం దీపకో దేయో మార్గేతు విషమే నరైః। యావత్సంవత్సరం వాపి ప్రేతస్య సుఖలిప్సయా। కుర్యాద్వాన్స్వసుఖం ప్రీత్యై మద్ధ్యస్సంకల్ప్య సుస్థితమ్॥

తా॥ సంవత్సరపర్యంతము ప్రతిదినము విషమమార్గమందు ప్రేతసుఖమునకు గాను సంకల్పించి దక్షిణాభిముఖముగ దీపదానముఁ జేయవలయునని తా॥

ఇతి అపరచంద్రికాయాం ఉదకుంభశ్రాద్ధం సమాప్తమ్.

— శ్రాద్ధభోక్తృసంఖ్యావిషయము. —

బృహత్పారాశరీయే పంచమోఽధ్యాయే.

శ్లో॥ ప్రాఙ్ముఖౌ దైవికౌ విప్రౌ పిత్ర్యే త్రయ ఉదఙ్ముఖాః। ఏకైకముభయత్రవా దద్యాత్తావితిక్రమః। పాత్రం వా దైవికం కృత్వా విప్రమేకన్తు పైతృకే।

తా॥ విశ్వేదేవస్థానమందు తూర్పుముఖముగ నిద్దరిని పితృస్థానమునం దుత్తరముఖముగ ముగ్గురినిగాని లేక యుభయస్థానములయందు నొక్కొక్కరినైనను భుజింపజేయవలయును. లేదా పితృస్థానమందొక బ్రాహ్మణుని నియమించి విశ్వేదేవస్థానమందు పాత్రనుంచి భుజింపవలయును.

కించ॥ యల్లాజీయే॥ శ్లో॥ శుచీన్నిమంత్ర్య ద్వావ్యైదైవే త్రీన్విప్రాన్పిత్ర్యకర్మణి। దైవేపి త్వేకమేవైకం సపిండీకరణంవినా॥

తా॥ సపిండీకరణమునందు తప్ప ప్రతిసంవత్సరముచేయు శ్రాద్ధమునందు విశ్వేదేవస్థానమందు పరిశుద్ధులగు బ్రాహ్మణులనిద్దరిని పితృస్థానమునందు ముగ్గురుని లేక ఒకరొకరినిగాని నియమింపవలయును.

కొందఱు విష్ణుస్థానమునుగూడ నుంచుదురు దేశాచారముల ననుసరింపవలెను

ఇతి అపరచంద్రికాయాం శ్రాద్ధభోక్తృ సంఖ్యావిషయస్సమాప్తః.

## —వైతరణీ గోదాన విషయము.—

శ్లో॥ షండసంయోజనాదూర్ధ్వం ప్రేతత్వస్యనివృత్తయే।
మార్జనాదిషునష్టేషు చతుర్థోపినివర్తయే॥

ఏతస్మిన్ కాలే బ్రాహ్మణవిసర్జనాంతేవా వైతరణీగోదానంకార్యమ్। స్మృతిసారే॥ శ్లో॥ ప్రేతలోకాత్పిత్రులోక గమనార్థంచ వైతరిః।
నద్యావైతరణీనామ్నా గాందద్యాత్తంతరాయవై॥

తా॥ ప్రేత తన నివాసస్థానమునుంచి పితృలోకమునకుపోవునప్పుడు వైతరణీనదిని దాటుటకుగాను వైతరణీగోదానం చేయవలెనుగుట.

ఇతి అపరచంద్రికాయాం వైతరణీ గోదాన విషయస్సమాప్తః.

## —పాలాశవిధి.—

యది పితుర్మరణకాలే దేశకాలాది భిన్నంస్కారకృత్యం నకుర్యాతచేత్। తదా సంవత్సరమధ్యే గురుశుక్రమౌఢ్య మలమాసచాతుర్మాస్యాదిదోష రహితకాలే భద్రతిథి త్రిపదనక్షత్ర భృగ్వంగారకవార రధపంచకవ్యతిరిక్తశుద్ధదినే చంద్రతారాబలాన్వితే పునస్సంస్కారముపక్రమేత్। యద్యస్థ్యస్థిచేత్తత్ అస్థిభిరేవ పునర్దాహః, అస్థ్యభావశ్చేత్తదాపలాశవృంతైః శరీరాకృతిం కృత్వాపునర్దాహ [illegible]।

తా॥ తండ్రియొక్క మరణకాలమునందు దేశకాలాది వైపరీత్యములచే సంస్కారకృత్యమును చేయనియెడల సంవత్సరకాల మతిక్రమించకమునుపే గురుశుక్రమౌఢ్యముల

మాసాది దోషరహితమైనదియును త్రిపదనక్షత్రాదిదుష్టనక్షత్ర వ్యతిరిక్తదినమునందు తారా బలచంద్రబలములు కలిగియుండఁగా వారల సంస్కారమును జేయునట్టివిధమును నుప క్రమించవలయును, అప్పుడస్థులున్నయెడల ఆయస్థులచేత పునర్దాహమును జేయవలయు ను అస్థులునష్టమైనయెడల పలాశవృంతములచేత శరీరాకృతిని జేసి దహనము జేయవలయు నని తాత్పర్యము

ఇతి అపరచంద్రికాయాం పాలాశవిధిః.

దేశాంతరగత మృతినిర్ణయము.

దేశాంతరంబునకుఁబోయినవానియొక్క వృత్తాంతము ౧౫ సం వత్సరములలోపలఁ దెలియఁబడక పోయెనేని పుత్త్రుఁడు ౧౬ వ సం వత్సరమందు ఔర్ధ్వదైహిక క్రియలను జేయవలయునని జాతుకర్ణ్యుఁడు వచించెను, పితృవ్యతిరిక్తులకు ౧౨ సంవత్సరములు గడచిన పిమ్మట పైతృమేధికకర్మలను జేయవలయునని బృహస్పతి వచించెను.

కర్మానంతరమందు తండ్రిజీవించియుండుట.

కర్మానంతరమందు తండ్రి జీవించియున్నాఁడని తెలిసినను లేక తామే స్వయముగ గృహమునకు వచ్చినను చేయఁదగిన విధినిజెప్పు చున్నాను. అప్పుడావచ్చినవానిని ఘృతకుంభము నందుఁబెట్టి జ్యోతి శ్శాస్త్రముచే నిర్దుష్టమైన లగ్నమునందు లేవఁదీసి జాతకర్మ మొదలు చూడాకర్మాది సంస్కారంబులనుజేసి యేదైననొకకర్మతిథినందు ౧౨ దినములు తిరువాసములను జేయించి పూర్వము పరిణీతయైన భార్యను గాని యట్టిభార్య లేనప్పుడు వేరొకభార్యనుగాని పాణిగ్రహణము వారి వారి విధిచేచేసి గ్రహించవలయునని వృద్ధమనువుపచించె. ఘృతకుంభా దున్మగ్నం పునర్జాతకర్మణా సద్యస్కాలం సంస్కరిష్యే ఇతిసంకల్ప్య — తక్కిన ప్రయోగము ఆచార్యునియొక్క అనుమతి ప్రకారము జరుప వలెను. గ్రంథవిస్తరభీతిచేవ్రాయనైతి.

ఇతిఅపరచంద్రికాయాం కర్మానంతరే పిత్రాద్యాగమన శ్రవణాదిః.

రజస్వలా క్షౌరసూత్రవిసర్జనము.

శ్లో॥ దశాహాభ్యంతరేదైవా త్ప్రేతభార్యా రజస్వలా । తదా

శ్రాద్ధాదిగం కార్యం స్నాత్వాసూత్రం విసర్జయేత్ ॥

తా॥ పదిదినములలోపల ప్రేతభార్యగజస్వలయయ్యెనేని అప్పుడు శ్రాద్ధము మాత్రము నిలుపక చేసి స్నానానంతరమందు కంఠసూత్రాదికమును విసర్జించవలయును.

శ్లో॥ సపిండాన్ భోజయేత్సర్వాన్ సావశాహాంస్వశక్తితః। విష మాహస్సు నాన్యాంశ్చ పుణ్యాం ప్రేతస్యదుర్లభమ్ ॥

తా॥ మరణాది పదిదినములవఱకును కర్తయగువాడు జ్ఞాతులతోఁ గూడభోజనము చేయవలయును లేదా బేసిదినములయందైనను భోజనమును చేయించవలయును. సపిండులు తృప్తినిబొందినయెడల ప్రేతమునకుత్తమమైన తృప్తిగలుగును.

ఇతి రజస్వలాకంఠసూత్రవిసర్జనం సమాప్తమ్.

సపిండీకరణమునకు ముఖ్యకర్తలు.

శ్లో॥ పితుస్సపిండీకరణం బంధుభిస్తుకృతంయది। పునః ప్రేతత్వ ముక్త్యర్థం సుతఃకుర్యాత్సపిండనమ్ ॥

తా॥ తండ్రికి సపిండీకరణము బంధువులచేఁ జేయఁబడెనేని ప్రేతత్వవిముక్తికొఱకు పుత్రుఁడు మరలసపిండీకరణము చేయవలయునని తాత్పర్యము.

శ్లో॥ జ్యేష్ఠపుత్రస్యసద్భావే కనిష్ఠఃకురుతేక్రియామ్। ప్రేతత్వా న్నవిముచ్యేత పితృత్వంనచగచ్ఛతి ॥

తా॥ జ్యేష్ఠపుత్రుండుండఁగఁ గనిష్ఠుఁడు ప్రేతకృత్యంబులఁజేసినయెడలతండ్రికి ప్రేతత్వంబుపోదు పితృలోకంబును గలుగదు.

శ్లో॥ జ్యేష్ఠోవాఽథ కనిష్ఠోవా జ్యేష్ఠభార్యాసుతోదహేత్ । అగ్నికార్యే ప్రధానత్వాత్ జ్యేష్ఠభార్యాసుతోగ్రజః ॥ అనేకపత్నీ పుత్రాణాం యస్తుజ్యేష్ఠస్సఏవహి। పితుస్సపిండీకరణం కుర్యాదిత్యాహ శాశ్వతః॥

తా॥ జ్యేష్ఠుడైననుకనిష్ఠుడయినను జ్యేష్ఠభార్యాపుత్రుఁడు అగ్నికార్యము నందుఁ బ్రధానుఁడు. అనేకపత్నులయొక్క పుత్రులలో జ్యేష్ఠపుత్రుఁడు తండ్రికి సపిండీకరణమును జేయవలయునని తా॥

తక్కిన విషయములు ధర్మసింధువు మొదలగు గ్రంథములయందు జూడఁదగును. ఇతిసపిండీకరణ కర్తృవిషయస్సమాప్తః.

కర్తృపత్నీ ప్రేతపత్నీ రజోదర్శన విషయము.

స్మృతిసంగ్రహే। శ్లో॥ దశాహాభ్యంతరేదైవా ప్రేతభార్యా

రజస్వలా। తదాశ్రాద్ధాదికంకార్యం స్నాత్వాసూత్రం విసర్జయేత్॥

శ్లో॥ దశాహామధ్యేతురజస్వలా చేత్ప్రేతస్యభార్యాయదివాప్రసూతా। తత్స్నాతకాంతేవిధరత్రసర్వం తదుక్తకాలేపి సపిండనంస్యాత్॥ ప్రేతస్యభార్యాయదివారజస్వలా కర్తుశ్చభార్యాప్యథవారజస్వలా। సపిండనంనైవవిధీయతేత్ర స్నాత్వాపరేషాంవిధిరేష ఉక్తః॥

శ్లో॥ ఏకాదశేహ్నిసంప్రాప్తే కర్తృభార్యారజస్వలా। ఆద్యశ్రాద్ధం ప్రకుర్వీత దాహాదీంశ్చవిసర్జయేత్॥ రజస్వలాపతిశ్చైవ సూతికాయాః పతిస్తథా। భాండస్పర్శనపర్యంతం భర్తురేవనశుధ్యతా॥ ఉపరాగేపరదినేసూతకావేకాదశేస్మృతాః। మృతాహేషుత్రయోదశ్యా మార్తవేకం చమేహాని॥——తా॥ ప్రేతకృత్యముమధ్యయందు కర్తప్రేతలయొక్క భార్యలు రజస్వలలైనను- ప్రసవించినను అప్పుడు శ్రాద్ధాదికంబును వదలివేసి పిమ్మట భార్యస్నానముచేసినవెనుక మిగిలిన కృత్యంబుల నన్నింటిని జేయవలెను. శుద్ధిదినంబున కర్తయొక్కభార్య రజస్వలయైనను- ప్రసవించినను ఆద్యశ్రాద్ధంబును మాత్రముచేయవలెను. శుద్ధిదినంబున మిగిలినకృత్యంబులను జేయవలయును. ఉపరాగమునందు పరదినంబునందును, ప్రసూతియందు శుద్ధిదినమునందును- రజస్వలయగునైదవదినమునందును- మరణంబునందు పదుమూడవదినమునందును, శుద్ధిదినంబులని తా॥ ఇతికర్తృప్రేతయోః భార్యాణాంరజోదోషవిషయః

## సర్పహతశ్రాద్ధప్రయోగము.

ఈశ్రాద్ధమునే కొందఱు నాగబలియనిచెప్పుదురు. భార్యకు గర్భోత్పత్తికాకున్నను- మృతాపత్యముగలిగినను అట్లు ప్రతిబాధకమైన ప్రేతోపద్రవమునివర్తించుటకై నారాయణబలియు నాగబలియు జేయవలయును. అందు నారాయణబలి శుక్లైకాదశియందుగాని పూర్ణిమయందుగాని చేయవలెను. ఇక నాగబలిదర్శయందుగాని పూర్ణిమయందుగాని, పంచమియందుగాని యాశ్లేషతో కూడిన నవమియందుగాని చేయవలెను. తత్రాయంప్రయోగః॥ ఏవం + స్థం బ్రాహ్మణభార్యాం

మమ ఇహజన్మని జన్మాంతరేవా జాతసర్పవధ దోషపరిహారార్థం ప్రాయశ్చిత్తముపదిశంతుభవంతః॥ బ్రాహ్మణులతో మనవి చేయవలెను. తిమ్మలుసభయందు గోమూల్యమునుంచి ప్రార్థించునది. "సత్యేధర్మవిప శ్చారః"। అని ప్రార్థింపగా సభ్యులు। చతుర్దశకృచ్ఛ్రప్రాయశ్చిత్తేనా ముక్త ప్రత్యామ్నాయద్వారా పూర్వోత్తరాంగ సహితేనాచరితేన తవశుద్ధ ర్భవిష్యతి॥ అనియుపదేశించిన పైని దేశకాలములుచ్చరించి । పరిషదుప దిష్టచతుర్దశ కృచ్ఛ్రప్రాయశ్చిత్తమముక ప్రత్యామ్నాయేనా .హమా చరిష్యే॥ యనిసంకల్పించి క్షౌరము మొదలగునవి చేసికొనవలెను. అథ సర్పవధదోషపరిహారార్థంగోదానం దండదానంకుర్యాత్॥ శాలిచూర్ణేనస ర్పప్రతిమాంకృత్వా॥తతఃప్రార్థనం॥ శ్లో॥ఏహిపూర్వమృతస్సర్ప అస్మిన్ పిష్టేసమావిశ సంస్కారార్థమహంభక్త్యా ప్రార్థయామిసమాహితః॥ ఇత్యావాహ్య॥ సంపూజ్య॥ అథబలిః॥ భోసర్పఇమంబలిం గృహాణమ

మాభ్యుదయంకురు॥ ఇతిబలి కుర్యాత్ । కర్తాపాదాప్రక్షాళ్య । ఏవం +ర్థం సభార్యస్య మమేహ జన్మని జన్మాంతరేవా జ్ఞానాదజ్ఞానా ద్వాజాతసర్పవధ దోషపరిహారార్థం సర్పసంస్కారకర్మకరిష్యే ॥ ఇతి సంకల్ప్య॥ అథాగ్నింప్రతిష్ఠాప్య । ప్రజ్వాల్య । అస్మిన్ సర్పసంస్కార కర్మణి దేవతాపరిగ్రహార్థ మన్వాధానంకరిష్యే । అథసర్పముఖేఆజ్యం నిధాయ॥ శ్లో॥ త్రాహిత్రాహిమహాభోగిన్ సర్పోపద్రవదుఃఖతః। సంతతిందేహిమేపుణ్యాం నిర్దుష్టాందీర్ఘదేహినీం । ప్రసన్నంపాహిమాం భక్త్యా కృపాళోదీనవత్సల । జ్ఞానతోఽజ్ఞానతోవాపి కృతస్సర్పవధో మయా । జన్మాంతరేతథైతస్మిన్ మత్పూర్వైరథవావిభో । తత్పాపం నాశయక్షిప్ర మపరాధం క్షమస్వమే॥ ఇతిసంప్రార్థ్య ॥ నాగేంద్రం స్నాత్వాఽగ్నౌతతః పునః ॥ అగ్నయేనమః ఇతిసర్పదహనంకార్యం ॥ (సర్పము హుతముకాగానే జలముచేజల్లార్పవలయును.) సవ్యముచేతనే సర్వసంస్కార కర్మయు చేయవలెను. అస్థిసంచయన మక్కరలేదు. స్నానముచేసి గృహమునకు రావలెను. భార్యతోగూడదనకుత్రిరాత్రి

మూశౌచము. శవ దినమందు సచేలస్నానముజేసి ఏవం + ర్థం సర్ప
స్వరూపిణే బ్రాహ్మణాయ యథాశక్తి అన్నదానం కరిష్యేనమః॥ అథ
ప్రాయశ్చిత్తంకృత్వా॥ ఏవం + ర్థం సర్పశ్రాద్ధం సద్యః కరిష్యేనమః॥
సర్ప- అనంత- శేషకపిల- నాగ- కాలిక-శంఖపాల- భూధర- ఇత్యష్ట
బ్రాహ్మణాన్ నిమంత్ర్య॥ కుశాసనదద్యాత్ । మండలంకుర్యాత్ । సర్ప
స్వరూపిణే బ్రాహ్మణాయఇదంపాద్యందదామి । అనంతస్వరూపిణే +
దదామి॥ శేషస్వరూపిణే + దదామి॥ కపిలస్వరూపిణే + మి॥ నాగ
స్వరూపి...మి॥ కాలికస్వరూపిణే ... దదామి॥ శంఖపాలస్వ ...మి॥
భూధరస్వరూపిణే...మి॥ సర్వత్రపాదప్రక్షాళ్య॥ నమోబ్రహ్మణ్య...
నమః॥ యద్యేచ్ఛసి మహారాజ...నమోనమః॥ శ్లో॥ తంశిరసిధారయేత్॥

హస్తపాదప్రక్షాళ్య॥ సర్పస్వరూపిణే బ్రాహ్మణాయ ఇదమాసనం
దదామి॥ సర్వత్రాసనందద్యాత్॥ అథావాహనం కుర్యాత్ కుశానిద
ద్యాత్॥ భోసర్ప ఇదంతే అర్ఘ్యందదామి॥ అనంతాయఅర్ఘ్యందదామి॥
శేషాయ...మి॥ కపిలస్వరూపాయ... మి॥ నాగస్వ... మి॥ కాలికస్వ
...మి॥ శంఖపాలస్వ... మి॥ భూధరస్వ...మి ॥ గంధాక్షత ధూపదీప
వస్త్రాదిదానంసర్వత్రకార్యం॥ (పిండ్లుటబియ్యము మొదలగునవి బ్రాహ్మ
ణులకు సమర్పించవలెను.) సర్పాయఇదమామం సపరికరంసవ్యంజనం
సతాంబూలంసదక్షిణాకం సతిలాపిధానోదకుంభం బ్రాహ్మణాయ సం
ప్రదదేనమమ॥అనంతాయ...నమమ॥ శేషాయ...మ॥కపిలస్వ...మ॥ నాగ
స్వ...మ॥ కాలికస్వ...మ॥ శంఖపాలస్వ...మ॥ భూధరస్వ...మ॥ బ్రాహ్మ
ణాన్ సంతుష్టయేత్॥ ఏవం.. ర్థం సర్పబలిపిండప్రదానాని కరిష్యేనమః॥
గోమయేనానులిప్య॥ దర్భాన్ పరిస్తీర్య । యవోదకం దదామి । సర్పా
యఇమంపిండందదామి॥ అనంతాయఇమంపిండం దదామి॥ శేషాయ ఇమం
పిండందదామి॥కపిలస్వరూపాయ ఇమంపిండందదామి॥ నాగస్వరూపాయ
ఇమంపిండందదామి ॥ కాలికస్వరూపాయ ఇమంపిండందదామి ॥ శంఖ
పాలస్వ...మి॥ భూధరస్వ...మి॥ తూష్ణీంపిండశేషంనిధాయ॥ పిండానా

ముకరియువోదకందదామి ॥౮॥ అథపిండపార్శ్వేణ పూజాంకరిష్యే నమః॥ పిండేవస్త్రం నిధాయ॥ దర్భవస్త్రాంత్సమర్పయామి॥ ధూపమాఘ్రాపయామి॥ దీపందర్శయామి॥ధూపదీపానంతరం శుద్ధాచమనం సమర్పయామి॥ అథనైవేద్యంకుర్యాత్ ॥ యథాశక్తిదక్షిణాందద్యాత్ ॥ అథగోదానం బ్రాహ్మణాయదద్యాత్ ॥ అనేనసర్పబలిపిండప్రదానేన భగవాన్త్సర్వాత్మా...భో సర్పపుణ్యలోకప్రాప్తిరస్తు॥ మమవంశవృద్ధింకురు॥ ఆయుర్భాగ్యసుధురా...లభేత్ ॥పిండాన్ ఉద్వాసయేత్ ॥ కర్తాపాదౌప్రక్షాళ్య॥ ప్రాగ్భాగేనూతనవస్త్రంపరిస్తీర్య॥ తత్రతండులంపూరయిత్వా॥ ఏకంకలశంసధాయ॥ తదుపరివస్త్రంపరిక్షిప్య॥ నాగస్వరూపసువర్ణప్రతిమాంనిధాయసర్పస్వరూపమావాహయామి॥ అనంతస్వరూప మావాహయామి॥ శేషస్వరూపమావాహయామి॥ కపిలస్వ...మి॥ నాగస్వ...మి॥ కాళికస్వ...మి॥ శంఖపాలస్వ...మి॥భూధరస్వ...మి॥ కేచిత్వష్టకలశస్థాపనం కుర్యుః॥ అథ షోడశోపచారైరభ్యర్చ్య॥ అథప్రార్థనా॥ శ్లో॥ బ్రహ్మలోకేచ యేసర్పాశ్శేషనాగపురోగమాః॥ నమోస్తుతేభ్యస్సుప్రీతాః ప్రసన్నాస్సంతుతేసదా॥ విష్ణులోకేచయేసర్పా వాసుకిప్రముఖాశ్చయే। నమోస్తుతేభ్యస్సుప్రీతాః ప్రసన్నాస్సంతుతేసదా ॥ రుద్రలోకేచయేసర్పా స్తక్షకప్రముఖాశ్చయే । నమోస్తుతేభ్యస్సుప్రీతాః ప్రసన్నాస్సంతుతేసదా॥ ఖాండవస్యతథాదాహేస్వర్గంయేచసమాశ్రితాః॥ నమోస్తుతేభ్యస్సుప్రీతాః ప్రసన్నాస్సంతుతేసదా। సర్పసత్రేచయేసర్పాఅస్తీకేనచరక్షితాః॥ నమోస్తు...సదా ॥ మలయేచైవయేసర్పాఃకర్కోటప్రముఖాశ్చయే। నమోస్తు...సదా। ధర్మలోకేచయేసర్పావైతరణ్యాంసమాశ్రితాః॥ నమోస్తు...సదా॥ యేసర్పాఃపార్వతీయేషుదరీసంధిషుసంస్థితాః॥ నమోస్తు...సదా॥ గ్రామేవాయదివారణ్యే యేసర్పాఃప్రచరంతిహి। నమోస్తు...సదా॥పృథివ్యాంచైవయేసర్పాయే సర్పాబలిసంస్థితాః॥నమోస్తు...సదా॥ రసాతలేచయేసర్పా అనంతాద్యామహాబలాః। నమోస్తుతేభ్యస్సుప్రీతాః ప్రసన్నాస్సంతుతేసదా ॥ తతఃఆచార్యంసంపూజ్య॥

ఏవం...ర్థం కృతస్య సంస్కారకర్మణస్సద్గతి సిద్ధ్యర్థమిమం నాగం సౌవర్ణం సకలశం సవస్త్రం సదక్షిణాకం తుభ్యమహం సంప్రదదే నమమ ॥ అనేన స్వర్ణనాగదానేన అనంతాదయో నాగదేవతాః ప్రీయంతాం ॥ యస్య స్మృత్యా చ నమోక్త్యా + తం॥ మయా కృతం సర్వసంస్కారాఖ్యం కర్మ తద్భవతాం విప్రాణాం వచనాత్సర్వగమేశ్వర। ప్రసాదాత్సర్వం పరిపూర్ణమస్తు॥ తథాస్తు ॥ ఇతి ప్రతివదేయుః ॥ బ్రాహ్మణేభ్యో దక్షిణాం దద్యాత్ ॥ ఆశీర్వాదః॥

శ్లో॥ కృత్వా సర్వస్య సంస్కార మనేన విధినా నరః॥ నిరోగో జాయతే క్షిప్రం సంతతిం లభతే శుభామ్ ॥

ఈశ్లోకోక్తప్రకారము సర్వసంస్కారము చేయువానికి మహారోగమైనను శీఘ్రముగ నివర్తించును శుభమైన సంతతియు గలుగును.

ఇతి సర్వసంస్కారవిధిస్సమాప్తః.

## మృతాశౌచాంతర్గత శ్రాద్ధవిషయము.

యాజ్ఞవల్క్యః॥ శ్లో॥ మాతుర్దశాహమధ్యేతు పితుః ప్రత్యాబ్దికం యది। యదాహే షోడశాత్పూర్వం పితుశ్శ్రాద్ధం సమాచరేత్ ॥ పితుర్దశాహమధ్యేతు మాతుః ప్రత్యాబ్దికం యది। యదాహే షోడశాదూర్ధ్వం మాతుశ్శ్రాద్ధం సమాచరేత్।

(షోడశాత్ సపిండీకరణాదిత్యర్థః॥)

తా॥ తల్లియొక్క మరణదినము మొదలుకొని దశాహములోపల తండ్రియొక్క ప్రతిసాంవత్సరిక శ్రాద్ధము తటస్థించెనేని ౧౧వ దినమునందు శ్రాద్ధహోమమైన పిమ్మట షోడశమునకు పూర్వమునందు ప్రత్యాబ్దిక శ్రాద్ధమును జేయవలయును అప్రకారముగానే తండ్రియొక్క మరణదినము మొదలుకొని పదిదినములలోపల తల్లియొక్క ప్రతిసాంవత్సరిక శ్రాద్ధము తటస్థమైన యెడల ౧౧వ దినమునందు షోడశశ్రాద్ధమైన పిమ్మట తల్లియొక్క ప్రతిసాంవత్సరిక శ్రాద్ధమును జేయవలయునని యాజ్ఞవల్క్యమునిపరుడు చెప్పె. ఇచ్చట షోడశమనగా సపిండీకరణమని యర్థము॥ ఇతి మృతాశౌచాంతర్గత శ్రాద్ధవిషయస్సమాప్తః॥

## దశదాన మంత్రములు.

దేశ కాలౌ సంకీర్త్య మమపిత్రోః పాపక్షయార్థం దశ దానాని కరిష్యేనుః ఇతిసంకల్ప్య॥ ప్రత్యేకం బ్రాహ్మణమభ్యర్చ్య॥

గోదానం॥ శ్లో॥ గవామంగేషుతిష్ఠంతి భువనానిచతుర్దశ।
యస్మాత్తస్మాచ్ఛివంమేస్యా దతశ్శాంతింప్రయచ్ఛమే॥
ఇతిగోదానంకుర్యాత్॥

భూదానం॥— సర్వసస్యాశ్రయాభూమిర్వరాహేణసముద్ధృతా । అనంతపుణ్యఫలదా అతశ్శాంతిం ప్రయచ్ఛమే॥

తిలదానం॥— తిలాఃపాపహరానిత్యం విష్ణోర్దేహసముద్భవాః । పాపంహారంతుమేక్షిప్రమతశ్శాంతింప్రయచ్ఛమే॥

హిరణ్యదానం॥ — హిరణ్యగర్భగర్భస్థం హేమబీజంవిభావసోః॥ అనంతపుణ్యఫలద మతశ్శాంతింప్రయచ్ఛమే॥

ఆజ్యదానం— కామధేనోస్సముద్భూతం సర్వక్రతుషుసంస్థితం। దేవానామాజ్యమాహార మతశ్శాంతి ప్రయచ్ఛమే ॥

వస్త్రదానం— శీతవాతోష్ణసంత్రాణం లజ్జాయాలక్షణంపరం। దేహాలంకరణంవస్త్ర మతశ్శాంతింప్రయచ్ఛమే ॥

ధాన్యదానం— ధన్యంకరోసిదాతార మిహాలోకేపరత్రచ । యస్మాత్తస్మాచ్ఛివం మేస్యా దతశ్శాంతింప్రయచ్ఛమే ।

గుడదానం— ఇక్షుకాండసముద్భూతః గుడోమధువిరాజితః॥ యస్మాత్తస్మాచ్ఛివంమేస్యా దతశ్శాంతిం ప్రయచ్ఛమే ॥

రజతదానం— పితౄణాంప్రీతికరంత్వంహి శౌర్యంచ ప్రసముద్యతే । త్వద్దానాదిహచాముత్ర శ్రేయస్స్యాద్రజితంమమ ॥

లవణదానం— . రసానాముగ్రజంశ్రేష్ఠం లవణంబలవర్ధనం । యస్మాత్తస్మాచ్ఛివంమేస్యా దతశ్శాంతి ప్రయచ్ఛమే ॥ ఇతి దశదానాని బ్రాహ్మణేభ్యో దద్యాత్ ॥

ఇతిదశదానమంత్రాస్సమాప్తాః.

హిరణ్యదానం— హిరణ్యగర్భగర్భస్థం హేమబీజంవిభావసోః। అనంత పుణ్యఫలద మతశ్శాంతింప్రయచ్ఛమే ।
తిలపాత్రదానం — తిలాఃపాపహరాంనిత్యం విష్ణోర్దేహసముద్భవాః । తిలపాత్రప్రదానేన ప్రీయతాంకమలాపతిః ।
ఛత్రదానం— ఇహాముత్రాతపత్రాణాం కురుకేశవమేప్రభో। ఛత్రం త్వత్ప్రీతయేదత్తం పాపఘ్నాయమయాశుభమ్ ॥
పాదుకాదానం— కంటకోచ్ఛిష్టపాషాణ వృశ్చికాదినివారణే। పాదుకే సంప్రయచ్ఛామి గృహాణత్వంద్విజోత్తమ ।
కటదానం— కటందాస్యామివిప్రేంద్ర గృహాణత్వంసుఖప్రదం। అనేన కటదానేన ప్రీయంతాంపితరస్సదా ॥
చందనఖండదానం — మలయావాసమందార సఖబృందారకార్చిత । చందనత్వత్ప్రసాదాన్మేసాంద్రానందంప్రవర్ధయ ॥
దీపదానం — దీపందాస్యామివిప్రేంద్ర తుభ్యంధ్వాంతనివారకం ॥ అస్యప్రదానాత్సకలాన్ దోషాన్నాశయకేశవ ॥
ఘంటాదానం— దేవానామిష్టద ఘంటా సర్వదైత్యవినాశినీ । తస్మాద్దాస్యామితేఘంటాం తద్దానేనసుఖంకురు॥
చామరదానం।— శశాంకకరసంకాశ హేమదండీరపాండుర। పాప్రాత్రాహిమాంశుదురితం చామరామరవల్లభ॥
శయ్యాదానం। — యథానకృష్ణశయనం శూన్యంసాగరజాతయా। శయ్యామమాశ్యశూన్యాస్తుతథాజన్మనిజన్మని॥
సప్తధాన్యాని।— త్వత్ప్రియంకరోతిభూతాని మిహలోకేపరత్రచ । తస్మాత్ప్రదీయతేధాన్యమతశ్శాంతిం ప్రయచ్ఛమే॥
సువర్ణదానం।— సర్వపాపక్షయకరం సువర్ణంగోకభూషణం। అగ్నేర్బీజంప్రదాస్యామి తస్మాచ్ఛాంతింప్రయచ్ఛమే॥
తండులదానం।— జీవనంసర్వభూతానాం బలపుష్టివివర్ధనం। తండులం దీయతేతుభ్యంహ్యతశ్శాంతింప్రయచ్ఛమే॥

సరస్వతీదానం॥— సరస్వతీజ్ఞానదాత్రీ విద్యానామధిదేవతా। విద్యా
సాధకలోకస్య దానాన్ముక్తిం సమాప్నుయాత్॥
వేణుదానం॥— వేణుదండశ్శుభకరో దశావస్థాసురక్షకః। వేణుదండ
స్యదానేన తృప్తిర్దండధరస్యవై॥
యజ్ఞోపవీతదానం॥— యజ్ఞోపవీతం పరమంపవిత్రంకర్మసాధకం।
యజ్ఞోపవీతదానేన తుష్టాస్సర్వామరాస్సదా॥
అతఃపరంమనసోద్దిష్టదానానికుర్యాత్॥ విశేషదానమంత్రాస్సమాప్తాః.

౧౦౮ దానమంత్రములు అష్టోత్తరశతదానకల్పమందు వ్రాసి వున్నాను. ఆగ్రంథమందు జూడందగును.

## షోడశమహాదానములు.

ప్రాచీనగ్రంథే॥ శ్లో॥ కన్యాగావసువర్ణంచ శకటాశ్వగజాగృహం।
లాంగలంసస్యధాత్రీచ కాలచక్రంతథాక్షితిః॥
మేషశ్చమహిషశ్చైవ అజినంశయనంతథా।
సాలగ్రామశ్చవిజ్ఞేయా మహాదానానిషోడశ॥

తా॥ ౧ కన్యాదానము, ౨ గోదానము, ౩ సువర్ణదానము, ౪ బండిదానము ౫ అశ్వదానము, ౬ ఏనుగదానము, ౭ గృహదానము, ౮ నాగలిదానము. ౯ పైరుతోనున్న సస్యభూదానము, ౧౦ కాలచక్రదానము, ౧౧ భూదానము ౧౨ మేకదానము ౧౩ దున్నపోతుదానము, ౧౪ కృష్ణాజినదానము, ౧౫ శయ్యాదానము, ౧౬ సాలగ్రామదానము, ఈ ౧౬ మహాదానములని తెలియవలెను.

కేచిత్॥ శ్లో॥ కన్యాకనకదాసీచ శకటాశ్వగజాగృహం।
లాంగలంకాలపురుషః కాలచక్రంతథాక్షితిః॥
మేషశ్చమహిషశ్చైవ భార్యాభోగయుతోత్తమః।
తిలపర్వతవిజ్ఞేయా మహాదానానిషోడశ॥ ఏవం కేచిత్ప్రాహుః॥
దానకాలేవిశేషః॥ శ్లో॥ అశ్వంకర్ణేగజందంతే దాసీంకేశేఅజాంగళే।
గృహంస్తంభేవృషంస్కంధే గాంపుచ్ఛేకన్యకాంకరే।
స్పృష్ట్వాచైతానిదానాని తిష్ఠన్దద్యాన్నసంశయః॥

ఈషోడశ మహాదానములు చేయుటవలన మహావిశేషముగలను గ్రంథ విస్తరభీతిచే ఈగ్రంథమందు వానివాని ఫలములు వ్రాయనైతి.

ఇతి షోడశమహాదానా న్యసమాప్తాః.

మృతాహస్సు దెలియనిచో నిర్ణయము,

దేశాంతరమందు మృతుడగుటచే మాసముమాత్రము దెలిసిమృతి దినము దెలియనిచో నామాస మందమావాస్య యందైననుశుక్లకృష్ణైకా దసులందైనను ప్రతివార్షికశ్రాద్ధము జేయవలెను. మృతదిన ము తెలిసి మాసముదెలియనిచో మార్గశీర్షము మాఘము భాద్రపదము ఆషాఢము వీనిలో నొకదానియం దాతిథిలో వార్షికశ్రాద్ధము మాసముతిథియు రెండును దెలియనిచోనింటినుండి బయలుదేరినతిథియు మాసముగ్రహించునది, మఱియు ప్రయాణమందలి తిథిమాసములు దెలియనిచో మృతవార్తవినుపించిన తిథిమాసములుగ్రహించునది. ప్రయాణమందును మృతవార్తయందును మాసముదెలిసి తిథితెలియనిచో నామాసమందలి దర్శాదికమందు వార్షికము, ప్రయాణాదులయందు తిథిమాత్రముదెలిసి మాసముదెలియనిచో మీాదజెప్పిన మార్గశీర్షాదులలో నొకమాసమందాతిథియందువార్షికము. ప్రస్థానమరణశ్రవణములలో దినముమాసము నెఱుగనియెడల మాఘమందుగాని మార్గశీర్షమందుగాని దర్శయందుగాని వార్షికముజేయునది. దేశాంతరమృతి మొదలగునవి సంభవించితే పాలాశవిధిచే శ్రాద్ధముజేయవలయును. అప్పుడు దాహదినమందే వార్షికముదెలియునది. ప్రతిసంవత్సరమునందు జర్పేశ్రాద్ధాదులలో నొకవేళమృతాహస్సుకు విఘ్నంబు గలిగినను మృతదినము దెలియఁబడకపోయినను కృష్ణపక్షైకాదశియందు శ్రాద్ధంబును జేయవలెనుగాని మానగూడదు. జాతాశౌచమృతాశౌచములు సంభవించినచో శుద్ధదినంబుననే కర్తవ్యము.

ఇతి మృతాహనిర్ణయము సమాప్తము.

గ్రంథవిస్తరభీతిచే ఈగ్రంథమందు మూలముబ్రాయనైతి.

### మృత్తికాస్నానప్రయోగము.

శ్లో॥ విష్ణుశక్తిసముత్పన్నే। శంఖవర్ణేమహీతలే।
అనేకరత్నసంపన్నే। భూమిదేవినమోస్తుతే॥

ఆదౌభూప్రార్థనంకృత్వా॥ ఏవంగుణ + తిథౌపితుః + గోత్రస్య... స్య మమసమస్తపాపక్షయార్థం పితౄణాంపుణ్యలోకావాప్త్యర్థం అష్టోత్తరశతమృత్తికాస్నానాంగ కూర్చప్రతిష్ఠాపనంకరిష్యేనమః॥ అనుజ్ఞార్థం పవిత్రాప్రాయశ్చిత్తంకృత్వా ॥ కృచ్ఛ్రత్రయందద్యాత్ । కూర్చం ప్రతిష్ఠాప్య॥ ఆవాహ్య।ఏవం...ర్థంమృత్తికాస్నానార్థం ఋత్విగ్వరణం యథాశక్తిబ్రాహ్మణాయదద్యాత్ ॥తతఃబ్రాహ్మణేభ్యోనూతనవస్త్రాణిదద్యాత్ ।

అథమంత్రాః॥ శ్లో॥ మృత్స్నేహరకృతంపాపం। మృత్స్నేభవశుభప్రదా। మూర్ధ్నిత్వాల్లేపనాద్దేవి। పరమాస్తుగతిర్మమ ॥౧॥ మృత్తికేబ్రహ్మరూపేత్వం । మృత్తికేవిష్ణురూపిణి । సుకృతందుష్కృతంచైవ । మాంపాపయపరాంగతిం।౨॥ మయేదానీంపురాయత్తు। మృత్తికేకృతమంజసా।పాపంనాశయమేపుష్టిం। ప్రయచ్ఛాశువసుంధరే॥౩॥ ఓజస్తేజఃప్రకాశశ్చ। దేహివిశ్వంభరేసదా। ఐహికాముష్మికసుఖం । తవమేధారణాద్భవేత్ ॥ ౪॥ పృథివ్వయాధృతాలోకా దేవిత్వంవిష్ణునాధృతా । త్వంచధారయమాందేవి పవిత్రంకురుమాంసదా ॥౫॥

స్నాత్వా॥ ఆచమ్య॥ ఏవం...ర్థంయజమానస్యపితుః... గోత్రస్య ...స్య అథత్వమూకత్వకాణత్వబధిరత్వపంగుత్వపిశాచత్వనివారణార్థం అన్యోన్యసహాయేన ప్రథమమృత్తికాస్నాన మహంకరిష్యే॥ స్నాత్వా॥ త్రైబ్రాహ్మణాఃజలమాదాయ ॥ కూర్చేనిధాయ॥ఏవం...ర్థంయజమానస్యపితుః...గోత్రస్య...స్య అథత్వమూక...ర్థం అన్యోన్యసహాయేన ద్వితీయమృత్తికాస్నాన మహంకరిష్యే॥ అవశేషమృదంగృహీత్వా॥ ఆదిత్యాయమృత్తికాందర్శయిత్వా॥ శ్లో॥ మృత్స్నేహరకృతం + ర్మమ॥ మృత్తికేబ్రహ్మ + పరాంగతిం॥మయేదానీం...వసుంధరే॥ ఓజస్తేజఃప్రకా +

ద్భవేత్॥ పృథ్వీత్వయా + సదా॥ స్నాత్వా॥కూర్చే జలంనిధాయ॥ ఏవం అష్టోత్తరశత మృత్తికాస్నానానికుర్యాత ॥ యజమానస్య పితరం ... గోత్రం...మయాకృతైః అంధత్వమూక...త్వం మృత్తికాస్నానైఃయజమానస్యపితుః × గోత్రస్య...అంధత్వమూక... పైశాచికబాధానివృత్తిరస్త్వితిభవంతోబ్రువంతు॥ అంధత్వ...రస్తు॥ త్వయానిమిత్తేనమయాఃల తేన అనేనపుణ్యేన పుణ్యవాన్ భవ ॥ బ్రాహ్మణేభ్యో దక్షిణాదికం దద్యాత్ ॥ దశదానాని కుర్యాత్ ॥ కేచిత్ ఆమశ్రాద్ధం కుర్వంతి ॥ శ్లో॥ సర్వపాపహరందేవం సర్వాభరణభూషితం । సర్వాయుధధరం ధ్యాయే త్సర్వలోక మహేశ్వరమ్ ॥ బ్రాహ్మణాఃపతిత్వా మృత్తికాస్నానదోషపరిహారార్థం మహాస్నానమహంకరిష్యే ॥ తక్కినస్నానాది విధులు వారివారి వర్ణాచారములనుబట్టి తెలియదగినవి. (కర్త) తిరిగి స్నానముజేసి పితృదేవతలకర్ఘ్యమిచ్చి స్నానముజేసి సూర్యునికర్ఘ్యమిచ్చి స్నానముచేయవలయును. తక్కినవిషయములు పురాణోక్తకర్మప్రకాశికయందుఁజూడవలయును. ఇతిమృత్తికాస్నానప్రయోగస్సమాప్తః॥

## గయాశ్రాద్ధఫలము.

శ్లో॥ పిత్రాదేర్బహుమానకర్మఫలదం తృప్తిప్రదంస్వర్గదమ్।
సాయుజ్యప్రదమేవవాతదపి యత్కించిద్గయాపార్వణమ్॥
సాయాత్రావ్యగహా మహాసుఖకరీదైవాచ్ఛకర్తుర్మృతిః।
స్యాదత్రైవహిముక్తిదైన సహతత్కర్త్రాపితౄణాంభవేత్॥

తా॥ గయయందు స్వల్పముగానైన పిండప్రదానము చేసినవాని పితృదేవతలకు షోడశమహాదానాదికర్మలవలనగలిగెడి ఫలమును సంతుష్టియు స్వర్గంబును మోక్షంబును గలుగునని గయాయాత్రవలన యపారమగు నానందములుగలుగఁజేయునసియు దైవవశము వలన గయకు బోవుచుండగ మార్గమధ్యంబున దేహత్యాగముసంభవించునను గయయందు పిండదానముచేసిన ఫలముసంభవించునని ప్రాచీనగ్రంథము లభిప్రాయము.

గయాశ్రాద్ధఫలం సమాప్తమ్.



## సువాసినీత్వ నిర్ణయము.

దక్షః ॥ శ్లో॥ అస్థిసంచయనాత్పూర్వం మృతా స్త్రీ యదివా పుమాన్ । తేనాగ్ని నాదహేతౌతు నవైధవ్యమితి స్త్రియాః ॥ దశాహామధ్యేయదినాస్థి సంచయ స్తదాపిమాతా మ్రియ తేసుతిస్య । పుణ్యాంగనాంజ్ఞాష్యసువాసిని నాం సౌగంధపుష్పాణ్యఖిలానిదద్యాత్ ॥ చితిభేదేనదాహాశ్చే త్తిత్కర్మాంతంపృథక్క్రియాః ॥ భర్తుర్దశాహామధ్యేతు తద్భార్యాచమృతాయది । సువాసినీతిర్జ్ఞేయా పుణ్యస్త్రీపూజనం క్రియాత్ ॥ ................

సుమంతుః ॥ శ్లో॥ భర్తృసూతికర్మాగస్థి చయనాత్పూర్వమేవవా । తద్భార్యాతుమృతాపూజ్యా సానైసావాసినీభవేత్ ॥.......................

అత్రసిద్ధాంతపక్షః ॥ శ్లో॥ అస్థిసంచయనాత్పూర్వం ప్రేతపత్నీమృతింగతా । సువాసినీతిఖ్యాతాపి పరంవైధవ్యమాప్నుయాత్ ॥ భర్తృసంచయనాత్పూర్వం భార్యాయదివిపద్యతే । సువాసినీత్వంతిప్యాస్థి అన్యథా విధవాభవేత్ ॥ ఇతి సువాసినీత్వనిర్ణయస్సమాప్తః ॥

## —కర్తృనిరూపణము.—

శ్లో॥ పుత్రఃపౌత్రఃప్రపౌత్రశ్చ । పుత్రికాపుత్రఏవచ । పత్నీభ్రాతాచ తత్పుత్రః । పితామాతాస్నుషాతథా ॥ భగినీభాగినేయశ్చ పిండదోధన హార్యపి । పూర్వంపూర్వంపరఃకర్తా తదభావేపరఃపరః ॥

తా॥ పుత్రుఁడు- పౌత్రుఁడు- ప్రపౌత్రుఁడు- పుత్రికాపుత్రుఁడు- భార్య, భ్రాతయును- అతనిపుత్రుఁడును- తండ్రియు- తల్లియు- కోడలును- చెల్లెలును- మేనల్లుఁడును పిండదుఁడును- ధనహర్తయును. వీరుపూర్వపూర్వాభావమునందుత్తరోత్తరకర్తృత్వముగల వారని తాత్పర్యము.

మరీచిః ॥ శ్లో॥ స్త్రీకర్త్రీభర్తృకృత్యేషు పిత్రోఃకర్మణచేద్యది । దశాహాభ్యంతరేదైవా ద్రజోదోషేణదూషితా । తత్కర్మవ్యస్థితామేతి నాన్నాత్వాపంచమేహాని । సగ్నశ్రాద్ధంసమారభ్య పునఃకర్మ సమారభేత్ ॥

తా॥ భర్తయొక్క ప్రేతకృత్యంబులయందు భార్యయేకర్తయైయుండి పదిదినము లలోపల రజోదూషితురాలయ్యెనేని అదివరకుచేసిన కర్మయంతయు నుమ్యర్థమగును,

కావున పంచమదినమునందు స్నానంబుజేసి నగ్నశ్రాద్ధంబును ప్రారంభించి మిగిలిన కర్మను చేయవలయునని మరీచివచించె.

శ్లో॥ జ్యేష్ఠో వాఽథ కనిష్ఠో వా జ్యేష్ఠభార్యా సుతోదహేత్। అగ్నికార్యే ప్రధానత్వాత్ జ్యేష్ఠభార్యా సుతోఽగ్రజః ॥ అనేకపత్నీ పుత్రాణాం యస్తుజ్యేష్ఠస్సఏవహి। పితుస్సపిండీకరణం కుర్యాదిత్యాహ కాశ్యపః ॥

తా॥ జ్యేష్ఠుఁడైనను, కనిష్ఠుడైనను జ్యేష్ఠభార్యాసుతుఁడు అగ్నికార్యమునందుఁ బ్రధానుఁడు. అనేక పత్నులయొక్క పుత్రులలో జ్యేష్ఠపుత్రుఁడు తండ్రికిసపిండీకరణమును జేయఁగలవాఁడని కాశ్యపుఁడువచించె.

శ్లో॥ ఔరసః క్షేత్రజశ్చైవ పుత్రికాపుత్రఏవచ। భ్రాతావా భ్రాతృపుత్రోవా సపిండీకరణం చరేత్ ॥ అత్రిః భ్రాతా కేవలసోదరః ॥ ఏషామభావేపత్నీచ ధనహార్యపి వాభవేత్ ॥

కేచిత్॥ శ్లో॥ పుత్రాభావేతుపత్నీస్యాత్పత్న్యభావేతుసోదరః॥ పత్న్యభావేతుసాపత్న్యః పుత్రఏవనియుజ్యతే। తదభావేతుతత్పుత్రః ఆసన్నోఽన్యస్తతఃపరం। ఆద్యశ్రాద్ధమశుద్ధోఽపి కుర్యాదేకాదశేఽహని ॥

తా॥ ఔరసపుత్రుఁడు లేనప్పుడు క్షేత్రజాదులును, పుత్రికయును, పుత్రికాపుత్రుఁడును, సోదరుఁడును, తత్పుత్రుఁడును, సపిండీకరణమును జేయవలయును. వీరులేనప్పుడు భార్యయు, ధనహర్తయునుజేయవచ్చును కొంతమందిపుత్రాభావమందుపత్నీ దాని న్నిపత్నీ అభావమందు సోదరుఁడును అట్లుగాక భార్యాభావమందు సవతితల్లియు, ఆమె లేనప్పుడు ఆమెపుత్రుఁడును వీరులేనప్పుడు వీరిపుత్రుఁడును పిమ్మటదగ్గర సంబంధులును కర్తృత్వముగలవారని తా॥ ఆద్యశ్రాద్ధము ౧౧ దినమునందుజేయవలెను. ఇందువలన కర్తకు శుద్ధిగలదనితాత్పర్యము. తక్కినవిషయములు నిర్ణయసింధువుమొదలగువాని యందుజూడవలయును. గ్రంథవిస్తారభీతిచేవ్రాయనైతి.

ఇతి కర్తృనిరూపణం సమాప్తమ్.

## కర్తృభార్యారజస్వలా విషయము.

శ్లో॥ ఏకాదశేఽహ్ని సంప్రాప్తే కర్తృభార్యారజస్వలా। ఆద్యం శ్రాద్ధంతుకుర్వీత ఊనాద్యాదివిసర్జయేత్। శ్రాద్ధకర్తుర్యదాభార్యా ఆశౌచాంతేరజస్వలా। శ్రాద్ధశేషంప్రకుర్వీత వర్జయిత్వాసపిండనమితి। శ్రాద్ధశేషంపరికుర్వీతేత్యనేన వాక్యేన ఏకాదశేఽహని విహిత

మాద్య మాసికం రుద్రగణాఖ్య శ్రాద్ధం వృషోత్సర్జనాఖ్య శ్రాద్ధంచ కుర్యాత్ । వర్జయిత్వా సపిండనమితి తదర్థమపకృష్య పంచదశైకోద్దిష్ట శ్రాద్ధాని వర్జయేత్ । కేచిత్పంచమదినే శుద్ధిం సంపాద్య ఆద్యాదిషోడశైకోద్దిష్ట శ్రాద్ధం సపిండీకరణ శ్రాద్ధం కుర్యుః ॥

తా॥ పదునోకండవదినము సంప్రాప్తమగుచునుండగా కర్తయొక్క భార్య రజస్వలయయ్యెనేని ఆద్యశ్రాద్ధంబును చేయవలయును ఊనాద్యాదులను వదలవలయును. శ్రాద్ధకర్తయొక్క భార్య ఆశౌచాంతమునందు రజస్వలయయ్యెనేని సపిండనమునువదలి శ్రాద్ధశేషమునుచేయవలయును అనగా ౧౧వ దినమునందు శాస్త్రోక్తప్రకారముగ చేయదగిన పుణ్యాహవాచనము ఆహ్నికము రుద్రగణాఖ్య శ్రాద్ధము వృషోత్సర్జనాంగ శ్రాద్ధంబును చేయవలయును షోడశశ్రాద్ధములలో ఆద్యశ్రాద్ధమువిప్ప పంచదశైకోద్దిష్ట శ్రాద్ధము మాత్రము వదలవలయును కొందఱు ఆద్యశ్రాద్ధముగూడ భార్యరజస్వలయై ౫వ దినంబున స్నానము చేసిన పిమ్మట ఆద్యాది షోడశైకోద్దిష్ట శ్రాద్ధము సపిండీకరణ శ్రాద్ధము ఒకదినమునందే ఆచరింపుచున్నారు తక్కినవిషయములు దేశాచారములను బట్టి జరుపవలయును. ఇతికర్తృభార్యారజస్వలావిషయస్సమాప్తః

## ఏకాదశాహదినంబున జ్ఞాత్యాశౌచము.

కాలామృతే॥ శ్లో॥ త్యక్త్వాబాంధవసూతకేతుసకలం చాద్యాదిపశ్చాచ్చరే । త్యార్వ్యంతిర్లఘుసూతకేతువిహితం చాద్యాదియచ్చోదితమ్ । సాపిండ్యార్థమథాపకృష్యమఖిలం శ్రాద్ధం పరిత్యజ్యతి । త్యాపిండ్యాద్వ్విహితోదకుంభమనవా పూర్వ్యం సంచపశ్చాచ్చరేత్ ॥

తా॥ దశాహదినముసైన ఏకాదశాహదినముసైనను జ్ఞాతిసంబంధ దశరాత్రాశౌచము ప్రాప్తించెనేని ౧౧వ దినంబున నేకాదశాహశ్రాద్ధముచేసి ఆశౌచము నివృత్తియైనపిమ్మటతక్కిన కృత్యముల చేయవలయుననియు, త్రిరాత్రాశౌచము సంప్రాప్తించెనేనిఅయ్యేకాదశాహశ్రాద్ధముతోడనప్పుడు చేయదగిన అన్నిశ్రాద్ధములు చేయవచ్చుననియు ౧౨వ దినంబున సపిండీకరణముచేయనిచ్చగల పురుషుడాదినంబున చేయదగిన సోదకుంభశ్రాద్ధమునువదలి తక్కిన ౧౬వ ఏకోద్దిష్టశ్రాద్ధములందు చేర్చి ౧౧వ దినంబున చేయగలెను. సపిండీకరణంబైనపిమ్మట ముఖ్యకాలములందు ఊనాదిమాసశ్రాద్ధములను తక్కినసోదకుంభశ్రాద్ధములను చేయవలెనని తాత్పర్యము.

వా॥ మధ్యేప్రత్యాబ్దికేప్రాప్తే ఏకాదశేవాని ఆద్యాదీని శ్రాద్ధాదీనికృత్వా తదహరేవ ప్రత్యాబ్దికం కుర్యాత్ ॥ ఇతిబ్రాహ్మణవిషయః ॥

క్షత్రియవైశ్యశూద్రాణాం శుద్ధిదినే కర్తవ్యం ॥

తా॥ ఆశౌచదినంబులలోపల శ్రాద్ధంబు సంభవించినయెడల పదునొకొండవదినమునందు ప్రత్యాబ్దిక శ్రాద్ధము చేయవలెను. ఇది బ్రాహ్మణవిషయము, క్షత్రియులకు శుద్ధిదినము ౧౩ వందును, వైశ్యులకు ౧౬ దినమునందును శూద్రులకు, న్యాయవిధిప్రకారము ౩౧ వ దినమునందును శుద్ధిగలదు కొన్నిస్మృతులలో "త్రింశద్దినాని శూద్రస్య తదర్ధం న్యాయవర్తినః॥ అని చెప్పియుండెను" కాఁబట్టి దేశాచారప్రకారము ౧౫ దినములవఱకు ఆశౌచము నవలంబించి ౧౬ వ దినంబున శుద్ధిస్నానముచేసి పిమ్మట ఆబ్దికము జరుపవలయును. ఆశౌచాంతర్గత ఆబ్దికవిధిః.

## త్రైపక్షికాది శ్రాద్ధకాలము.

తిథిదర్పణే। శ్లో॥ కుర్యాత్త్రైపక్షికం శ్రాద్ధం త్రిపక్షే విషమేఽహని। అపరః। త్రిపక్షే ద్వాదశేపక్షే చతుర్వింశతిపక్షకే। పక్షత్రిపంచకం కృత్వా ఆదిమధ్యాంత్యపంచకే।

తా॥ త్రైపక్షిక శ్రాద్ధమును మూఁడవపక్షములో విషమదినమందుఁ జేయవలయునని తిథిదర్పణమను గ్రంథమునందుఁ జెప్పఁబడియె. మూఁడవపక్షంబున నాదియందు ౧౦ దినములకు పిమ్మట ౫ దినములలో నొకదినంబున త్రైపక్షిక శ్రాద్ధము చేయవలెను అనఁగా మృతదినమునకు ౪౦ రోజులకు పిమ్మట ౪౫ ది॥ లోగా, అట్లుగాక కొందఱు వక నెల మీద అయిదుదినములలోగా కొందఱు జరుపుచున్నారు ఆఱవమాసమున యిరువది దినములు మొదలు యిరువదియయిదుదినములకు లోపుగా శుద్ధిగల యొకదినంబున ఊనషాణ్మాసికంబును, పండ్రెండవమాసంబున యిరువదియయిదు దినములకుపైన నొకశుద్ధిగలదినమునందు ఊనాబ్దికశ్రాద్ధంబును జేయవలయునని తాత్పర్యము.

## ఊనత్రయములకు నిషిద్ధకాలములు.

కాలామృతే॥ శ్లో॥ నందాదర్శచతుర్దశీ భృగుశనిష్వాగ్నిత్రిపూర్వాసురేషూనాన్యేవనహి త్రిపుష్కరదినే ష్వన్యేషువర్జ్యేష్వపి। కుర్యాదుత్తరమాసికేన సహితత్త్వాఽఽణ్మాసికంచాకృతం। న త్రైపక్షికమూనకర్మచతథాపశ్చాచ్చరేదేవతత్।

తా॥ పాడ్యమి-షష్ఠి, ఏకాదశి ఈనందతిథులు అమావాస్యయు. ఉభయపక్ష చతుర్దశీతిథులును, శుక్రశనివారంబులును కృత్తిక, పూఫ, పూషా, పూభా, మూలద్విపాత్త్రిపాన్నక్షత్రంబులును, పూర్వోక్తతిథ్యాదికాంతిప్రకరణమునందు యీగ్రంథములలో వ్రాయఁబడిన త్రిపుష్కరదినంబులును ఊనత్రయములకు నిషిద్ధంబులనియు, ప్రతిమాసంబున జేయవలసినమాసికములు అనుపపత్తిచేతనిలిచియున్నయెడల అమాసికములు పైమాసికముతోఁ జేర్చి చేయవచ్చుననియు, ఊనత్రైపక్షికమాసికములట్లు చేయఁగూడదనియు తా॥

శ్లో॥ త్రైపక్షికోనషాణ్మాసి కోనాబ్దికమథాఞ్చకేత్।
ఏతేషామన్యకాలేతు నపునఃకరణాత్స్మృతమ్॥

తా॥ త్రైపక్షికోనషాణ్మాసికోనాబ్దికశ్రాద్ధములనుట ఈశ్రాద్ధములకు విధ్యుక్తకాలమతిక్రమించకముందే జేయవలయును గాని అతిక్రమించినపిమ్మట జేయఁగూడదని యభిప్రాయము విశ్వాదర్శమునందును నీయర్థమే ప్రతిపాదింపఁబడినది.

స్మృత్యంతరే॥ శ్లో॥ గణాన్ క్రియమాణేషు మాసికేష్వనుభావిషు।
త్రీణిస్యుర ర్ఘ్యపాత్రాణి పిండార్థేత్రీన్యేవనిర్వపేత్॥

తా॥ అనేకములకు మాసికముల నొక్కటిగాఁ జేయునెడల అర్ఘ్యపాత్రపోడములు మూఁడే నియమని యెఱుఁగవలెను.

వ్యాసః॥ శ్లో॥ నాసపిండీకృతే ప్రేతే పితృత్వముపపద్యతే। అకృతస్యతు పుత్రస్య శుభంకించిన్నవిద్యతే॥ నచనైమిత్తికం కామ్యమిష్టాపూర్తాదికంచన। నాసపిండీకృతేపిత్రోరన్యేషాం శ్రాద్ధమేవచ॥

తా॥ సపిండీకరణము చేయనియెడల ప్రేతత్వము విడిచిపోదు. చేయనిపుత్రునకు శుభముకొంచెమైనను లేదు. తల్లిదండ్రులకు సపిండీకరణమును జేయక మును పు ఇతరులకు శ్రాద్ధములను జేయఁగూడదని వ్యాసుఁడు పలికెను.

ఇతి త్రైపక్షికాది శ్రాద్ధకాలాః సమాప్తాః.

స్నానోదక నిర్ణయము.

శ్లో॥ మృతౌ జన్మని సంక్రాంతౌ శ్రాద్ధేపర్వణిపర్వణి। అస్పృశ్యస్పర్శనే చైవ నస్నాయాదుష్ణవారిణా॥ జానన్నాపదితథా యస్స్నాయాదుష్ణవారిణా। సగోహత్యాకృతం పాపం ప్రాప్నోత్యేవనసంశయః॥

(తాప్యపోనద్యాదితీర్థేషు పవిత్రతమాః॥ అలాభేమంత్రపూతా ఇతి॥)

తా॥ జనన మరణములయందును సంక్రమణమునందును, శ్రాద్ధమునందును, దర్శమొదలగు పర్వములయందును, అస్పృశ్య స్పర్శయందును ఉష్ణోదకముచేత స్నానమును జేయఁగూడదు. గోగ్రహితుఁడై యుండి యునీకార్యములయందుష్ణోదకముచేతస్నానము జేయువాడు గోహత్యకుఁదుల్యమైన పాపమును జేసినవాఁడగును నద్యాదితీర్థములయందు స్నానమును జేయుట యుత్తమము అవిలభించనియెడల మంత్రపూతోదకములచే స్నానముచేయవలయును ఇతి స్నానోదక నిర్ణయస్సమాప్తః.

జీవత్పితృవకు శ్రాద్ధనిషేధము,

తండ్రిజీవించియున్న ఇతనులగుజ్ఞాతులుమాత్రము తిలోదకాదులనీయఁ

కూడదు. జ్ఞాతులతోఁగూడ నాశౌచదినంబులయందు సహవాసంబును చేయఁగూడదు. తండ్రిబ్రతికియున్నను తనతల్లిశ్రాద్ధముమాత్రము యథావిధిగా వారివారి కులాచారములనుబట్టి తప్పక చేయవలెను. తండ్రి జీవించియుండగ జ్యేష్ఠభ్రాతయైనను కనిష్ఠభ్రాతయైనను మృతినొందిన యెడల తిలోదకాది ప్రేతకృత్యములన్నిటిని తనతండ్రే చేయవలెను. కర్తృత్వమువహించినను తల్లిదండ్రులకాయుర్వృద్ధిని గోరుపుత్రుఁడు ప్రేతకృత్యంబులను చేయఁగూడదని తెలియవలెను. (ఇతిశ్రాద్ధనిషేధః)

## తిలతర్పణ నిషేధము.

స్మృతిసార సంగ్రహే॥ శ్లో॥ తీర్థశ్రాద్ధేగయాశ్రాద్ధే పైతృశ్రాద్ధేనుమాసికే సపిండీకరణేచైవ నకుర్యాత్తిలతర్పణమ్॥ వృద్ధిశ్రాద్ధేసపిండ్యాంచ మాసికేచానుమాసికే। ఆబ్దికేప్రథమేచైవ నకుర్యాత్తిలతర్పణమ్॥ దర్శేతిలోదకంపూర్వం పశ్చాద్దద్యాన్మహాలయే। ప్రత్యబ్దేనాపరంపూర్వం పరేహనితిలోదకం। ప్రత్యబ్దాంగంతిలందద్యాన్నిషిద్ధేపి పరేహని। వర్గైకస్యవచోయేషామన్యేషాంతువిసర్జయేత్॥

తా॥ తీర్థశ్రాద్ధమునందు-గయాశ్రాద్ధమునందు-పైతృశ్రాద్ధమునందును అనుమాసికశ్రాద్ధమునందు-ప్రథమాబ్దికశ్రాద్ధంబునందు-సపిండీకరణశ్రాద్ధమునందును వృద్ధిశ్రాద్ధమునందును- సాపిండ్యమునందును-మాసికానుమాసికమునందును తిలతర్పణమును -చేయకూడదు-దర్శశ్రాద్ధమునందు శ్రాద్ధకర్మాచరణమునకు ముందుగాను మహాలయశ్రాద్ధమునందు పిమ్మటను తిలతర్పణమును చేయవలయును ప్రత్యాబ్దికశ్రాద్ధమునందు సద్యస్కాలమునందే తిలతర్పణముచేయఁగూడదు, పరదినప్రాతఃకాలమునందు తిలతర్పణము చేయవలయును. పరదినము తిలతర్పణము చేయుటకు నిషిద్ధదినమైనను తిలతర్పణమును చేసియే తీరవలయును. శ్రాద్ధమునందలి వర్గత్రయమునకే తిలతర్పణమును చేయవలయును గాని యితరులకు తిలతర్పణమును చేయఁగూడదని తాత్పర్యము

స్మృత్యంతరే॥ శ్లో॥ నజీవపితృకః కుర్యాచ్ఛ్రాద్ధాంగతిలతర్పణమ్। శ్రాద్ధమాత్రంప్రకుర్వీత తర్పణంతు పితాచరేత్॥

తా॥ జీవపితరులు గలవాఁడు శ్రాద్ధంబునుమాత్రఁబొనర్పవలయును గాని శ్రాద్ధాంగ తిలతర్పణము చేయఁగూడదు. ఆతర్పణంబును తండ్రి చేయవలయునని స్మృతికారులు వచించిరి.

ఇతితిలతర్పణ నిషేధస్సమాప్తః.

## దర్శేతిలతర్పణ ఫలము.

శ్రీభారతే అనుశాసనికపర్వణి శతోత్తరపంచవింశాధ్యాయే॥ పితర ఊచుః॥

శ్లో॥ అమావాస్యాంతు యేమర్త్యాః ప్రయచ్ఛంతి తిలోదకం। కృతం భవతి తైశ్శ్రాద్ధం సరహస్యం యథార్థవిత్॥ హృష్టపుష్టమనాస్తేషాం ప్రజాభవతి నిత్యదా। కులవంశస్య వృద్ధిస్తు పిండదస్యఫలంలభేత్। శ్రద్ధాయుతస్తు యః కుర్యాత్ పితౄణామనృణో భవేత్॥

తా॥ పితృదేవతలు చెప్పుచున్నారు, యేమనుజులైనా అమావాస్య దినమునందు మధుమిశ్రమగు ఔదుంబరపాత్రలో తిలోదకము పితరుల నుద్దేశ్యముగా యిచ్చునెడల వారలు యథార్థజ్ఞానము కలవారు ధర్మరహస్య మెరిగినవారుగా నుందురు వారలకు హృష్టపుష్టలుగానుండు సంతానము ముక్తిప్రదమైనదై యుండును. కులవంశము యభివృద్ధియగును. పిండదానము చేసిన ఫలములభించును. శ్రద్ధతో తిలతర్పణము చేయువాడు పితృఋణములోనుండి ముక్తుడుకాగలడని తాత్పర్యము.

కించ॥ అనుశాసనికపర్వణి శతోత్తర షడ్వింశదధ్యాయే।

దేవా ఊచుః॥ శ్లో॥ బలింభిక్షాంతథార్ఘ్యంచ పిత్ర్యాణాంచ తిలోదకమ్। తామ్రపాత్రేణదాతవ్య మన్యథాల్పఫలంభవేత్। గుహ్యమేతత్సముద్దిష్టం యథాతుష్యంతి దేవతాః॥

తా॥ దేవతలుచెప్పుచున్నారు, బలిప్రదానము, భిక్షనొసగుట, అర్ఘ్యమిచ్చుట, పితరులనుద్దేశ్యముగా తిలోదకమిచ్చుట, ఇవి యావత్తు తామ్రపాత్రలతో జరుపవలయును. లేనియెడల అల్పఫలముకలుగును, యేకార్యముచే దేవతలు సంతసింతురో ఆ రహస్యము చెప్పబడెనని తా॥

మాతాపితరుల శ్రాద్ధదినములలో బ్రహ్మయజ్ఞ నిత్యతర్పణములను శ్రాద్ధత్పూర్వమునందే కొందరును శ్రాద్ధాత్పరమునందు కొందరును ఆచరింపుచున్నారు వానిలో సమీచీనమేదని శోధింపగా శాఖాభేదములచేత ఆయాచారభేదములు కలవు.

శ్లో॥ ఆదౌనైమిత్తికంకుర్యాత్పశ్చాన్నిత్యంసమాచరేత్ ॥

తా॥ అనుప్రమాణమునను సరించి ఋక్శాఖులు శ్రాద్ధానంతరమే బ్రహ్మయజ్ఞ నిత్యతర్పణములు జరిగించుటయును యజుశ్శాఖులు శ్రాద్ధాత్పూర్వమునందే ఆచరించుటయును గలదని తాత్పర్యము. ఇతిదర్శే తిలతర్పణఫలమ్ సమాప్తమ్

ప్రయోగపారిజాతే॥ శ్లో॥ పక్షశ్రాద్ధే తథా దర్శే యుగమన్వంతరాదిషు। శ్రాద్ధం నిర్వర్త్య భుక్త్వాతు తాంబూలం ఖాదయేద్ద్విజః॥ మోహాదకృత్వా యః శ్రాద్ధం తాంబూలం యది ఖాదయేత్। శ్రాద్ధహంతా భవేత్కర్తా రౌరవం నరకం వ్రజేత్॥ వా॥ పిత్రోః ప్రత్యాబ్దికే శ్రాద్ధే దివారాత్రౌ తాంబూలచర్వణం నిషిద్ధం॥ అంగతిలతర్పణస్య పరేద్యుః ప్రాతస్త్విహితత్వేన సాంగపితృకర్మానివృత్తేః॥

తా॥ పక్షదర్శయుగ మన్వంతరాదులయందు శ్రాద్ధకర్మనాచరించి పిదప తాంబూలచర్వణాదికమును జేయవలయును ఒకవేళ శ్రాద్ధము నాచరింపక తాంబూలచర్వణాదికమును జేసినేని రౌరవాదినరకములను బొందును తల్లిదండ్రులయొక్క ప్రత్యాబ్దిక శ్రాద్ధములయందు పరదినప్రాతఃకాలమునందు తిలతర్పణము జేయునంతకు తాంబూలచర్వణాదికమును జేయఁగూడదని తా॥

శ్లో॥ మృతాశౌచే తథా శ్రాద్ధే మాతాపిత్రోర్మృతేహని। ఉపవాసే చ తాంబూలం దివారాత్రౌ విసర్జయేత్॥

తా॥ మృతాశౌచమునందును, శ్రాద్ధదివసమునందును తల్లిదండ్రులయొక్క ప్రత్యాబ్దిక శ్రాద్ధమునందును ఉపవాసవ్రతదినములయందును తాంబూలచర్వణంబును జేయఁగూడదని తాత్పర్యము.

శ్రాద్ధదర్పణే॥ శ్లో॥ భక్ష్యంచ పిండనైవేద్యం వికిరాన్నంచ స్పర్శనమ్। తాంబూలచర్వణం కృత్వా పునశ్శ్రాద్ధం సమాచరేత్॥

తా॥ మానముతో వండిన భక్ష్యమును పిండనైవేద్యము జేసినను వికిరాన్నము భోజనపాత్రను స్పర్శతగిలినను కర్త తాంబూలము భక్షించినను తిరిగి శ్రాద్ధము చేయవలయునని శ్రాద్ధదర్పణము ఘోషింపుచుండెను-

ఇతి తాంబూలచర్వణమ్ సమాప్తమ్.

మాతుర్దాహామధ్యంబున పితృమృతి.

స్మృత్యంతరే॥ శ్లో॥ మాతుర్దాహామధ్యేతు పితా యస్య ప్రమీయతే। పైతృకం తు యథాకాలం పితుస్సర్వం సమాపయేత్। తతో మాతుస్త్రిపక్షాంతే శేషం కర్మ సమాపయేత్॥

తక్కినవిషయములు ధర్మశాస్త్రగ్రంథములయందు జూడదగును.

తా॥ తల్లిమృతినొందిన దశాహామధ్య తండ్రి మృతిబొందినయెడల తండ్రికి శ్రాద్ధము సంపూర్తిగా జేసి, పిమ్మట 3 వ పక్షములో ఆగియుండునగా ౧౦ దినములకు పిమ్మట

౧౧ దినములలో తల్లికి లోగడ చేసిన క్రియలుగాక తక్కిన శ్రాద్ధమంతయు సమాప్తిచేయవలయునని తా॥

మాతుర్దశాహమధ్యేతు మృతశ్చేద్యది వైపితా । పితుర్మరణమారభ్య దశాహంసూతకంభవేత్ ॥

తా॥ తల్లిదశాహమధ్యమందు తండ్రిమృతిబొందినయెడల తండ్రి మృతిబొందినది మొదలు ౧౦ దినములుసూతకమని తా॥

ధర్మప్రవృత్తౌ ॥ శ్లో ॥ మాతాపిత్రోర్యథాశౌచం దశాహంవిహితం బుధైః పైతృకాదూర్ధ్వమేవస్యా న్మాత్రాశౌచంతుపక్షిణి ॥

తా॥ తల్లిదండ్రి మొదలగువారి మృతులయందు ౧౦ దినములు ఆశౌచము తండ్రియొక్క శ్రాద్ధముచేయుచుండగా ఊర్ధ్వభాగమునందుతల్లిచనిపోయినయెడలమాత్రాశౌచము ఒకటిన్నర దినమని తాత్పర్యము

శ్లో॥ ఆద్యశ్రాద్ధమశుద్ధోపి కుర్యాచ్చైకాదశేహని । కర్తుస్తాత్కాలికాశుద్ధి రశుద్ధిఃపునరేవసః ॥

తా॥ ఆద్యశ్రాద్ధంబును అపరిశుద్ధుడైచేయవలెను ఈశ్రాద్ధముజేయుటవలన కర్తకుతత్కాలంబునందు పరిశుద్ధికలుగునని తాత్పర్యము

శ్లో॥ పితురాశౌచమధ్యేచే న్మాతుశ్శ్రాద్ధంపతేద్యది । రుద్రాహేషోడశాత్పశ్చా న్మాతుశ్శ్రాద్ధంవిధీయతే । మాతురాశౌచమధ్యేచేత్పితుశ్శ్రాద్ధంపతేద్యది।రుద్రాహేషోడశాదర్వాక్తచ్ఛ్రాద్ధంతువిధీయతే॥ ఇతి ఆశౌచఖండే శాతాతపః ।

అన్వయార్థః॥ ఏకాదశాహేపితుః షోడశాదిశ్రాద్ధం కృత్వా తతః మాతుః ప్రత్యాబ్దికంకర్తవ్యం ఏకాదశాహేఆద్యశ్రాద్ధంనిర్వర్త్యపితుః మృతాహశ్రాద్ధంకృత్వా అథఆద్యాదిషోడశశ్రాద్ధానికారయేదిత్యర్థః ॥

ఇతిమాతృదశాహమధ్యే పితృమృతిస్సమాప్తః.

## అధికమాస ప్రకరణము.

అధికమాసములో మృతిబొందినవానికి తిరిగిఆమాసముయెప్పుడైనా అధిమాసము వచ్చినయెడల ఆమాసమునందే ప్రత్యాబ్దికము. శుద్ధమాసములో జేయనక్కరలేదు. శుద్ధమాసమునందు మృతులయిన వారికైతే అధికమాసమునందు అవసరములేదు మాసికములు మాత్రి

ముఅధికమాసమందుకూడా శ్రాద్ధముచేయువలెను. అధికమాసములో మృతులైనవానికి శుద్ధమాసములో మృతదినమునకు లోగడదినమందు అన్వాద్య శ్రాద్ధము చేసి మృతతిథియందు ఊనమాసికము పెట్టవలెను. అక్కడనుంచి ౨౭ దినమందు నెలమాసికముపెట్టిముప్పదివదినమందు ద్వితీయమాసికముపెట్టి అక్కడనుంచి ౧౫ దినములలోగా మధ్యమంచకమునందు త్రైపక్షిక శ్రాద్ధము చేసి క్రమముగా సంవత్సరాంతము జరిగించవలెను. సంవత్సరమధ్య అధికమాసము సంభవించే యెడల శుద్ధాధికములకు ఒకటేసంకల్పము చేసి అధికమాసికముపెట్టవలయును. సంవత్సరాంతమందు అధికమువచ్చే పక్షమునకు ఊనాబ్దికమును సంవత్సరవిమోకమును ఆబ్దికమును 3 ను అధికమాసములోనే పెట్టవలసినదిగాని శుద్ధమాసంబున నాచరింపగూడదు. మధ్యాధికమువచ్చిన ప్రథమాబ్దికానికి లోగడమాసానికే 3౬0 దినములగునుగనుక లోగడ మాసములో ఊనాబ్దిక విమోకములు జరిగించవలెననే మాట యుక్తముగాదు, ఆ రెండుమాసములు 30 దినములసంజ్ఞే కనుక ప్రథమాబ్దికముతో కూడానే జరిగించవలయును. శుద్ధమాసమునందు మృతులయినవారికి ప్రథమాబ్దికము మలమాసమువచ్చినచో నప్పుడే చేయువలయును. ద్వితీయాబ్దికాదులు మాత్రముశుద్ధమాసమునందేజరుపవలెను.

తక్కినవిషయములు నిర్ణయసింధువునందు జూడవలెను.

కించ॥ గర్గః॥ శ్లో॥ అగ్న్యాధానప్రతిష్ఠాంచ యజ్ఞదానవ్రతానిచ। దేవవ్రతవృషోత్సర్గ చూడాకరణమేఖలాః। గమనందేవతీర్థానాం వివాహమభిషేచనమ్। యానంచగృహకర్మాణి మలమాసేవివర్జయేత్॥

తా॥ అగ్న్యాధానం- ప్రతిష్ఠ- యజ్ఞదానవ్రతములు-దేవవ్రతములు - కామ్యవృషోత్సర్గము- చూడాకరణము-మేఖల- దేవక్షేత్రతీర్థాటనము- వివాహము-అభిషేచనము- యానమును- గృహకర్మలు - అనువానిని మలమాసమునందు- విడువవలయునని గర్గుడుచెప్పె-

శ్లో॥ అవశ్యకర్మమాసాఖ్యం మలమాసమృతాబ్దికం। తీర్థేభచ్ఛాయయోః శ్రాద్ధ మఖకర్మపిత్రక్రియాః॥ కుర్యాన్మలిమ్లుచేవర్ష మధ్యే

చేత్సౌతదాధకం। తత్రతస్యాన్మాసికంమృత్యు మాసాత్సప్యాదశోయది
ప్రేతక్రియాసంమాప్త్యాత్ర కుర్యాతాభ్యుదయంతథా। శ్యామాకాగ్రయ
ణంకృచ్ఛ్రాణిత్రియువర్జమతోన్యథా॥

తా॥ మలమాసమునందు అవశ్యముగా చేయవలసిన మాసికాదికర్మములను ఆబ్దికములను-తీర్థశ్రాద్ధములను-యజ్ఞకర్మములను-పితృక్రియలను, చేయవచ్చుననియు యోగ్యవలయును, మఱియును. వర్షమధ్యమందు మలమాసము వచ్చెనేని అప్పుడధికమాసములు గ్రహింపవలయును మరణమాసము మొదలుకొని పదిరెండవమాసము మలమాసమయ్యెనేని దానియందు ప్రేతకర్మములను సమాప్తిని బొందించి పిమ్మట అభ్యుదయకర్మములను చేయవలయుననని మార్కండేయమను గ్రంథమునందు చెప్పఁబడియె.

కించ॥ శ్లో॥ కామ్యారంభంవృషోత్సర్గ పర్వోత్సవముపాకృతిమ్
మేఖలాచౌలమాంగల్యాఽగ్న్యాధానోద్యాపనక్రియా। వేదవ్రతిమహా
దానాఽభిషేకాన్వర్జమాసికమ్। ఇష్టంపూర్తంతథాయస్య విద్యలోపో
న్యథాకృతే। తత్సర్వమష్టకాదన్య దధమాసేవివర్జయేత్। సూతకేపిచ
కర్తవ్యం స్నానాద్యంరాహుదర్శనే॥

తా॥ కామ్యారంభము వృషోత్సర్గము, పర్వోత్సవము, ఉపాకర్మము, మేఖలము, చౌలము, మాంగల్యము, అగ్న్యాధానము ఉద్యాపనక్రియ, వేదవ్రతము మహాదానము, అభిషేకము అనువానిని అధికమాసమునందు, విడువవలయును, గ్రహణకాలమందు జననమరణాశౌచములు గలిగియున్నప్పటికిని గ్రహణప్రయుక్తస్నానాదికమును చేయవలయును, అనియును మార్కండేయమను గ్రంథమునందు చెప్పబడియె మఱియును॥

శ్లో॥ గర్భవార్ధుషికేభృత్యే ప్రేతకర్మణిమాసికే। సపిండీకరణేని
త్యే నాధమాసంతువర్జయేత్॥

తా॥ గర్భమునందును, వృద్ధియందును, భృత్యునియందును, ప్రేతకర్మమునందును, మాసికమునందును, సపిండీకరణమునందును, అధికమాసమును విడువవలనుపడదని పరాశరస్మృతియందుఁ జెప్పఁబడియె.

గ్రంథాంతరే॥ శ్లో॥ మాసద్వయేబ్దమధ్యేచ సంక్రామో నభవేద్యదా।
ప్రాకృతస్తత్రపూర్వస్స్యాదుత్తరస్తుమలిమ్లుచః॥

తా॥ సంవత్సర మధ్యమందు రెండధికమాసములు తటస్థించెనేని మొదటిమాసమును ప్రాకృతమాసమునుగాను రెండవమాసమును అధికమాసముగాను గ్రహింపవలయునని గ్రంథాంతరమందు చెప్పఁబడియె. ఇతి అధికమాసప్రకరణం సమాప్తమ్

అత్రానుగమనస్యైవ విధానాన్నాగ్రే పార్శ్వయోర్వాగంతవ్యం

శ్లో॥ ప్రేతస్య పార్శ్వయోరగ్రే నగచ్ఛేయుః కదాచన। తస్మాదగ్రేతు గంతౄణా మాయుః క్షీణం పదేపదే॥ మృతస్య పశ్చాద్గమనే ప్రాయశ్చిత్తం విధీయతే। కిల్బిషాదగ్రగమనే నిష్కృతిర్నోపపద్యతే॥ ఇతి దోషశ్రవణాత్ స్మృత్యంతరేవిశేషః॥

శ్లో॥ సంస్కారోపక్రమాత్పూర్వం కామంస్నాత్వావిశుధ్యతి। ప్రారబ్ధేపిహిసంస్కారే సమాప్తే స్నానమాచరేత్॥ ఏతదస్యవిషయం॥ ఆరంభాత్ప్రాక్పర స్నాయాత్తస్య శుద్ధిర్భవిష్యతి॥

తా॥ ప్రేతమునకు పార్శ్వములయందుగాని పశ్చాద్భాగంబునందుగాని పోవలయును, అట్లుగాక ప్రేతమునకు ముందుభాగమునందు నడిచినయెడల ఆయువు క్షీణించిపోవునని యభిప్రాయము పార్శ్వపశ్చాద్భాగంబులయందు నడచినవానికి ప్రాయశ్చిత్తముగలదు అగ్రభాగమునందు నడిచినవానికి ప్రాయశ్చిత్తములేదు కావున నగ్రభాగమందు బోఁగూడదని యభిప్రాయము దహనసంస్కారంబుల నుపక్రమించుటకుమునుపు స్నానంబు చేసినయెడల పరిశుద్ధిం బొందును దహనసంస్కారంబుల నుపక్రమించినపిమ్మట దహనమగునంతకును స్నానంబు చేసినయెడల శుద్ధిగలుగదు కావున సంస్కారంబును నుపక్రమించుటకు పూర్వంబునందు స్నానంబును జేయవలయునని స్మృత్యంతరవచనాభిప్రాయము.

ఇతి శవానుగమనే నియమస్సమాప్తః

— శ్మశానమునకు తీసికొనిపోఁబడిన శవము జీవించుట. —

శ్మశానంబునకు ప్రేతమును తీసికొనిపోయిన పిమ్మట నాశవమునకు ప్రాణంబులు వచ్చినయెడల మఱల వామనుజుఁడు గృహమునకు వచ్చెనేని యాగృహంబునకుఁ గీడు వాటిల్లును. కావున నాకీడు తొలఁగిపోవుటకొఱకు క్షీరమిశ్రిత సమిధశ్శతమును ఆజ్యంబును హోమమును జేయవలెను. బ్రాహ్మణులకు గోదానాది మహాదానములు జేసి సావిత్ర్యష్టోత్తరంబులచేత క్షీరంబులతో శాంతిని జేయవలయును. కపిలధేనువును, తిలలను, సువర్ణమును, వస్త్రమును ఆయుర్వృద్ధికొఱకు కర్త దానము జేసి బ్రాహ్మణాశీర్వాదము గ్రహించవలయును. ఇది యముని మతమని నారదమునివరుఁడు వచించె. కొందఱు ఇతరజంతువును ఇతని

మీద దిగతుడిచి ఆగ్రామము నుండి తిరుగు దిప్పి పారవేయుదురు. తక్కిన విష యములు స్మృతి సంగ్రహమందు జూడవలయును.

ఇతిశ్మశానాసీత శవజీవన విచారస్సమాప్తః.

నిత్యకర్మయందు శిలానష్టము.

దశాహములోగా జరుపు నిత్యకర్మ ప్రారంభించిన పిమ్మట దశాహ ములో పల ప్రమాదంబువలనశిలనష్టమైనయెడల అన్యశిలనుంచిపూర్వము వలె ఆవాహనము జేసి మరల తొలుతయిచ్చిన మృత్తికాస్నాన వాసో దకతిలోదకాలు పిండప్రదానంబులు మొదటిరోజునుంచి యథాక్రమ ముగాజరపవలెను. నష్టమయిన శిల మరలలభించిన యెడల విధ్యుక్తముగ వాసోదకాదుల నీయనక్కర లేదు. స్థలభ్రంశమునందును, శిలాపాత్ర కర్తృద్రవ్యంబులు నశించినను ప్రాజాపత్యత్రయంబునుచేసి పిండోదక దానంబులను మరలయథావిధిగా జేయవలయునని స్మృత్యంతరమందు జెప్పబడియె. తక్కిన విషయములు నిర్ణయసింధువు నందుజూడవలయును.

ఇతిశిలానష్ట విషయ స్సమాప్తః

సంవత్సర విమోకమందు తిథిద్వయ శ్రాద్ధనిర్ణయము.

గౌతమః శ్లో॥ తిథిద్వయేపిసంప్రాప్తే విమోకంప్రథమాబ్దికమ్।
తస్మిన్నేవక్రమాత్కుర్యా ద్పూర్వాహ్ణేచాపరాహ్ణకే ॥

తా. సంవత్సరవిమోకదినమందు తిథిద్వయముతటస్థించినేని సంవత్సరవిమోకప్రథమాబ్ది కములు రెండును-అదినమందే నాచరింపవలెనుఎట్లనిపూర్వాహ్ణమందుసంవత్సరవిమోకశ్రా ద్ధంబును-అపరాహ్ణమందుఅబ్దికశ్రాద్ధంబు నాచరించవలెననిశ్రీగౌతములవారియభిప్రాయము.

కించ॥ పరాశరాదిఋషిభిః రత్నావళ్యాంవిష్ణుస్మృతౌ ॥

శ్లో॥ విమోకాదిద్వయంకుర్యా ద్ద్విజశ్రేష్ఠ స్తిథిద్వయే। విమో కంపూర్వతఃకృత్వా ఆబ్దికంతదనంతరం। తిథిద్వయేతథాకార్యం అన్యథా దోషభాగ్భవేత్ ॥

తా॥ తిథిద్వయమువచ్చినదినమునందు విమోకము ప్రథమాబ్దికమువచ్చినయెడల పూర్వాహ్ణ మునందు విమోకముజరిపి అపరాహ్ణమందు ప్రథమాబ్దికముచేయవలెను అట్లాచేయనియెడల దోషము జేసినవాడగునని తా॥

కించ॥ శ్లో॥ సంవత్సరవిమోకాఖ్యం శ్రాద్ధంకుర్యాద్విచక్షణః। తథాబ్దికంవినా పూర్వం ఊనాబ్దికమథాపి వా। ఊనత్రైపక్షికంచైవ నకుర్యాన్మాసికంవినా।ఊనాంత్యమాసికంత్యక్త్వావిమోకంనైవకారయేత్॥

తా॥ కర్మనిష్ఠగలవాఁడు సంవత్సరవిమోకమునుచేయవలసినది, ఊనాబ్దికమునుచేయకుండప్రత్యాబ్దికమునుచేయఁగూడదు. త్రైపక్షికమునువిడిచి మాసికమును పెట్టకూడదు. ఊనమైన తరువాతమాసికమును విడిచిసంవత్సరవిమోకమును చేయఁగూడదని తా॥

ఇతి సంవత్సరవిమోకే తిథిద్వయ శ్రాద్ధనిర్ణయస్సమాప్తః.

## మృతతిథినిర్ణయము.

సిద్ధాన్తసారసంగ్రహే॥ శ్లో॥ సాయంతన్యతరత్రచేన్మృతతిథిస్స్యాద్వాబ్దికేమాసికే। సాగ్రాహ్యాద్వ్యపరాహ్ణయోర్యదితదాయత్రాధికాసామతా। తుల్యాచేదుభయాపరాహ్ణసమయే పూర్వానచేత్తద్వయోః। పూర్వైవత్రిముహూర్తగాన్తసమయే నోచేత్పరైవోచితా॥

తా॥ అహఃప్రమాణ ఘటికలను అయిదుపాళ్ళుచేయవలెను. వానిలో మొదటిభాగము ప్రాతఃకాలము, 2వ భాగము సంగమకాలము, 3వది మధ్యాహ్నము, 4వదిఅపరాహ్ణము, 5వది సాయాహ్నము. యీఅయిదు కాలములలో 4వ అపరాహ్ణకాలమున నేతిథిఘటికలు వ్యాపించియుండునో ఆతిథిశ్రాద్ధాదిపైతృకము మొదలగు సత్కర్మలకు ముఖ్యము యొకతిథికి రెండుదినములలో వ్యాప్తిగల్గియుంటే ఏదినమున అధికముగానుండునో దానిని నాచరింపవలయును రెండు దినములలో అపరాహ్ణవ్యాప్తి సమముగానుండిన పూర్వమనఁగా మొదటిదినమేముఖ్యము రెండు అపరాహ్ణములలోను వ్యాపింపకపోయిన పూర్వదినమున సాయాహ్నవ్యాప్తి చక్కగానుండినవాడేముఖ్యము. రెండు అపరాహ్ణములలోను సమముగానుండినప్పుడు తిథివృద్ధిపక్షమున రెండవనాడును క్షయపక్షమున మొదటినాడును కర్తవ్యము. దీనికిఁగాక శిష్టులందఱునుఆచరింపుచున్నారుఇఁకసంకల్పస్నానదానవ్రతదేవ పూజాదులలో విశేషవిధులు గల్గునవితప్ప తక్కినఅన్ని సత్కర్మలకును సూర్యోదయ కాలమున నేతిథిగల్గియుండునో ఆతిథియే- సంకల్పమునకు ముఖ్యము.

కించ॥ శ్లో॥ యాంతిథిం సమనుప్రాప్య ఉదయం యాతిభాస్కరః। సాతిథిస్సకలాజ్ఞేయాస్నానదానవ్రతాదిషు॥

తా॥ సూర్యుఁడు ఏతిథియందుదయించునో ఆతిథిస్నానదానవ్రతములు మొదలుగాగల సకలకార్యములకు ప్రాముఖ్యము.

ఇతి మృతతిథి నిర్ణయస్సమాప్తః

## శ్రాద్ధ సమయమందు త్యాజ్యవిషయము.

జ్యోతిస్సంగ్రహే॥ శ్లో॥ స్నానేదానే జపే హోమే వైశ్వదేవే సురార్చనే।
ప్రాయశ్చిత్తే తథా శ్రాద్ధే ప్రశస్తా విష నాడికా॥

తా॥ స్నానకాలమునందు, దానకాలమునందు, జపకాలమునందు, హోమకాలమునందు, వైశ్వదేవకాలమునందు, దేవతార్చనమందు, ప్రాయశ్చిత్తాదులయందు, శ్రాద్ధకాలమునందు, త్యాజ్యము వచ్చినప్పటికిని పైకార్యములు చేయవచ్చునని తా,

కించ॥ ప్రాచీనగ్రంథే ॥ శ్లో॥ ఆసనే శయనే భోజ్యే మలమూత్రోత్సృజేత థా।
ఉగ్రకర్మణ్యస్త్రవధా ప్రశస్తాః విషనాడికాః॥

తా॥ కూర్చుండుటయందు, నిద్రించుటయందు, భోజనకాలమందు, మలమూత్రములు విడుచుటయందు, చెడుపనివిషయమైన అస్త్రప్రయోగాదులయందును, విషఘడియలు నింద్యములుగావని తా.

ఇతి శ్రాద్ధసమయే త్యాజ్యవిషయస్సమాప్తః.

## దానాదిఫల నిరూపణము.

అయ్యా ౮౪ లక్షలజీవరాసులలో ఈ మనుష్యజన్మము లభించుట బహుదుర్లభము ఇట్టి జన్మము లభించియు దానధర్మాదులు చేయకయుండు మనుష్యుడు మఱుజన్మమునందు దరిద్రుడై పుట్టునని స్మృతులు ఘోషించుచుండె లోకమందు మనము చూచుచుంటిమి. మనుష్యజన్మమునందు దరిద్రుడై పుట్టి పాపకార్యములు చేయుచు అందువలన నరకము జెంది సమస్తబాధల కోర్వలేక దుఃఖించుచు మఱల దరిద్రుడుగా పుట్టును. తత్ప్రమాణము

శ్లో॥ అదానదోషేణభవేద్దరిద్రో దారిద్ర్యదోషేణ కరోతి పాపం। పాపాదవశ్యం నరకం ప్రయాతి పునర్దరిద్రః పునరేవ పాపీ॥ అన్నట్లు దానము చేయని దోషమువల్లనే వాడు దరిద్రుడుగా బుట్టుచు మఱల గిట్టుచు ఈ ప్రకారము సంసారసాగరమునందగిలి అల్లాడుచుండును గాని ఒకప్పుడైనను ముక్తి పొందజాలడు.

శ్లో॥ దరిద్రాయ కృతం దానం శూన్యలింగస్య పూజనం । అనాథ ప్రేతసంస్కార మశ్వమేధసమం విదుః॥ దరిద్రునకొఱకు చేయబడిన దాన

మును పూజలేనిగుళ్లకు పూజగలుగఁజేయుటయు, దిక్కులేనిపీనుగను త్తి కాల్చుటయు, ఈమూడును అశ్వమేధయాగము చేయుటవలన గలుగుఫలమునకు సమానమగు ఫలమునిచ్చునని బహుగ్రంథములు చెప్పుచున్నవి.

శ్లో॥ అనిత్యానిశరీరాణి విభవోనైవశాశ్వతః॥ నిత్యంసన్నిహితోమృత్యుః కర్తవ్యోధర్మసంగ్రహః॥ ఈశరీరము నిత్యముకానిది, సంపదలునిలుకడ లేనివి, మృత్యుదేవతదగ్గఱనే కాచియున్నది కాఁబట్టి మనము. పితృమాతృకర్మలందైనా తనశక్తికొలది దానధర్మములు చేయుటచే ఈజన్మను వచ్చినందున తనపితృలు సంతోషించడమేగాక తనకును రాఁబోవుజన్మమందు మహాభాగ్యవంతుడై జ్ఞానముగలవాఁడై ధనముగల గృహాదులందు జన్మించును యిదియునుగాక.

శ్లో॥ చలాలక్ష్మీశ్చలాః ప్రాణాశ్చలే దేహాపియౌవనం। చలంచలశ్చ సంసారః కీర్తిర్ధర్మశ్చనిశ్చలా॥ తా॥ సంపదలు-ప్రాణము-దేహము-యౌవనము-సంసారము-ఇవి యన్నియును నీటిబుగ్గలరీతిగా అస్థిరములైనవి. అయితే నిత్యముగా కీర్తియు ధర్మమును ఈరెండుమాత్రమే సుస్థిరముగానుండును.

శ్లో॥ అర్థాః పారదచంచలాః గిరినదీవేగోపమ జీవితం। ధర్మంయోనకరోతినిశ్చలమతిః స్వర్గార్గలోద్ఘాటనం। పశ్చాత్తాపయుతోజరాపరిణతశ్శోకాగ్ని నాదహ్యతే॥ తస్మాన్మాతృపితృక్రియాదిసమయే దానం ప్రశస్తంస్మృతం॥ తా॥ సంపదలు పాదరసమువలె నిలుకడగానివి, కొండమీదనుడికిందికి ప్రవహించునదులు యెంతశీఘ్రముగా ప్రవహించునో అంతశీఘ్రముగా జీవితముపారిపోవును. సముద్రమునందలి అలలయందుబుట్టిన నీటితుంపరలు యెట్లునిలుకడ లేకపోవునో అట్లుమానవజన్మము నిలుకడ లేనిదౌను. సముద్రమునందలి నురుగురీతిగాను మనజీవితకాలము అస్థిరమైనది కాఁబట్టి స్వర్గద్వారమునకు అడ్డముగామూసియుండెడు తలుపునుదెఱచిమనలనుస్వర్గమున జేర్చినసకలసౌఖ్యములను బొందునట్లుజేసెడుధర్మమునెవ్వడు చేయడో వాడుమరణకాలమున శోకాగ్ని చే తపించును. కాఁబట్టి

తల్లిదండ్రుల శ్రాద్ధాదిదినములయందైనను దానము జేయుట ప్రశస్తమైనదిగా జెప్పఁబడియె. శ్లో॥ ధర్మః శర్మభుజంగ పుంగవపురీ సారం విధాతుం క్షమో। ధర్మః ప్రాపితమర్త్యలోకవిపుల ప్రీతి స్తదాశంసినా। ధర్మస్స్వర్నగరీనిరంతరసుధా స్వాదోదయస్యాస్పదం। ధర్మః కిం నకరోతి ముక్తివనితా సంభోగభాగ్యంతరమ్॥ తా॥ ధర్మము నాగేంద్రపట్టణమునందలి స్థిరమైన సుఖము ననుభవించునట్లు చేయును భూలోకమున ధర్మము జేయువానికి మంచికీర్తియు జనులవలన ప్రీతియు కలుగును. మఱియు ధర్మము స్వర్గలోకము నందలి దేవామృతము పానము చేసి చావుపుట్టుకలు లేక సదా దేవేంద్రభోగముల ననుభవించునట్లు చేయును, ధర్మమువలన సకల సుఖములు కలుగును. ధర్మము ముక్తికాంతతో భోగించునట్లు చేయును.

శ్లో॥ ఏవం త్యాగగుణః శ్లాఘ్యః సర్వేషు గుణరాశిషు। త్యాగాజ్జగతి పూజ్యంతే పశుపాషాణపాదపాః॥ తా॥ దానము చేయునట్టి గుణమే సకలగుణములలో శ్రేష్ఠ సద్గుణము- దానము చేయువాఁడే గుణవంతుఁడు పశువులలో కామధేనువును- వృక్షములలో కల్పవృక్షమును శిలలలో చింతామణియనుశిలయును నెవరెవరు యేది అడిగినను లేదనక నిచ్చునట్టి గుణమును కలిగియుండుటవల్లనే కదా అవి దేవతలు మనుష్యులు మొదలైన వారిచేత సదా పూజింపఁ బడుచున్నవి. ఇంతియే గాదు॥ దానమాహాత్మ్యమంతు॥

శ్లో॥ సాలగ్రామశిలాం పృథ్వీం కన్యాం విద్యాంచ వైదికీం। యోదత్తే యస్సగృహ్ణాతి తావుభౌ స్వర్గగామినౌ॥ అని చెప్పఁబడినది.

ఆదిత్యపురాణమందు॥ శ్లో॥ జ్ఞానదాదధికః కించిద్గృశ్యతే భువనత్రయే। దానేన ప్రాప్యతే స్వర్గః॥ అని చెప్పఁబడినది- యస్యవిత్తం నధర్మాయనో శభోగాయతస్య విత్తం నిరర్థకం॥

గరుడపురాణమందు॥ శ్లో॥ పితుశ్శతగుణం దానం సహస్రం మాతురుచ్యతే। భగిన్యాం దశసాహస్రం సోదరే దత్తమక్షయమ్॥ మఱియు॥

దానాదులవలన స్వర్గసుఖము పుత్రపౌత్రాదులును కీర్తియు మగలుగుచున్నవి.

అందువలన దానముకన్న నధికమైనదెక్కడను మూడు లోకములయం దేదియును లేదు, యెవ్వనియొక్క ద్రవ్యము ధర్మముకొఱకైనను తాను అనుభవించుట కొఱకైనను ఉపయోగించునో అతని ద్రవ్యము సార్థకము లేకున్నచో నిరర్థకము.

కించమనుస్మృతౌ॥ శ్లో॥ వారిదస్తృప్తిమాప్నోతి సుఖమక్షయమన్నదః। తిలప్రదః ప్రజామిష్టాం దీపదశ్చక్షురుత్తమమ్ ॥

తా॥ జలమునిచ్చినవాఁడు క్షుత్పిపాసలులేని తృప్తినిబొందును. అన్నదాత యక్షయసుఖమునొందును తిలలునిచ్చువాడు తనకిష్టమగుసంతానముగలవాడగును దేవబ్రాహ్మణాదులకుపయోగముగ దీప మిడినవాఁడుత్తమములగు చక్షుస్సులనొందును.

శ్లో॥ భూమిదో భూమిమాప్నోతి దీర్ఘమాయుర్హిరణ్యదః। గృహదోఽగ్ర్యాణి వేశ్మాని రూప్యదో రూపముత్తమమ్॥

తా॥ భూదాతభూపతియగును సువర్ణము దానమునిచ్చువాఁడు దీర్ఘాయుష్యము నొందును గృహప్రదుఁడు సుందరగృహములుగలవాడగును. వెండినిచ్చినవాఁడు సుందరుఁడగును సౌందర్యము గలవాడగును.

శ్లో॥ వాసోదశ్చంద్రసాలోక్య మశ్విసాలోక్యమశ్వదః। అనడుహః శ్రియం పుష్టాం గోదో బ్రధ్నస్య విష్టపమ్ ॥

తా॥ వస్త్రదాత చంద్రలోకమును గుఱ్ఱము నిచ్చినవాడశ్వినిదేవతల లోకమును ఎద్దునిచ్చెనేని సంపూర్ణమగుసంపత్తిని గోవునిచ్చినవాఁడు సూర్యలోకమును బొందును.

శ్లో॥ యానశయ్యాప్రదో భార్యా మైశ్వర్యమభయప్రదః। ధాన్యదశ్శాశ్వతం సౌఖ్యం బ్రహ్మదో బ్రహ్మసార్ష్టితామ్ ॥

తా॥ రథాదియానములు శయ్యలు నొసగినవానికిభార్యాలాభమగును, ప్రాణుల కభయమిచ్చునతఁడు ప్రాణిహింసచేయనివాఁడు గొప్పయైశ్వర్యమును బొందును ధాన్యము ననగా శాలియవగోధూమాదులనిచ్చువాడు శాశ్వతసుఖము నొందును వేదమును జెప్పినను తదర్థమును దెలిపినను బ్రహ్మలోకమునవనగా ముక్తుడగును.

శ్లో॥ సర్వేషామేవ దానానాం బ్రహ్మదానం విశిష్యతే। వార్యన్న గోమహీవాస స్తిలకాంచనసర్పిషామ్ ॥

తా॥ అన్నోదకగోమహీ తిలకాంచనాది దానములేవిగలవో వీటన్నింటిలోను వేదవేదాంగములను బ్రాహ్మణునికి చెప్పుట యుత్కృష్టఫలప్రదంబగును.

శ్లో॥ యేన యేన తు భావేన యద్యద్దానం ప్రయచ్ఛతి। తత్తత్తేనైవ భావేన ప్రాప్నోతి ప్రతిపూజితః॥

తా. ఎవరుయేయేఅభిప్రాయముచే స్వర్గాద్యపేక్షచే గాని ముముక్షువై తేనిష్కామముచే గాని యేయేదానము చేయుదురో ఆయాభావముచే ఆయాదానముల ఫలముగా జన్మాంతరమందు పూజితులై దానిదానిఫలమును బొందుదురు.

శ్లో॥ ధర్మం శనైస్సంచినుయాద్వల్మీకమివ పుత్తికాః।
పరలోకసహాయార్థం సర్వభూతాన్యపీడయన్।

తా. భూతపీడలేకుండ పరలోకసహాయార్థమై ధర్మమును చెదలపురుగులు పుట్టబెట్టినట్లు మెల్లమెల్లగా వృద్ధినొందింపవలెను.

శ్లో॥ నాముత్ర హి సహాయార్థం పితా మాతా చ తిష్ఠతః। న పుత్రదారా న జ్ఞాతిర్ధర్మస్తిష్ఠతి కేవలః॥

తా. పరలోకమందు సహాయులు తల్లి-తండ్రి-భార్య-పుత్రుడు-జ్ఞాతివీరెవ్వరును గారు-ధర్మమొకటియే పరలోకసహాయమైయుండును.

సకలచుట్టములు తనతోఁగూడవచ్చువారుగారు. వాఁడుచేసినపాపముగాని పుణ్యముగాని వానివాని వెంటఁబడిపోవును. ఒకమనుష్యుఁడు యెంతధనవంతుఁడైనను దానమూలముగా యిచ్చినదితప్ప-లెక్కలేనద్రవ్యమంతయు తనకు చెందునదిగాదు. పూర్వజన్మమందు విశేషముగద్రవ్యమార్జించి దానిసత్కర్మములయందును. దానాదిక్రియలయందును-ఉపయోగించినవాఁడే యీజన్మమున మహాభాగ్యవంతుఁడగును. అట్టివాఁడీజన్మమున విశేషభక్తిశ్రద్ధలతోఁడ సత్కర్మములఁజేసెనేని-ఇంకొకజన్మమున మిగులభాగ్యవంతుఁడై ధర్మార్థకామ్యమోక్షములకర్హుఁడగును. భక్తిశ్రద్ధలు లేక ధర్మము చేసినను అధనమువ్యర్థము. భక్తిశ్రద్ధలతో నొనర్చిన ధర్మము కొంచెమైనను కొండంతయగును. ఎట్టికార్యమునకుగాని మనస్సు నిర్మలముగానుండవలయును. మనోనిశ్చయము లేక చేసినతపముగాని-దానముగాని-ధర్మముగానినిరర్థకంబులగును. ప్రతిమానవుఁడును తనకు రోగము వచ్చుననియు-వృద్ధత్వము వచ్చుననియు-కాలముదగ్గునని యుచక్కగా దెలిసికొని అంత్యకాలమందు సద్గతినొందుటకు బాల్యమునఁ వివేకము తెలిసినది

మొదలు సత్కార్యములు చేయుచు రావలెను సత్కార్యములను రేపు చేయుదము తర్వాత జేయుదమను తలపు కూడదు. ఏలనగా దేహమనిత్యముకనుక సాధ్యమైన మట్టుకు తలచినపని తలచినట్లు చేయవలయును. ప్రపంచమందు పుణ్యాత్ములు చేసిన స్థిరమగు యేర్పాటులు యెల్ల జీవరాసులు బ్రతుకుచున్నవి చూడుడు. మనము యెన్నాళ్లు బ్రతికినను మరణముస్థిరమని తలంచువారు బహు అరుదుగా నుండెదరు. లోకమందు నొకవంశమునొకపుణ్యాత్ముండు-సత్రము, వనము-తటాకము - ధననిక్షేపము-శివాలయము-కూపము-గ్రంథము- మొదలగు ఇట్టిమహోపకారములలో నొకదానిని ప్రతిష్ఠించినందున అశేషజనులు అట్టివారిని నిత్యము స్మరింపుదురు. అట్టివారు మృతిబొందినను బ్రతికియున్న వారితో సమానులేను. వారికిస్వర్గమే నిశ్చయము. మనజీవితకాలము విచారింపగా రేపోమాపో అన్నట్లుండెను ఇంతలో తోవదోచుట, తప్పుపన్నుటలు జేయుట- హత్యజేయుట - మొదలగుతప్పుకార్యములంజేసి సంపాదించి దారాపుత్రులు మొదలగుబంధువులకుం బెట్టును. అందువలన ఈజీవునకు ఫలముకలదా? లేదు. దానివలనగలిగెడి పాపమును దారాపుత్రులు యనుభవింతురా? లేదు. ఎవ్వడైతే పాపకార్యములను జేయునో వాడుమాత్రమే దానిఫలము ననుభవింపవలెను. అనగా నరకకూపమందు బడి చాలాకాలము నాబాధకోర్వలేక యేడ్చుచుండును. తిరిగి అట్టిమహాపాపనివృత్తికొఱకు మరుజన్మంబున తాను చేసిన పాపమునకే అట్టిదుష్కృతశేషము అనుభవించుటకు నీచజన్మమందు మహారోగవంతుడై పుట్టుచూగిట్టుచునుండును. గాన ఒకప్పుడైనను భగవద్భక్తియు, దేవబ్రాహ్మణగురుపూజయు విద్యాన్నదానాది మహాదానములు మొదలగు మహోపకారములను తాను చేయుటకు శక్తిలేకపోయినను చేయువారికైనా తాను సహాయభూతుడై ఆధర్మములను వృద్ధిచేసినట్లాయెనా ఇతనికి కూడఫలముగలదు. గానిదానప్రదాతకుమాత్రము ఇహలోకపరలోకములయందు బహుకీర్తియు ప్రతిష్ఠయు అందువలన స్వర్గము నిశ్చయ

ముగా కలుగునని గ్రంథములు ఘోషించుచున్నవి. కనుక అటువంటివాని జన్మము సార్థకము లేకున్నచో నిరర్థకము వట్టిమాటలతో నేమి ప్రయోజనము. తనశక్తికొలది తానుజీవించియుండగానే గోదానాదిమహాదానములు తత్క్షణమే జర్పవలయును. దేహమనిత్యము గనుక పుణ్యకార్యములవిషయమై తలచినపనితలచినట్లు చేయుట ప్రథమకర్తవ్యము.

### కారుణ్య విషయము.

శ్లో॥ ఆదౌపితాతథామాతా సాపత్నీజననీతథా। మాతామహస్సపత్నీకా ఆత్మపత్నీ ల్వనంతరమ్॥ సుతభ్రాతృపితృవ్యాశ్చ మాతులాస్సహభార్యకాః॥ దుహితాభగినీచైవ దౌహిత్రో భాగినేయకః॥ పితృష్వసామాతృష్వసా జామాతా భావుకస్నుషా। శ్వశురస్స్యాలకశ్చైవ స్వామినోగురురర్థినః॥ కించ॥(జనకపితృమాతౄణాంసపత్నీవిశేషః)

తా॥ ముందు తల్లిదండ్రులు, పిదప సవతితల్లి అటుపిమ్మట మాతామహ మాతుః పితామహ మాతుః ప్రపితామహులు, మాతామహీమాతుః పితామహీమాతుః ప్రపితామహీలు, తనభార్య. కుమారుడు, అన్నదమ్ములు, పినతండ్రి పెదతండ్రి, మేనమామ, మేనమామభార్య, కుమార్తె, తోడబుట్టువు, మనుమడు, మేనల్లుడు, మేనత్తలు, పినతల్లి పెదతల్లులు, అల్లుడు, తోడబుట్టువులభర్త, కోడలు, భార్యయొక్క తండ్రి, భార్యయొక్క సోదరుడు, గురువు యాచకులు, వీరలు క్రమముగ కారుణ్యములోని వారని తెలియవలయును,

---

అక్క (జ్యేష్ఠభగిని)
అత్త (శ్వశ్రువు)
అన్న (జ్యేష్ఠభ్రాత)
అన్నకూతురు (జ్యేష్ఠభ్రాతృపుత్రి)
అన్నకొడుకు (జ్యేష్ఠభ్రాతృపుత్రుడు)
అక్కకూతురు (జ్యేష్ఠభగినీపుత్రి)
అక్కకొడుకు (జ్యేష్ఠభగినీపుత్రుడు)
అక్కమగడు (భావుకుడు)
అమ్మమ్మ (మాతామహి)
అల్లుడు (జామాత)
కూతురు (దుహిత)
కొడుకుకూతురు (పౌత్రి)
చెల్లెలు (కనిష్ఠభగిని)
చెల్లెలికూతురు (కనిష్ఠభగినీపుత్రి)
చెల్లెలికొడుకు (కనిష్ఠభగినీపుత్రుడు
చెల్లెలిమగడు (భావుకుడు
తండ్రి (పిత)
తండ్రి తండ్రి (పితామహుడు)
తమ్ముడు (కనిష్ఠభ్రాత)
తమ్మునికూతురు (కనిష్ఠభ్రాతృపుత్రి)

తమ్ముని కొడుకు (కనిష్ఠభ్రాతృపుత్రుడు)
తల్లి చెల్లెలు (కనిష్ఠమాతృభగిని)
తల్లియక్క (జ్యేష్ఠమాతృభగిని)
తల్లియక్కకూతురు (జ్యేష్ఠమాతృభగినీపుత్రిక)
తల్లియక్కకొడుకు (జ్యేష్ఠమాతృభగినీపుత్రుడు
నాయనమ్మ (పితామహి)
పినతండ్రి (కనిష్ఠపితృవ్యుడు)
పినతండ్రికూతురు (కనిష్ఠపితృవ్యపుత్రి)
పినతండ్రికొడుకు [కనిష్ఠపితృవ్యపుత్రుడు
పినతండ్రిభార్యా [కనిష్ఠపితృవ్యపత్ని
పినతల్లికూతురు[కనిష్ఠమాతృభగినీపుత్రి
పినతల్లికొడుకు[కనిష్ఠమాతృభగినీపుత్రుడు]
పెదతండ్రి [జ్యేష్ఠపితృవ్యుడు]
పెదతండ్రికూతురు [జ్యేష్ఠపితృవ్యపుత్రి]
పెదతండ్రికొడుకు [జ్యేష్ఠపితృవ్యపుత్రుడు]
పెదతండ్రిభార్య [జ్యేష్ఠపితృవ్యపత్ని
భార్యసోదరుడు [స్యాలకుడు]
మగనితమ్మునికూతురు [భర్తృకనిష్ఠభ్రాతృపుత్రి
మనమరాలు [దౌహిత్రి]
మేనత్త [పితృభగిని]
మేనత్తకూతురు [పితృభగినీపుత్రి]
మేనత్తకొడుకు [పితృభగినీపుత్రుడు]

కాత్యాయనః॥ శ్లో॥ సంకల్పాసనయోశ్చాపి ద్వితీయావాహనేతథా।
అన్నదానేచతుర్థీస్యాచ్ఛేషాస్సంబుద్ధయస్స్మృతాః॥

పారస్కరః॥ శ్లో॥ అర్ఘ్యదానేచసంకల్పే పి డదానే తథాక్షతే।
గోత్రసంబంధనామాని తథా తత్ప్రతిపాదయేత్॥

ఇతి కారుణ్యవిధిస్సమాప్తః.



కారుణ్య శబ్దములు.

ఋకారాన్తః- పుంలిఙ్గః - పితృశబ్దః - తండ్రి.

| విభక్తిః. | ఏకవచనమ్. | ద్వివచనమ్. | బహువచనమ్. |
|---|---|---|---|
| ప్ర | పితా | పితరౌ | పితరః |
| సం | హేపితః | హేపితరౌ | హేపితరః |
| ద్వి | పితరం | పితరౌ | పితౄన్ |
| తృ | పిత్రా | పితృభ్యాం | పితృభిః |
| చ | పిత్రే | పితృభ్యాం | పితృభ్యః |
| పం | పితుః | పితృభ్యాం | పితృభ్యః |
| ష | పితుః | పిత్రోః | పితౄణాం |
| స | పితరి | పిత్రోః | పితృషు |

ఏవంభ్రాతా- జామాతా- ఇత్యాదయః.

ఋకారాన్త స్త్రీలింగో మాతృశబ్దః- తల్లి.

| | ఏకవచనమ్ | ద్వివచనమ్ | బహువచనమ్ |
|---|---|---|---|
| ప్ర | మాతా | మాతరౌ | మాతరః |
| సం | హేమాతః | హేమాతరౌ | హేమాతరః |
| ద్వి | మాతరం | మాతరౌ | మాతౄః |
| తృ | మాత్రా | మాతృభ్యాం | మాతృభిః |
| చ | మాత్రే | మాతృభ్యాం | మాతృభ్యః |
| పం | మాతుః | మాతృభ్యాం | మాతృభ్యః |
| ష | మాతుః | మాత్రోః | మాతౄణాం |
| స | మాతరి | మాత్రోః | మాతృషు |

ఏవందుహితా - ఇత్యాదయః.

ఈకారాన్త స్త్రీలింగో జననీశబ్దః జనకతల్లి.

| | ఏకవచనమ్ | ద్వివచనమ్ | బహువచనమ్. |
|---|---|---|---|
| ప్ర | జననీ | జనన్యౌ | జనన్యః |

| | | | |
|---|---|---|---|
| సం | హేజనని | హేజనన్యౌ | హేజనన్యః |
| ద్వి | జననీం | జనన్యౌ | జననీః |
| తృ | జనన్యా | జననీభ్యాం | జననీభిః |
| చ | జనన్యై | జననీభ్యాం | జననీభ్యః |
| పం | జనన్యాః | జననీభ్యాం | జననీభ్యః |
| ష | జనన్యాః | జనన్యోః | జననీనాం |
| స | జనన్యాం | జనన్యోః | జననీషు |

ఏవం భగినీ- పితృభగినీ- మాతృభగినీ- దేవీదాసీ- ఇత్యాదయః.

అకారాన్తః పుంలింగో మాతామహ శబ్దః- తల్లిదండ్రి.

| | ఏకవచనమ | ద్వివచనమ్ | బహువచనమ్. |
|---|---|---|---|
| ప్ర | మాతామహః | మాతామహౌ | మాతామహాః |
| సం | హేమాతామహ | హేమాతామహౌ | హేమాతామహాః |
| ద్వి | మాతామహం | మాతామహౌ | మాతామహాన్ |
| తృ | మాతామహేన | మాతామహాభ్యాం | మాతామహైః |
| చ | మాతామహాయ | మాతామహాభ్యాం | మాతామహేభ్యః |
| పం | మాతామహాత్ | మాతామహాభ్యాం | మాతామహేభ్యః |
| ష | మాతామహస్య | మాతామహయోః | మాతామహానాం |
| స | మాతామహే | మాతామహయోః | మాతామహేషు |

ఏవం దౌహిత్రః- భాగినేయః- భావుకః- ఇత్యాదయః.

ఈకారాంత స్త్రీలింగో మాతామహీశబ్దః- తల్లితల్లి

| | ఏకవచనమ్ | ద్వివచనమ్ | బహువచనమ్. |
|---|---|---|---|
| ప్ర | మాతామహీ | మాతామహ్యౌ | మాతామహ్యః |
| సం | హేమాతామహి | హేమాతామహ్యౌ | హేమాతామహ్యః |
| ద్వి | మాతామహీం | మాతామహ్యౌ | మాతామహీః |
| తృ | మాతామహ్యా | మాతామహీభ్యాం | మాతామహీభిః |
| చ | మాతామహ్యై | మాతామహీభ్యాం | మాతామహీభ్యః |

| | | | |
|---|---|---|---|
| పం | మాతామహ్యాః | మాతామహీభ్యాం | మాతామహీభ్యః |
| ష | మాతామహ్యాః | మాతామహ్యోః | మాతామహీనాం |
| స | మాతామహ్యాం | మాతామహ్యోః | మాతామహీషు. |

ఈకారాన్త స్త్రీలింగో పత్నీశబ్దః- భార్య.

| | ఏకవచనమ్ | ద్వివచనమ్ | బహువచనమ్. |
|---|---|---|---|
| ప్ర | పత్నీ | పత్న్యౌ | పత్న్యః |
| సం | హేపత్ని | హేపత్న్యౌ | హేపత్న్యః |
| ద్వి | పత్నీం | పత్న్యౌ | పత్నీః |
| తృ | పత్న్యా | పత్నీభ్యాం | పత్నీభిః |
| చ | పత్న్యై | పత్నీభ్యాం | పత్నీభ్యః |
| పం | పత్న్యాః | పత్నీభ్యాం | పత్నీభ్యః |
| ష | పత్న్యాః | పత్న్యోః | పత్నీనాం |
| స | పత్న్యాం | పత్న్యోః | పత్నీషు |

ఏవం దేవీ- దాసీ ఇత్యాదయః.

అకారాన్తః పుంలింగో సుతశబ్దః- పుత్త్రుఁడు.

| | ఏకవచనమ్ | ద్వివచనమ్ | బహువచనమ్. |
|---|---|---|---|
| ప్ర | సుతః | సుతౌ | సుతాః |
| సం | హేసుత | హేసుతౌ | హేసుతాః |
| ద్వి | సుతం | సుతౌ | సుతాన్ |
| తృ | సుతేన | సుతాభ్యాం | సుతైః |
| చ | సుతాయ | సుతాభ్యాం | సుతేభ్యః |
| పం | సుతాత్ | సుతాభ్యాం | సుతేభ్యః |
| ష | సుతస్య | సుతయోః | సుతానాం |
| స | సుతే | సుతయోః | సుతేషు |

ఏవం మాతులః- భావుకః- శ్వశురః- స్యాలకః.

గుప్తః- దాసః- ప్రేతః- ఇత్యాదయః.

### ఆకారాన్త స్త్రీలింగో స్నుషాశబ్దః కోడలు

| | ఏకవచనమ్ | ద్వివచనమ్ | బహువచనమ్. |
|---|---|---|---|
| ప్ర | స్నుషా | స్నుషే | స్నుషాః |
| సం | హే స్నుషే | హే స్నుషే | హే స్నుషాః |
| ద్వి | స్నుషాం | స్నుషే | స్నుషాః |
| తృ | స్నుషయా | స్నుషాభ్యాం | స్నుషాభిః |
| చ | స్నుషాయై | స్నుషాభ్యాం | స్నుషాభ్యః |
| పం | స్నుషాయాః | స్నుషాభ్యాం | స్నుషాభ్యః |
| ష | స్నుషాయాః | స్నుషయోః | స్నుషాణాం |
| స | స్నుషాయాం | స్నుషయోః | స్నుషాసు |

ఏవంగుప్తా- ప్రేతా- ఇత్యాదయః.

### ఊకారాన్త స్త్రీలింగో శ్వశ్రూశబ్దః - అత్త.

| | ఏకవచనమ్ | ద్వివచనమ్ | బహువచనమ్. |
|---|---|---|---|
| ప్ర | శ్వశ్రూః | శ్వశ్ర్వౌ | శ్వశ్ర్వః |
| సం | హే శ్వశ్రు | హే శ్వశ్ర్వౌ | హే శ్వశ్ర్వః |
| ద్వి | శ్వశ్రూం | శ్వశ్ర్వౌ | శ్వశ్రూః |
| తృ | శ్వశ్ర్వా | శ్వశ్రూభ్యాం | శ్వశ్రూభిః |
| చ | శ్వశ్ర్వై | శ్వశ్రూభ్యాం | శ్వశ్రూభ్యః |
| పం | శ్వశ్ర్వాః | శ్వశ్రూభ్యాం | శ్వశ్రూభ్యః |
| ష | శ్వశ్ర్వాః | శ్వశ్ర్వోః | శ్వశ్రూణాం |
| స | శ్వశ్ర్వాం | శ్వశ్ర్వోః | శ్వశ్రూషు |

### ఉకారాన్తః పుంలింగో గురుశబ్దః- గురువు.

| | ఏకవచనమ్ | ద్వివచనమ్ | బహువచనమ్ |
|---|---|---|---|
| ప్ర | గురుః | గురూ | గురవః |
| సం | హే గురో | హే గురూ | హే గురవః |
| ద్వి | గురుం | గురూ | గురూన్ |

| | | | |
|---|---|---|---|
| తృ | గురుణా | గురుభ్యాం | గురుభిః |
| చ | గురవే | గురుభ్యాం | గురుభ్యః |
| పం | గురోః | గురుభ్యాం | గురుభ్యః |
| ష | గురోః | గుర్వోః | గురూణాం |
| స | గురౌ | గుర్వోః | గురుషు |

నకారాన్తః పుంలింగో స్వామిశబ్దః- స్వామి.

| | ఏకవచనమ్ | ద్వివచనమ్ | బహువచనమ్ |
|---|---|---|---|
| ప్ర | స్వామీ | స్వామినౌ | స్వామినః |
| సం | హేస్వామిన్ | హేస్వామినౌ | హేస్వామినః |
| ద్వి | స్వామినం | స్వామినౌ | స్వామినః |
| తృ | స్వామినా | స్వామిభ్యాం | స్వామిభిః |
| చ | స్వామినే | స్వామిభ్యాం | స్వామిభ్యః |
| పం | స్వామినః | స్వామిభ్యాం | స్వామిభ్యః |
| ష | స్వామినః | స్వామినోః | స్వామినాం |
| స | స్వామిని | స్వామినోః | స్వామిషు. |

ఏవం- శర్మా- వర్మా- ఇత్యాదయః.

గ్రంథవిస్తర భయమువలన కొన్నిశబ్దములు ఈగ్రంథమందు చేర్పనైతి.

## శ్రాద్ధాదులవలన పితృదేవతలు సంతోషించుట.

అయ్యా! ఈకలికాలమహిమవలన కొందఱుపుత్రులు మాతాపితరులను సదా దూషింపుచు వారుమృతులైె వెనుక వారికి స్వకాలములయందు శ్రాద్ధములఁజేయక మాతల్లిదండ్రులు తినవచ్చినారా పురోహితబ్రాహ్మణులకొఱకు ఈశ్రాద్ధము లేర్పడినవనే అభిప్రాయః గలవారలగుచున్నారు.

శ్లో॥ పున్నామ్నోనరకాద్యస్మాత్పితరం త్రాయతేసుతః॥ తస్మాత్పుత్రఇతిప్రోక్తస్స్వయమేవస్వయ భూవా॥అనఁగాపుత్రుఁడుపుట్టుటచేత తండ్రికి సద్గతి నిచ్చుచున్నాడుగదా. వీఁడు పుట్టుటచేత తండ్రియొక్క

దుఃఖము నివర్తించును, ధర్మప్రజాసంతతిపరంపరను తనతో పోనియ్యక పెంచినందుకుబదులు తండ్రికి దుఃఖనివృత్తి.

శ్లో॥ జీవతో వాక్యకరణాత్ ప్రత్యబ్దం భూరిభోజనాత్। గయాయాం పిండదానాచ్చ త్రిభిః పుత్రస్య పుత్రతా॥ నాస్తిమాతృసమం దైవం నాస్తిపితృసమో గురుః। తయోర్నిత్యం ప్రియం కుర్యాత్కర్మణా మనసా గిరా॥ అయ్యా తల్లితో సమానమైన దైవమును తండ్రితో సమానమైన గురువును లేదు. ఎల్లప్పుడు మనోవాక్కాయములనెడు త్రికరణశుద్ధిగా వారికి ప్రియముగా నడుచుకొనుచు వారిని సేవించుచుండుటయే పుత్త్ర లక్షణము.

శ్లో॥ భూప్రదక్షిణషట్కేన కాశీయాత్రాయుతేనచ। సేతుస్నానశతైర్యచ్చ తత్ఫలం మాతృవందనే॥ తా॥ భూమండలమంతయు ఆరుమారులు తిరుగుటచేతను పదివేలమార్లు కాశీక్షేత్రమునకు పోవుటచేతను నూరు పర్యాయములు సేతుస్నానము చేయుటచేతను ఎంతపుణ్యముగలుగునో అంతపుణ్యము సూక్ష్మముగా కలుగును ఎట్లనగా తన తల్లిగారికి యొకతూరి ప్రదక్షిణము జేసి భక్తితో నమస్కరించిన ఆఫలము తప్పక కలుగునని తాత్పర్యము.

శ్లో॥ అపుత్రస్య గతిర్నాస్తి స్వర్గో నైవచ నైవచ। తస్మాత్పుత్రముఖం దృష్ట్వా పశ్చాద్భవతి తాపసః॥ పుత్రసంతానము లేనివానికి స్వర్గాది భోగములు లేవు కనుక పుత్రసంతానము కలిగిన వెనుకనే తండ్రి సన్యసించి తపస్సు చేయవలెను. ఈవిషయమై అనేక ప్రమాణములుగలవు. గ్రంథవిస్తరభీతిచే వ్రాయనైతిని. పుత్రుడైనవాడు తల్లిదండ్రులనొద్దనుండి సమస్తమైన ఉపచారములు జేయుచు పిదప వారు గతించినచో వారికి స్వకాలములయందు దహనాదికర్మలు మొదలగునవి జేసి తనశక్తికొలది దానధర్మములు జేయుచురావలెను. పిదప ప్రతిమాసమందును జరుపుమాసికాదిశ్రాద్ధములొనర్చి సంవత్సరవిమోకశ్రాద్ధము, అబ్దిక శ్రాద్ధమువలెను వారివారి కులాచార ప్రకారముగా జరుపుచురావలెను.

పితృస్థానంబునకిచ్చిన ఆమముగాని అన్నముగాని పిత్రాదులు దేవరూపులైయుండిరేని మంత్రబలముచేత వారికిచెందుచున్నవని శాస్త్రములుచెప్పుచున్నవి. అట్లుగాక వారుగంధర్వులై జన్మించియుంటే భోగ్యరూపమైచెందును పశువులైజన్మించితే తృణరూపమైచెందును. సర్పజన్మమెత్తితే వాయురూపమైయాహారమగును రాక్షసాదిజన్మమెత్తితే అదిమాంసరూపమగును లేక ప్రేతరూపులైతే రక్తమైతృప్తిగలుగును. లేకమనుష్యజన్మము సంభవించితే యన్నాదిరూపముచే ఆజీవుడుసంతోషించును. ఆకారణముచేతనే పూర్వులుబంధువులను జ్ఞాతులనుబిలిచి వారికందరికి భోజనములుపెట్టుటకలదు. యిప్పటికిఈయాచారము లోకమందుజరుగుచునేయున్నది. ఈవిషయమైయనేకప్రమాణములుగలవు వానినన్నిటిని ఈగ్రంథమందుచేర్చనైతిని. శ్రాద్ధదర్పణమనుగ్రంథంబున.

శ్లో॥ తస్యతేపితరశ్శ్రుత్వా శ్రాద్ధకాలముపస్థితం। అన్యోన్యం మనసాధ్యాత్వా సంపతంతి మనోజవాః॥ బ్రాహ్మణైస్సహాశ్నంతి పితరో వాయురూపిణః॥ తా॥ పితృదేవతలు శ్రాద్ధకాలము రాగానే మనస్సుచే నన్యోన్యము ధ్యానించియందఱు వాయురూపముచే మనోవేగమునవచ్చి యావాహనముచేసిన బ్రాహ్మణులతో శ్రాద్ధములుభుజింతురని శాస్త్రములు చెప్పుచున్నవిగనుకనే. శ్రీరామచంద్రుడు శ్రాద్ధముజేయునపుడు సీతాదేవి బ్రాహ్మణులయందు దశరథాదులనుజూచెనని కథ వినబడుచున్నది. మఱియు.

శ్లో॥ ప్రావృష్యంతేయమః ప్రేతాన్ పితౄంశ్చాపియమాలయాత్। విసర్జయతిభూలోకం కృత్వాశూన్యంస్వకంపురం॥ తేపుత్రాదేః ప్రకాంక్షంతి పాయసంమధుసంయుతం। కన్యాగతేసవితరి పితరోయాంతివైసుతాన్॥ అమావాస్యాదినేప్రాప్తే గృహద్వారంసమాశ్రితాః। శ్రాద్ధాభావేస్వభవనం శాపందత్వావ్రజంతితే॥ అశాకమూలైఃఫలైర్వాపి తథాప్యుదకతర్పణైః॥ పితౄన్తృప్తింప్రకుర్వీత నైవశ్రాద్ధంవిసర్జయేత్॥

తా॥ కన్యాకాలము మొదలుకొని ప్రేతలను పితృదేవతలను యమపురమునుండి భూలోకమునకు పంపును అప్పుడువారు పుత్రాదులిచ్చు పాయసము మొదలగువానిని గోరి సూర్యుడు కన్యారాశియందు ప్రవేశించినది మొదలు వృశ్చికరాశిద్వారమునాశ్రయించి అమావాస్యలోగా శ్రాద్ధము జరుగనిచో శపించి వెళ్లిపోదురు గనుక తనశక్తికొలది మూలములు ఫలములు మొదలగువానిచేనైనను జలతర్పణములచేనైనను వారికి తృప్తిచేయవలెననియున్నది. ఇంతియే కాదు బ్రహ్మమొదలుగ తృణముపర్యంతం భూతములకు దృప్తియగునని చెప్పబడుచున్నది. ఎట్లనిన పిశాచాదిస్వరూపులకు వికిరాన్నముచేతను తృప్తి, వృక్షాదిరూపులకు స్నానవస్త్రోదకాదులచేతను, మరికొందరికి, ఉచ్ఛిష్టపిండాదికముచేతను, పితృలు తృప్తులగుచున్నారు.

ప్రాచీనగ్రంథే॥ శ్లో॥ అగ్నిహోత్రేణ దేవస్థాః స్వర్గస్థా విప్రభోజనే। యమస్థాః పిండదానేన వికిరం నరకం తథా। దక్షిణా మర్త్యలోకేషు అసురా భూరిభోజనాత్॥

తా॥ పితృదేవతలు దేవలోకమునందుండునప్పుడు అగ్నిహోత్రముచేతను అట్లుగాక పితృదేవతలు స్వర్గమందుండునప్పుడు బ్రాహ్మణభోజనము పెట్టుటచేతను పితృలు యమలోకమందుండునప్పుడు పిండప్రదానముచేతను-నరకమందుండునప్పుడు వికిరముచేతను మర్త్యలోకమందు దక్షిణచేతను- రాక్షసజన్మమందు భూరిభోజనము పెట్టుటచేతను పితృదేవతలు సంతోషింపుచున్నారు వారుసంతోషించుటచే కర్తయొక్క వంశము క్రమముగా వృద్ధిబొందును.

శ్లో॥ మృతాహంతు పరిత్యజ్య చండాలః కోటిజన్మసు॥

తా॥ తల్లిదండ్రుల మృతతిథులు పరిత్యజించినవానికి కోటిజన్మములెత్తినప్పటికిని వానికి చండాలత్వముపోనేరదని శాస్త్రములు ఘోషింపుచున్నవి- విష్ణుపురాణమందు పితృకర్మలను చేయుటకు సమ్మతించక దురాత్ముడైయుండెనేని యనేకజన్మంబులయందు మాలవాడై పుట్టునని విష్ణుపురాణము చెప్పుచున్నది.

ఇతి పితృదేవతాతృప్తివిచారస్సమాప్తః.

## పంచగవ్య ప్రాశనము.

పరాశరః॥ శ్లో॥ గోమూత్రం గోమయం క్షీరం దధిసర్పికుశోదకమ్। నిర్దిష్టం పంచగవ్యంతు పవిత్రం పాపశోధనమ్॥ గోమూత్రం కృష్ణవర్ణాయాః శ్వేతాయాశ్చైవ గోమయమ్। పయశ్చ తామ్రవర్ణాయా రక్తాయా గృహ్యతే దధి॥ కపిలాయా ఘృతం గ్రాహ్యం సర్వం కాపిలమేవవా। మూత్రమేకపలం దద్యాదంగుష్ఠార్ధంతు గోమయం॥ క్షీరం సప్తపలం దద్యాద్దధిత్రిపలముచ్యతే। ఘృతమేకపలం దద్యాత్పలమేకంకుశోదకమ్।

వృద్ధపరాశరః॥ శ్లో॥ గోమూత్రంమాషకాన్యష్టౌగోమయస్యతుషోడశ। క్షీరస్యద్వాదశప్రోక్తా దధ్నస్తుదశకీర్తితాః । గోమూత్రవద్ఘృతస్యాష్టౌ తదర్ధంతుకుశోదకమ్॥ ఏతదశక్తబాలాదివిషయంద్రష్టవ్యం। మాషప్రమాణంపూర్వముక్తమ్॥ పంచగవ్యమృచాపూత స్థాపయేద్ద్విజసన్నిధౌ। గోమూత్రంస్థాపయేత్పూర్వే గోమయందక్షిణేన్యసేత్ । క్షీరంతు పశ్చిమేస్థాప్యం దధిచైవోత్తరేణతు॥ ఘృతపాత్రంతథాగ్నేయ్యాం మైశాన్యాంతుకుశోదకమ్। స్థాప్యపశ్చాదేకపాత్రేతన్మంత్రైస్తాన్నియోజయేత్॥

బ్రహ్మకూర్చదహేత్సర్వం ప్రదీప్తాగ్నిరివేంధనమ్ । పవిత్రంత్రిషులోకేషు దేవతాభిరధిష్ఠితమ్॥ ప్రయోగః॥ ఏవం + ర్థం మమసమస్తపాపక్షయార్థం శరీరశుద్ధ్యర్థం పంచగవ్యప్రాశనాఖ్యం కర్మకరిష్యమాణః + పుణ్యాహవాచనంకరిష్యేనమః । ఆదౌగణాధిపతిపూజాం కరిష్యేనమః॥ అథగణాధిపతిపూజాం పుణ్యాహవాచనంచకృత్వా। నారాయణేతిమంత్రేణపంచగవ్యం నిధాయ। గోమూత్రం గోమయంక్షీరం దధిసర్పిఃకుశోదకం। అత్రనారాయణేతి మంత్రేణ షోడశోపచారైరభ్యర్చ్య॥ కూర్చంకృత్వా। ఏకస్మిన్ పాత్రేపంచగవ్యమేళనంకృత్వా॥ అథప్రాశనం కరిష్యామీతిసంకల్ప్య। శ్లో॥ యత్త్వగస్థిగతంపాపం దేహేతిష్ఠతిమామకే। ప్రాశనంపంచగవ్యస్య దహత్వగ్నిరివేంధనమ్॥ ఆచమ్య। సూర్యావలోకనంకుర్యాత్ । తతఃగోదానభూదానాది బ్రాహ్మణేభ్యోదద్యాత్ । పంచగవ్యప్రాశనంవిప్రద్వారాకార్యం। స్వయంతూష్ణీంపిబేత్ । విశేషో హేమాద్రౌద్రష్టవ్యం॥

ఇతిపంచగవ్యప్రాశన విధిస్సమాప్తః.



## ఆశౌచనిర్ణయము.

### రజస్వలాశౌచము వ్రాయుచున్నాను.

1 స్త్రీలకు రజోదర్శనమైన దినము మొదలు ౪ వర్ణములవారికి మూడుదినములు ఆశౌచము, నాలుగవదినమునందు స్నానము జేసి అయిదవదినమున గృహకృత్యములు జేయుటకుపయోగమగును.

రజోదర్శనమైన దినము మొదలు ౧౭ దినములలోగా తిరిగి రజోదర్శనమయ్యేనేని స్నానము, ౧౮ వ దినమునందైతే ౧ దినము, ౧౯ వ దినమునందైతే ౨ దినములు ఆపైన తిరిగి రజోదర్శనమయ్యేనేని 3దినములు.

ద్రావిడాచారమెట్లనిన ఆమదానికి రజోదర్శనమైనదినము మొదలు 3 దినములు ఆశౌచము- రజోదర్శనమయినది మొదలు ౧౨ దినముల లో తిరిగి రజోదర్శనమయ్యేనేని మూత్రమునందువలెనె శౌచమునశుద్ధి యగును ౧౮ దినములవఱకు స్నానము ఆపైని ఆశౌచము 3దినములు.

### జాతాశౌచప్రకరణము.

2 జాతాశౌచము- స్రావము-పాతము- ప్రసూతి అనిమూడుభేదములు స్రావమనగా గర్భధారణమయినది మొదలు ౪ మాసములలోగా గర్భములోనిది చెడి పైకిపోవుగా కారుట.

స్రావము—మృదుస్రావము- కఠినస్రావమునని రెండువిధములు పాతమనగా ౫ వ నెలలోను ఆఱవనెలలోను గర్భములో నిపిండము చెడిపోవుట ౭వ నెలమొదలు ప్రసూతిఅనగా ప్రసవము.

### మృదుస్రావాశౌచము.

తండ్రికి స్నానము జ్ఞాతులకు స్నానమైన నక్కర లేదు. తల్లికి మూడు మాసములలోగా 3 దినములు నాలుగవమాసమున ౪ దినములు.

### కఠినస్రావాశౌచము.

తండ్రికిఆశౌచము 3 దినములు సోదరులకు స్నానము, జ్ఞాతులకు స్నానము.

### పాతాశౌచము.

తండ్రికి ఆశౌచము 3దినములు జ్ఞాతులకు 3దినములు తల్లికి ఐదవ మాసమున ౫ దినములు ఆఱవమాసమున ౬దినములు. ప్రాచీనపద్ధతిలో మృదుస్రావమునకును కఠినస్రావమునకును వివేచనము లేక యే తండ్రికిని జ్ఞాతులకును మూడుదినములుపురుడు చెప్పఁబడినది.

### ప్రసవాశౌచము.

మాతామహుని యింటిలో పిల్లపుట్టినయెడల మాతామహీ మాతామహులకు దినములుపురుడు. తల్లిసోదరుల కొక్క దినము భర్త యింటపిల్లపుట్టినయెడల మాతామహులకు పురుడు లేదు ఒక్క మగపిల్లయైనను ఒక్కమాఱిద్దఱు మగపిల్లలైనను పుట్టినయెడల తల్లికి ౧౦ దినములుపురుడు ఒక్కమాఱుపుట్టిన యిద్దఱనఁగా కవలవారు (సంస్కృ) యమళులు॥.....[పిల్లచచ్చిపోయిపుట్టినను - బొడ్డుకోయబడినతరువాత పదిదినములలోపుల చచ్చిపోయినను తలిదండ్రులకును జ్ఞాతులకును ౧౦ దినములు పురుడుగల్గును, మైల లేదు. బొడ్డుకోయకముందు పిల్లచచ్చిపోయినను తల్లికి ౧౦ దినములు, తండ్రికిని జ్ఞాతులకును మూడుదినములు పురుడు, మైల లేదు. (ఆంధ్రాచారము) బొడ్డుకోయకముందు శిశువు చనిపోయినయెడల తల్లితోపాటు తండ్రిమొదలగుజ్ఞాతులు౧౦దినములు పురుడు పట్టుదురు. సమానోదకులకు స్త్రీపురుషులవఱకు 3 దినములు జ్ఞాతులనగా కూటస్థుడు మొదలు ౭ పురుషులవఱకునుండువారు-సమానోదకులనఁగా ౮వ పురుషుడు మొదలు ౧౪వ పురుషుడు వఱకునుండువారు. ద్రావిడాచారము. కాశ్యపః॥ శ్లో॥ రాత్రింభాగత్రయంకృత్వా ద్వౌభాగౌపూర్వవాసరే। ఉత్తరార్ధంపరదినే మృతౌతుమృతిసూతయోః॥

తా॥ రాత్రియందు సూర్యోదయము, జాతము, మృతము సంభవించినయెడల ఆరాత్రికాలమును 3 భాగములుచేయవలెను. మొదటి రెండు భాగముల కాలము లోపల సూర్యో [illegible]

## మృతాశౌచము.

శి పదిదినములు వెళ్లినపిమ్మట నామకరణము చేయకమునుపు శిశువు మరణించెనేని సపిండులు స్నానముచేతనే శుద్ధులగుదురు. తల్లిదండ్రులకు 3 రాత్రులాశౌచము-కన్యకయైతే ఒక్కదినము. నామకరణమునకు ముందు ఖననమే కాని ఉదకదానాదికము లేదు - నామకరణము చేసిన పిమ్మట సంవత్సరమువఱకు దాహఖననములలో నేదైన చేయవచ్చును.

నామకరణానంతరం దంతోత్పత్తికి ముందు పుత్రమరణము కలిగి తేదహనము చేసి రేని సపిండుల కొకదినమాశౌచము-ఖననపక్షమునందు స్నానముచేతనే పరిశుద్ధి- తల్లిదండ్రులకు దహనఖననముల రెంటియందును మూడుదినములు- కన్యామరణమునందు త్రిపురుష సపిండులకు దహనఖననముల రెంటియందును స్నానముచేతనే శుద్ధికలుగును- తల్లిదండ్రులకు ఒకదినమాశౌచము- దంతోత్పత్త్యనంతరం పుత్రమరణముకలిగెనేని దహనఖననములయందు సపిండులకొకదినమాశౌచము- తలిదండ్రులకు మూడురాత్రులు- కన్యకయైతే త్రిపురుష సపిండులకు స్నానముచేతనేశుద్ధి- తల్లిదండ్రులకుమూడుదినములు. మొదటి సం॥ సంపూర్తియైనవాడగు పుత్రుడు మరణించెనేని పిత్రాదిసపిండులకు మూడుదినములు- దాహము నియతము మూడుసంవత్సరములు వెళ్లినపిమ్మట చూడాకర్మయైనను కాకున్నను ఉపనయనమునకుముందు మరణముకలిగెనేని పిత్రాది సపిండులకు మూడుదినములాశౌచము. దాహము నియతముగ చేయవలయును. ఉదకదానాదికము మంత్రరహితముగ చేయవలెను. చూడాకర్మయైన వానికి మంత్రరహితముగ పిండదానము చేయవలయును.

కన్యకకుమూడుసంవత్సరములైన పిమ్మట వాగ్దానమగుటకుముందు మరణముకలిగెనేని త్రిపురుష సపిండుల కొకదినము. తల్లిదండ్రులకు మూడుదినములు దాహోదకదానాదులు మంత్రరహితముగ చేయవలెను. ...... వాగ్దానానంతరము వివాహమగుటకుముందు కన్యకలు మరణించిరేని భర్తృకుల పితృకులములయందలి సప్తపురుష సపిండుల

కును పిత్రాదులకును ఆరవటకును మూడుదినములు దాహోదకదానాదికములు మంత్రరహితముగ జేయవలయును పిమ్మట పూర్ణాశౌచ మెట్లనిన

ఉపనయనమైనపిమ్మట మరణించినపురుషునకు బ్రాహ్మణులలో పదిదినములాశౌచము క్షత్రియులకును ౧౨ దినములాశౌచము వైశ్యులకును ౧౫ దినములు శూద్రులకుఉపనయనము లేదు। స్త్రీశూద్రయోస్తు వివాహస్యోపనయనస్థానాపన్నత్వేన వివాహోత్తరమేవాశౌచాధికారః॥ స్త్రీశూద్రులకు వివాహము ఉపనయనస్థానమునందు చెప్పబడినది. కనుక వివాహానంతరమే పూర్ణాశౌచము. యీపూర్ణాశౌచము రెండువిధములు శూద్రాణామాసం - సచ్ఛూద్రాణామర్థం. [అనగా శూద్రులకు ౩౦ దినములు- సచ్ఛూద్రులకు ౧౫ దినములు] సోదకులకుమూడుదినములు- గోత్రజులకు స్నానమువలనశుద్ధికలుగును.

పితృగృహమునందు కన్యామృతి.

వివాహానంతరమందు కన్యకపితృగృహమునందు మృతిపొందిన యెడల తల్లిదండ్రులకు సోదరభ్రాతలకును ౩ దినములు పినతండ్రిమొదలగువారికొక్కదినము. అట్లుగాక భర్తృగృహమునందు మరణము సంభవించినప్పటికి తల్లిదండ్రులకు మూడుదినములుఆశౌచముతప్పదు.

మాతాపితృమృతి.

తల్లిదండ్రులయొక్క మరణమునందు వివాహితలగుపుత్రికలకు పదిదినములవఱకును మూడుదినములాశౌచము దశాహానంతరమందు సంవత్సరమువఱకును పక్షిణ్యాశౌచము॥ "అత్రైవ అతిక్రాంతాశౌచం బ్రాహ్మణవచనాద్భవతి నాన్యత్ర" అనగా ఇక్కడనే అతిక్రాంతశౌచము బ్రాహ్మణవచనమువలన కలుగుచున్నది కాని మఱియొకస్థలమునందు లేదని యెఱుగవలయును.

భ్రాతృభగినీలమృతి.

భ్రాతృభగినీలయొక్క పరస్పర గృహములయందు మరణము కలుగుచుండగా పరస్పరమును మూడుదినములు, గృహాంతరమందు మరణము కలుగుచుండగానే పరస్పరమును పక్షిణ్యాశౌచము

## మేనమామ మృతి

మేనమామయొక్క మరణమునందు భగినీపుత్రునకు పక్షిణ్యాశౌచము- ఉపకారియగు మేనమామయొక్క మరణమునందు మూడు దినములాశౌచము.

## మేనమామభార్యామృతి.

మేనమామ భార్యాయొక్క మరణమందు భర్తృభగినీయొక్క పుత్రులకు పక్షిణ్యాశౌచము.

## ఉపనయనమయిన మేనల్లుడిమృతి.

ఉపనయనమయినభాగినేయునియొక్క మరణమందు మేనమామకును. మాతులభగినికిని మూడుదినములు, అనుపనీతుఁడగు మేనమామ మరణమునందు మేనల్లునికి మాతులభగినికిని పక్షిణ్యాశౌచము.

## మాతామహునియొక్క మరణము.

మాతామహుని యొక్క మరణమునందు పుత్రికా పుత్రునకు మూడుదినములాశౌచము.

## అనుపనీతుఁడగు దౌహిత్రుని మరణము.

అనుపనీతుఁడగు దౌహిత్రుని మరణమునందు మాతామహునకును మాతామహికిని పక్షిణ్యాశౌచము ఉపనీతదౌహిత్రమరణమునందు మూఁడుదినములని కొందఱు చెప్పుచున్నారు.

## మాతామహియొక్క మరణము.

మాతామహియొక్క మరణమునందు దౌహిత్రునకు పక్షిణ్యాశౌచము

## భార్యయొక్క తల్లిదండ్రుల మరణము.

భార్యయొక్క తల్లిదండ్రులయొక్క మరణమునందు జామాత సన్నిధియందున్న యెడల మూఁడుదినములు. అసన్నిధియందు పక్షిణ్యాశౌచము. గ్రామాంతరమందైనయెడల యొకరాత్రియాశౌచము.

అల్లుడిమృతి.

అల్లుఁడు మృతుఁడైన అత్తమామలకు స్నానమువలన శుద్ధికలుగును ఒక్కదినమాశౌచమని కొందఱు చెప్పుచున్నారు.

స్యాలకుడి మృతి.

స్యాలకుఁడు మరణమునుబొందెనేని భగినీభర్తకు నొక్కదినము స్యాలకసుత మరణమునందు స్నానమువలన శుద్ధికలుగును.

పితృభగినీల మృతి.

తండ్రితోఁబుట్టువగువాడుది మరణమును పొందినదగుచు నందఱ్భ్రాతృపత్యమునకు పక్షిణీకాలమాశౌచము.

మాతృభగినీలమృతి.

తల్లితోబుట్టువగు వాడుది మరణమునుబొందెనేని ఆమెచెల్లెలి సంతానమునకు పక్షిణీకాలమాశౌచము.

పితృమాతృ బాంధవ్యము.

ఆత్మనఃపితృష్వసృ మాతృష్వసృ మాతులపుత్రాః ఆత్మబాంధవాః । పితుః పితృష్వసృ మాతృష్వసృ మాతులపుత్రాః పితృబాంధవాః। మాతుః మాతృష్వసృ పితృష్వసృ మాతులపుత్రాః మాతృబాంధవాః । ఏతేత్రివిధాబాంధవాః । బంధుత్రయే యేషు మృతేషు పక్షిణీ। పితృష్వస్రాదికన్యానాం మూఢానాం మరణేఏకాహః । దత్తకమృతౌతు పూర్వాపరపిత్రోస్త్రిరాత్రం । సపిండానామేకాహః ।

తా॥ పితృష్వసృమాతృష్వసృమాతులపుత్రులు ఆత్మబంధువులు- తండ్రియొక్క పితృష్వసృమాతృష్వసృమాతులపుత్రులుఃపితృబంధువులుతల్లియొక్క మాతృష్వసృపితృష్వసృమాతులపుత్రులుమాతృబంధువులు యీమూడువిధములగు బంధువులు మరణమునుపొందినప్పుడు పక్షిణ్యాశౌచము పితృష్వస్రాదులయొక్క కన్యకలువివాహామైనపిమ్మటమరణమును బొందిరేని యొకదినమాశౌచము దత్తునిమరణమునందు పూర్వాపరులగు తల్లిదండ్రులకు మూఁడుదినములాశౌచము సపిండులకొక్కదినము.

జనక తల్లిదండ్రుల మరణము.

పూర్వాపరులగు తల్లి దండ్రులయొక్క మరణమునందు దత్తకు

నకు మూఁడు దినములాశౌచము, దత్తకునియొక్క పుత్రపౌత్రాదుల మరణమునందును జననమునందును సపిండులకొకదినము.

దత్తకుడిమృతి.

దత్తతజరిగినతరువాత మరణముపొందెనేని దత్తతవంశమునందు సపిండులకు వారివారివర్ణాచారప్రకారము పూర్ణాశౌచము.

ఆచార్యమరణము,

ఆచార్యమరణమునందు శిష్యునకుమూఁడుదినములు తత్పుత్రపత్నులయొక్క మృతియందొకదినము. ఉపనయనమునుచేసి వేదమునుచెప్పినవాఁడుఆచార్యుడనఁబడును- వేదమునందు కొంతభాగమును చెప్పినవాఁడు ఉపాధ్యాయుడనఁబడును. అట్టియుపాధ్యాయుని మరణమునందు శిష్యునకొకదినమాశౌచము. ఉపనీతుఁడైన శిష్యునియొక్క మరణమునందుగురువునకుమూఁడుదినములాశౌచము, పరులచేతనుపనీతుఁడగు శిష్యునియొక్క మరణమునందొక దినమాశౌచము.ఏకగ్రామవాసులునుఅనూచానశ్రోత్రియులును అయిన సహాధ్యాయులయొక్క మృతియందొకదినము సాంగవేదాభ్యాయి అనూచానుఁడనబడును. వేదమాత్రాధ్యాయి శ్రోత్రియుండనఁబడును. అధ్యయనమనఁగాఅర్థజ్ఞానసహితముగ వేదమునుజదువుటయని గ్రహింపవలయును.

వానప్రస్థులుయతులు మరణమునుపొందిరేని సపిండులకుస్నానము మాత్రము.

అతిక్రాంతాశౌచము,

అతిక్రాంతాశౌచము-జననము అతిక్రాంతమయ్యెనేని అతిక్రాంతాశౌచములేదు తండ్రికిస్నానముమాత్రము మరణాశౌచమునందైతే అనుపనీతమరణాది నిమిత్తకత్రిరాత్రాదులయందును భగినీమాతులాదిమరణనిమిత్తక త్రిరాత్రాదులయందును అతిక్రాంతాశౌచములేదు మఱియేమనిన అతిక్రాంతాశౌచము దశాహాదిమృతాశౌచ విషయమెయని గ్రహింపవలయును,

## దశాహమధ్య.

జననమరణములు పదిదినములలోపలఁదెలిసినేని పుత్రాదులకం దఱకును మిగిలినదినముల చేతనేశుద్ధికలుగును. సంస్కారమునుకూడ మిగిలినదినములచేతనేసమాప్తియగును. అస్థిపర్ణశరసంస్కారమునుకూడ మిగిలిన దినములచేతనే సమాప్తియగును.

## మూడుదినములలోపల.

మొదటిమూడుదినములలోపల సమానోదక మరణము తెలియబడెనేని సమానోదకులకు మిగిలినదినములచేతనే శుద్ధికలుగును. త్రిరాత్రములు అతిక్రమించి పదిదినములలోపల తెలియఁబడినప్పటికిని ఆశౌచములేద నియును. మఱియేమనిన స్నానమాత్రముచేతనే శుద్ధికలుగును ఈనియ మమే సూతులాది త్రిరాత్రులయందుఁగూడ తెలియవలయును.

## మాతాపితృ మరణము.

తల్లిదండ్రులయొక్క మరణము దూరదేశమునందైనప్పటికిని సం వత్సరకాలముకూడఅతిక్రమించినప్పటికినివిన్నది మొదలుపుత్రునకుపది దినములు. ఇది బ్రాహ్మణవిషయము తక్కినవారువారివారివర్ణాచారము ననుసరించి పూర్ణాశౌచముపట్టవలయును స్త్రీపురుషులయొక్కపరస్పర మునందు పరస్పరమును దేశాంతరమందు సంవత్సరాంతమయినను పూ ర్ణముగపదిదినము లాశౌచము—సవతులకు పరస్పర మరణమునం దు పరస్పరమునుదేశకాలములను అపేక్షింపకయే పదిదినములాశౌచ ము పూర్ణముగనుండును. సాపత్న్యమాతృ మరణమునందు సంవత్సరా నంతరమందుఁగూడ దేశాంతరమైనప్పటికిని మూడుదినములు.

## ఔరస పుత్రమరణము.

ఔరసపుత్రుని మరణము సంవత్సరానంతరమందుఁ దెలిసినను తల్లిదండ్రులకు మూడుదినము లాశౌచము.

## పదిదినములు గడచినపిమ్మట.

పదిదినములుగడచినపిమ్మట బనునొకండవదినము మొదలుకొని మూడు

మాసములవఱకును దశరాత్రాశౌచము. కలవారిమరణమునందు మూడు దినములు. ఆఱుమాసములవఱకును పక్షిణ్యాశౌచము. తొమ్మిదిమాసములవఱకును ఒకదినమాశౌచము. అటుపిమ్మట స్నానమాత్రమని వృద్ధవసిష్ఠుఁడు చెప్పె. మూడుపక్షములవఱకును మూడుదినములనియును- ఆఱుమాసములవఱకును పక్షిణియనియును- సంవత్సరమువరకొకదినమనియును అనంతరమందు స్నానమాత్రమనియును పరాశరమాధవీయమను గ్రంథమందు దేవలుఁడు వచించె. ఇక్కడ నిది యాపద్విషయము నుగాఁదలచి వ్యవస్థను దెలిసికొనవలయును.

## జ్ఞాతిమరణము.

పదిదినములు గడచినపిమ్మట దేశాంతరమందలి జ్ఞాతిమరణము తెలియఁబడిన దగుచునుండఁగా మూడుపక్షములవఱకును మూడుదినములు అదిమొదలుకొని యాఱుమాసములవఱకును యొకదినము అదిమొదలుకొని సంవత్సరమువఱకును పగలుమృతవార్తవినఁబడెనేని ఆపగలంతయును ఆరాత్రివినఁబడెనేని రాత్రియంతయును ఆశౌచమనియెఱుగవలయును. సంవత్సరానంతరమందు స్నానమువలన శుద్ధికలుగును. ఈ అతిక్రాంతాశౌచమింతయును సర్వవర్ణసాధారణమని యెఱుగవలయును ఈవిషయములో దేశాంతరమందలి జ్ఞాతిమరణము తెలియఁబడినదగుచునుండగా స్నానమువలననే శుద్ధియనికొందఱు చెప్పుచున్నారు. ఆమాధవోదాహృత విష్ణుస్మృతి తెలియకపోయిన దోషముచేత ఇట్లు చెప్పఁబడెనని యెఱుగవలయును. బ్రాహ్మణునకు దేశాంతరము ౨౦ యోజనముల అంతరముకలదనియును. క్షత్రియునకు ఇరువదినాలుగు యోజనముల అంతరముకలదనియును. వైశ్యశూద్రులకు ముప్పదియోజనములయంతరముకలదనియును సచ్ఛూద్రునికు అరువదియోజనములయంతరము కలదనియును తెలియవలయును. పక్షాంతరములు ఇప్పుడు చెప్పఁబడినపక్షములననుసరించి తెలిసికొనవలయును. ఇక్కడనీవిధముగా నివర్తనను చేసికొనవలయును.—ఎక్కువైన

ఏవచనములు ఏకగోత్రవిషయక జననమరణాఽతిక్రాంతాశౌచ విషయములో వానిని భార్యాభర్తలను నిరువురుచేతను సమానముగా అనుష్ఠింపఁదగినవని యెఱుఁగవలయును- ఏవచనములు భగినీమాతులాదిభిన్నగోత్రాశౌచవిషయములో ఆవచనములయందు భార్యాభర్తల మధ్యయందు ఏసంబంధముకలదో ఆసంబంధముచేతనే అనుష్ఠింపవలసినదనియును. పూర్వసంబంధముచేతను కాదనియును తెలియవలయును.

ఆశౌచసంపాతము.

ఆశౌచసంపాతము కలుగుచునుండగా చేయఁదగిన విషయము తెలుపఁబడుచున్నది- ఎట్లనిన- దశాహాశౌచమధ్యమందు పదిదినములు ఆచరింపఁదగిన యాశౌచముగాని అంతకుతక్కువదినములచేత ఆచరింపఁదగిన యాశౌచముగాని సంప్రాప్తమయ్యెనేని మొదటియాశౌచముచేతనే పరిశుద్ధి, తక్కువయాశౌచముల నవలంబింప నక్కరలేదనియును తెలియవలయును- పదిదినములపురుడు వచ్చియుండఁగా పదిదినముల పురుడుగాని దానికి తక్కువపురుడుగాని వచ్చెనేని మొదటిపురుడుచేతనే శుద్ధియగును- పురుడువచ్చియుండగా పదిదినములకు తక్కువ మృతాశౌచముగాని దశాహమృతాశౌచముగాని వచ్చెనేని మృతాశౌచమునే అవలంబింపవలయును - ఆవిషయములో సూతకమనఁగా పురుడు మిగిలియున్నను మృతాశౌచముచేతనే పరిసమాప్తియగునని యెఱుఁగవలయును. మూడుదినములచేత పరిసమాప్తిఁ పొందఁదగిన మృతాశౌచమైనను జననాశౌచమైనను వచ్చియుండఁగా పదిదినములచేత పరిసమాప్తిని పొందఁదగిన మృతాశౌచమైనను జననాశౌచమైనను సంప్రాప్తమయ్యెనేని పూర్వాశౌచముచేత పరిశుద్ధికానేరదని యెఱుఁగవలయును...... మృతాశౌచమునందు సమన్యూనమగు జననాశౌచము సంప్రాప్తమయ్యెనేని పూర్వాశౌచముచేతనే పరిశుద్ధికలుగునని యెఱుఁగవలయును.

పురుడుఅధికమైనను మృతాశౌచముచేతనే శుద్ధియనిశుద్ధివివేక కారుఁడు చెప్పెనని యెఱుఁగవలయును. పూర్వాశౌచమధ్యమందు పుట్టి నప్పటికి పూర్వాశౌచానంతరమందు తెలియఁబడెనేని యుత్తరకాలపు దానినే యాచరింపవలయును. పదిదినములాచరింపఁదగిన యాశౌచ మును అవలంబించియుండఁగా పదియవ దినముయొక్క రాత్రియందు పదిదినములాచరింపఁదగినయాశౌచము సంప్రాప్తమయ్యెనేని తొలుతటి పదిదినములుగాక రెండు దినములు ఆశౌచమును అవలంబింపవలయును. ఆరాత్రియును పరదినమును అని యెఱుఁగవలయును.

పదియవదినముయొక్క రాత్రియందలి నాల్గవ యామమందు పది దినములుగల యాశౌచము సంప్రాప్తమయ్యెనేని అప్పుడు అది మొదలు కొని మూఁడుదినములు ఆశౌచముగలవాఁడగును. మూఁడుదినములు (అట్లుగాక) ఒకటిరెండు దినములు అవలంబింపఁదగిన యాశౌచము లోకలట్టియాశౌచమే సంప్రాప్తమయినప్పుడు రాత్రిమానము మిగిలి యుండెనేని పూర్వాశౌచముచేతనే పరిశుద్ధియగుననియును. ద్వ్యహా ద్యాశౌచమును అవలంబింప నక్కఱలేదనియును తెలియవలయును. రెండు మూఁడుదినములు అవలంబింపఁదగినయాశౌచమధ్యమందు ఆశౌ చాంతరము తటస్థించెనేని అధికాశౌచమునకు పూర్వాశౌచముచేతశుద్ధి లేదని యెఱుఁగవలయును. సమన్యూనములయందు పూర్వాశౌచముచేత నే శుద్ధియని యెఱుఁగవలయును. సపిండాశౌచముచేత మాతృపితృభ్రా తృలకు ఆశౌచము తొలఁగిపోదని యెఱుఁగవలయును. మాత్రాశౌచ మధ్యమందు పిత్రాశౌచము సంప్రాప్తమయ్యెనేని పూర్వాశౌచము చేతనే శుద్ధియని యెఱుఁగవలయును. తండ్రికి (లేక) తండ్రియొక్క యాశౌచముచేతనే శుద్ధియనికొందఱందురు. వారియొక్క శేషపదము నకు పూర్ణపరత్వము లాక్షణికార్థమని యెఱుఁగవలయును పిత్రా శౌచమధ్యమందు మాతృమరణము సంప్రాప్తమయ్యెనేని పిత్రాశౌచము నసమాప్తిపొందించి పక్షిణీకాలమధికముగనాశౌచము నవలంబింపవల

సినదని యెఱుఁగవలయును. ఇదికదిదినములపిమ్మట నాచరింపఁ దగిన దనియెఱుఁగవలయును. పదియవరాత్రియందలి నాల్గవ యామమునందు మాతృమరణము సంప్రాప్తమయ్యెనేని రెండుదినములయినను మూఁడు దినములయినను ఆశౌచమును అవలంబింప వలయునే కాని పక్షిణీకాలము కాదని యెఱుఁగవలయును. తల్లికి దండ్రికి గూఁడ అన్వారోహణము కలిగి యెడల పక్షిణీకాలముకూడ అధికముగ నాశౌచము లేదనియును పూర్వాశౌచము చేతనే శుద్ధియనియును తెలియవలెను.

## సూతకమునందు.

సూతకమునందు మృతాశౌచము సంప్రాప్తమగుచుండగా పిండదానమునందు ప్రతిబంధము లేదని యెఱుఁగవలయును. మృతాశౌచమునందు పుత్రుడు సంప్రాప్తమయ్యెనేని జాతకర్మాదికమును అప్పుడైనను ఆశౌచాంతమందైనను చేయవలసినదని తెలియవలయును. తల్లికి ఆచరింపఁదగిన యధికాశౌచములోపల తండ్రికి పదునొకండవ దినమునందు చేయవలసిన వృషోత్సర్జనాది శ్రాద్ధమును ఆద్యాదిషోడశ శ్రాద్ధములను చేసి తీరవలెను.

## శవస్పర్శము.

శవస్పర్శముపగలు అయ్యెనేని నక్షత్రదర్శనమైనపిమ్మట శుద్ధియనియును రాత్రియందయ్యెనేని సూర్యదర్శనమైన పిమ్మట శుద్ధియనియును తెలియవలయును ఆశౌచాన్న భక్షణమును ఆశౌచ గృహవాసము నెంతకాలము కలిగియుండునో అంతవఱకును ఆశౌచము కలిగియుండునని తెలియవలయును.

## ధర్మార్థముగ.

ధర్మార్థముగ అనాథసవర్ణశవమును వహించినను అపరక్రియలు చేసినను అగ్నిదానము చేసినను అనంతఫలము కలుగుననియును ప్రాణాయామాగ్నిస్పర్శములచేత శుద్ధికలుగుననియును తెలియవలెను.

ఈవిషయమునందు మూలవచనములు నిర్ణయసింధువుధర్మసింధుమితాక్షరాది నిబంధన గ్రంథముల యందున్నవి. ఆవచనము లన్నియును గ్రంథవిస్తర భయముచే చేర్చనైతిని. సమాప్తము.

## అథశ్రాద్ధకాలేకార్యాకార్యాణి.

### శ్రాద్ధదినేగృహాలంకారనిషేధః

యల్లాజీయే॥ శ్లో॥ గోమయేనోపలేపంచ సర్వేశ్రాద్ధే ప్రకీర్తితమ్। గృహాలంకరణంనాస్తి ఇతిశాతాతపోబ్రవీత్ ॥౧॥

తా॥ సమస్త శ్రాద్ధదినంబులయందును గోమయంచేభూమినలుకవలెను గానిగృహాలంకారము మొదలగునవి పెట్టగూడదని శాతాతపుడు చెప్పెను.

### అథఉష్ణవారినిషేధః

శ్లో॥ మృతేజన్మనిసంక్రాంతౌ శ్రాద్ధేజన్మదినేతథా। అస్పృశ్యస్పర్శనేచైవ నస్నాయాదుష్ణవారిణా। సగోహత్యాకృతంపాపం ప్రాప్నోత్యేవ నసంశయః॥ ॥౨॥

తా॥ మరణాశౌచమునందును, జాతాశౌచమునందును, సంక్రమణదినమందును, శ్రాద్ధదినమందును, జన్మదినమందును, తాకగూడనివస్తువును తాకినప్పుడును, వేడినీళ్లతో స్నానము చేయగూడదు, అట్లుచేసినవాడు గోహత్యచేసినంతపాపమును పొందుచున్నాడు. సందేహములేదు.

### అథదేవతార్చననిషేధః

శ్లో॥ దానాధ్యయనదేవార్చా ఉపహోమవ్రతాదికమ్। నకుర్యాచ్ఛ్రాద్ధదివసే ప్రాగ్విప్రాణాం విసర్జనాత్ ॥౩॥

తా॥ శ్రాద్ధదినమందు భోక్తలుభుజింపక పూర్వము, దానము, అధ్యయనము, దేవతాపూజ ఉపహోమము, వ్రతము, మొదలగునవిచేయగూడదని తా॥

### అథఆచమనకాలాః

శ్లో॥ ఆవాహనేచపాద్యేచ పిష్టేచవిశేషతః। ఉచ్ఛిష్టేపిండదానేచ షట్సుచాచమనంస్మృతమ్॥౪॥

తా॥ ప్రారంభమందును, అంతమందును, పాదప్రక్షాళనమందును, ఆసనమిచ్చినప్పుడును, ఉచ్ఛిష్టాన్న విసర్జనమందును, పిండప్రదానమందును, యీఆరుసమయములందును, ఆచమనము చేయవలయును.

ఆశ్వలాయనానాం గోత్రాద్యుచ్చారణ క్రమః.

శ్లో॥ సపిండీకరణాత్పూర్వ మాశ్వలాయనశాఖినాం । గోత్రం బ్రూయాత్ప్రథమతః పశ్చాన్నామాదికం వదేత్ ॥౫॥

తా॥ ఆశ్వలాయనశాఖవారు సపిండీకరణము చేయకపూర్వము ముందుగా గోత్రమును జెప్పి పిమ్మట పేరు చెప్పవలయును.

అథ విష్ణ్వర్చనవిధిః.

దక్షః॥ శ్లో॥ యత్కించిత్పార్వణం శ్రాద్ధం తత్ర సర్వత్ర చ ద్విజే । పూజయేద్విష్ణుమిత్యేవ మితి ప్రాహ పితామహః ॥ ౬॥

తా॥ పార్వణయుక్తమైన యే శ్రాద్ధము జేసినను బ్రాహ్మణునియందు విష్ణుమూర్తి నావాహనము జేసి పూజింపవలయునని బ్రహ్మ చెప్పెను.

భారతే॥ శ్లో॥ యచ్ఛ్రాద్ధం పార్వణం ప్రోక్తం తచ్ఛ్రాద్ధం వైష్ణవం వినా । కృతం నశ్యతి కౌంతేయ పతితేనేక్షితం యథా ॥ ౭॥

తా॥ ఏశ్రాద్ధము పార్వణసహితముగా నాచరింపబడునో అట్టిశ్రాద్ధము విష్ణుదైవత్యము లేకుండ చేసినయెడల వర్ణభ్రష్టునిచే జూడబడిన శ్రాద్ధమువలెనే చెడిపోవునని భారతమునందు జెప్పబడెను.

శ్లో॥ దర్శే మహాలయే తీర్థే సపిండీకరణే తథా । వ్యర్థం భవతి తచ్ఛ్రాద్ధం వాసుదేవం వినా కృతమ్ ॥ ౮॥

తా॥ దర్శశ్రాద్ధము, మహాలయము, తీర్థశ్రాద్ధము, సపిండీకరణము, ఈశ్రాద్ధములను విష్ణుస్థానము లేకుండా చేసినయెడల ఆశ్రాద్ధములు వ్యర్థమగును.

(పాదప్రక్షాళనే కర్తుః పశ్చిమాభిముఖత్వనియమః)

వ్యాసః॥ శ్లో॥ ప్రాతః కాలే చ మధ్యాహ్నే సాయాహ్నే నిశి సంధ్యయోః । పశ్చిమాభిముఖః శ్రాద్ధే విప్రపాదాభిషేచనమ్ ॥ ౯॥

తా॥ శ్రాద్ధదినమందు ప్రాతఃకాలమునందుగాని మధ్యాహ్నమునందుగాని సాయంకాలమునందుగాని రాత్రియందుగాని సంధ్యాకాలమునందుగాని బ్రాహ్మణులకు పాదప్రక్షాళనము పశ్చిమముఖముగా కూర్చుండి చేయవలయును. అని వ్యాసుడు చెప్పెను.

(పాదప్రక్షాళనే కర్తృభోక్త్రోరుపవేశనవిధిః)

యల్లాజీయే॥ శ్లో॥ విప్రక్షాళనకాలే తు దాతా భోక్తా ద్విజోత్తమః । సుఖాసీనోథ వే శ్రాద్ధే త్వన్యథా నరకం వ్రజేత్ ॥౧౦॥

తా॥ శ్రాద్ధంబునందు పాదప్రక్షాళనము చేయునప్పుడు కర్తయును భోక్తయును మౌనముండవలయును. లేనియెడల నరకమునొందుదురు.

(భోక్తురాశౌచమ్)

వా॥ భోక్తుస్తృతీయనిమంత్రణ ప్రభృత్యాశౌచాభావః। తత్పూర్వమాగతంచేత్ అశౌచమస్త్యేవ॥౧౧॥

తా॥ భోక్తకు మూడవపర్యాయము నిమంత్రణమైనది మొదలు ఆశౌచము లేదు అంతకుపూర్వము వచ్చినయెడల ఆశౌచముండును,

(కర్తురాశౌచం)

వా॥ కర్తుస్తు ప్రారంభానంతర మాశౌచాభావః। తత్పూర్వంచేదాశౌచమస్త్యేవ॥౧౨॥

తా॥ కర్తకు ప్రారంభము మొదలు ఆశౌచము లేదు ప్రారంభించకపూర్వము వచ్చినయెడల ఆశౌచము కలదు.

ప్రారంభవివరణమ్.

వా॥ పాకసమాప్తిః ప్రారంభ ఇత్యేకః పక్షః। సంకల్పః ప్రారంభ ఇత్యేకః పక్షః। పాకాదిప్రోక్షణమారంభ ఇత్యేకః పక్షః। తృతీయనిమంత్రణ ఇత్యేకః పక్షః। ఏతేషు పాకపరిసమాప్తిపక్షః ఆపద్విషయః। అశక్తవిషయశ్చ। ఇతరేషు పక్షేషు తత్తద్దేశశిష్టాచారేణ వర్తనీయః॥ ఏతేషు చతుర్షు పక్షేషు ఆశౌచసంప్రాప్తికాలే సద్యస్స్నాత్వా స్వయమేవ శ్రాద్ధం కుర్యాత్॥ పక్వాన్నమన్యేన ఆశౌచరహితేన పరివేషయేత్। భోజనపాత్రస్థమన్నం భోక్తా ప్రోక్షేత్। కర్తా తద్భోజనపాత్రమస్పృశన్నేవ అన్నత్యాగం కుర్యాత్॥౧౩॥

తా॥ వంటచేయుట పూర్తియగుట ప్రారంభమని యొకపక్షము, సంకల్పముచేయుట ప్రారంభమని యొకపక్షము, వంటపదార్థముమీద ప్రోక్షించుట ఆరంభమని యొకపక్షము, మూడవపర్యాయము నిమంత్రణముచేయుట ప్రారంభమని యొకపక్షము, ఈ నాలుగువిధములలో వంటచేయుట పూర్తియగుటయే ప్రారంభమనునది యాపత్తుసంభవించినప్పుడును శక్తిలేనప్పుడు చెప్పతగినది. మిగిలినవిధములలో ఆయాదేశములయొక్క శిష్టుల యాచారప్రకారముగా నాచరింపవలయును ఈ నాలుగు పక్షములయందును ఆశౌచము రాగా కర్త తత్కాలమందే స్నానముచేసి తానే శ్రాద్ధము పెట్టవలయును అప్పుడు ఆశౌచములేని మరియొకనిచే పదార్థములను వడ్డించునట్లుచేయవలయును, పిమ్మట భోక్తయే పదార్థ

మును ప్రోక్షించవలయును కర్తభోక్తయొక్క భోజనపాత్రమును స్పృశింపకుండా శ్రాద్ధమునంతయు చేయవలయును.

జానునిక్షేపవిధిః.

యల్లాజీయే॥ శ్లో॥ నిక్షిప్యదక్షిణంజాను దేవాన్ పరిచరేద్బుధః । భూమౌతథావరంజాను పిత్రాన్ పరిచరేత్సదా॥ ౧౮॥

తా॥ తెలిసినట్టు వాడు దేవతాపూజచేయునప్పుడు కుడిమోకాలును పితృపూజ చేయునప్పుడు యెడమమోకాలును భూమియందుఆనించవలయును.

ఘృతపాత్రనిధానమ్.

శ్లో॥ నూపేవా పరమాన్నే వాఘృతపాత్రంనసిక్షిపేత్ । తద్భోజ్య మాసురంప్రాహు ర్నదాతుఃపారలౌకికమ్ ॥

తా॥ నేతిదొన్నె నుపప్పునందును పరమాన్నమునందునుంచకూడదు. అట్లుచేసిన యెడల అభోజనము రాక్షసభోజనమనియు శ్రాద్ధకర్తకు సుకృతములేదనియు చెప్పిరి.

(చిత్రగుప్తబలినిషేధః)

శ్లో॥ దత్తేవాక్యథవాదత్తే భూమౌయోనిక్షిపేద్బలిమ్। తదన్నం విఫలంయాంతినిరాశాఃపితరోగతాః ॥

తా॥ త్యాగము చెప్పకపూర్వమునందుగాని చెప్పినపిమ్మటగాని భూమియందుచిత్రగుప్తునిబలినుంచిన యెడల అయన్నము వ్యర్థముగుచున్నది పితృదేవతలు ఆశను వదలుకొని తిరిగిపోవుచున్నారు, అనగా శ్రాద్ధమునందు చిత్రగుప్తబలిని విడువవలయును.

సువాసినీభోజనవిధిః.

యల్లాజీయే॥ శ్లో॥ సువాసిన్యాంమృతాయాంతు బ్రాహ్మణైస్సహ భోజనే । సువాసినీంతతఃపశ్చా దపంక్తికమథాచరేత్ ॥

తా॥ ముత్తైదువస్మృతినొందినయెడల బ్రాహ్మణులతోకూడ ముత్తైదువకుభోజనము పెట్టవలయును మంత్రయుక్తముగా ముత్తైదువను పూజించనక్కరలేదు.

అధిశ్రవణవిధిః.

శ్లో॥ అధిశ్రవణహీనంతు శ్రాద్ధంకుర్వీతమూఢధీః । తదన్నం మాంసతుల్యంచ తద్ఘృతంసురయాసమమ్ ॥

తా॥ ఏమూఢుడైనను అధిశ్రవణములేకుండా శ్రాద్ధమునాచరించినయెడల అయన్నము మాంసముతో సమానమనియు నెయ్యికల్లుతోసమానమనియు చెప్పబడెను.

(పితృసూక్తనిషేధః)

శ్లో॥ షోడశే మాసికే చైవ తీర్థే చైవ సపిండనే। నిత్యశ్రాద్ధోదకుంభే చ పితృసూక్తాని వర్జయేత్ ॥

తా॥ షోడశమునందును, మాసికమునందును, తీర్థశ్రాద్ధమునందును, సపిండీకరణమునందును నిత్యశ్రాద్ధములందును, ఉదకుంభ శ్రాద్ధమునందును, పితృసూక్తములను విడువవలయును,

(పిండదూషణె.)

యల్లాజీయె॥ శ్లో॥ మార్జాలమూషికస్పర్శే పిండే చ ద్విదళీకృతే పునః శ్రాద్ధం విధాతవ్యం తేన పాకేన తత్క్షణాత్ (వాక్యం) పునఃశ్రాద్ధం నామ పునః పిండదానమిత్యర్థః॥

తా॥ పిండములను పిల్లి యెలుక మొదలగునవి ముట్టుకొన్నను పిండము విడిపోయినను తిరిగి శ్రాద్ధము జేయవలయును. అనఁగా తిరిగి పిండములను జేయవలయును.

(కర్తృశ్రాద్ధశేషాన్న భోజనవిధిః.)

శ్లో॥ ప్రదక్షిణమనువ్రజ్య భుంజీత పితృసేవితం॥ మాధవీయే॥ శ్రాద్ధం కృత్వాతు యో విప్రో నభుంక్తే తు కదాచన। దేవా హవ్యం న గృహ్ణంతి కవ్యం తు పితరస్తథా॥

తా॥ బ్రాహ్మణులకు ప్రదక్షిణము జేసి వారిని పంపించి శ్రాద్ధశేషాన్నమును కర్త భుజింపవలయును. ఏ బ్రాహ్మణుఁడైనను శ్రాద్ధము నాచరించి పితృశేషమును భుజింపకుండా విడిచేసేని దేవతలు హవ్యమును గ్రహింపరు, పితృదేవతలు కవ్యమును గ్రహింపరు అని మాధవీయమునందు జెప్పఁబడెను.

ఉపవాసి శ్రాద్ధశేషాన్నభోజననిషేధః.

నిర్ణయసింధౌ॥ శ్లో॥ ఉపవాసో యదా నిత్యే శ్రాద్ధం నైమిత్తికం భవేత్। ఉపవాసం తదా కుర్యాదాఘ్రాయ పితృసేవితమ్॥

తా॥ నియతముగా తానుపవాసముచేయుదినమందు శ్రాద్ధము సంభవించినయెడల శ్రాద్ధమాచరించి శేషము నాఘ్రాణించి పిమ్మట నుపవాసముచేయవలయును అని నిర్ణయసింధువునందు జెప్పఁబడెను.

(భిన్నగోత్రాణాంపితృశేషాన్నభోజననిషేధః)

శ్లో॥ పిత్రాదీనాం తథాన్యేషాం శ్రాద్ధశేషాన్నభోజనం। వ్రతినాంవి

ధవానాంచయతీనాంచనిగర్హితమ్॥ అన్యైర్భిన్నగోత్రాః ప్రతినో బ్రహ్మచారిణః॥ సగోత్రాణాం పితృశేషభోజనానుమతిః॥

తా॥ ఇతరగోత్రీకులశ్రాద్ధశేషాన్నమును భుజించుట బ్రహ్మచారులకు విధవలకు యతీశ్వరులకునింద్యితమైనది.

శ్లో॥ శ్రాద్ధావశిష్టభోక్తార స్తే సైనిరయగామినః। సగోత్రాణాంసకుల్యానాం జ్ఞాతీనాంచనదోషకృత్॥ అన్యగోత్రాణాం క్వచిత్పితృశేషభోజనానుమతిః॥

తా॥ శ్రాద్ధశేషాన్నమును భుజించినవారు నరకమునుబొందుదురు. సగోత్రులకు సకుల్యులకు జ్ఞాతులకుమాత్రము నిషేధములేదు.

శ్లో॥ శ్వశురస్యగురోర్వాపి మాతులస్యమహాత్మనః। జ్యేష్ఠభ్రాతుశ్చ పుత్రస్యబ్రహ్మనిష్ఠస్యయోగినః। ఏతేషాంశ్రాద్ధశేషాన్నం భుక్త్వా దోషోనవిద్యతే॥

తా॥ మామ, గురువు, మేనమామ, జ్యేష్ఠుడు, అన్న, కుమారుడు, బ్రహ్మజ్ఞాని యోగీశ్వరుడు, యీ మొదలగువారియొక్క పితృశేషమును భుజించినను దోషములేదు.

(శూద్రస్యపితృశేషాన్నదాననిషేధః)

యల్లాజీయె। శ్లో॥ నశూద్రంభోజయేత్తస్మిన్ గృహేతుత్వేనతద్దినే। శ్రాద్ధశేషంనశూద్రాయదదాతిచబలేష్వపి। శూద్రంతుభోజయేత్స్వ కేమాదగ్యా చాశ్రాద్ధేషుమానవః। శ్రాద్ధనిష్పీడితాయాంతి శ్రాద్ధందేవాచతత్క్షణాత్।

తా॥ శ్రాద్ధదినమందు శ్రాద్ధమాచరింపబోవు గృహమునందు శూద్రునకు భోజనము పెట్టగూడదు పితృశేషమును శూద్రునకు పెట్టగూడదు, మతియెచ్చోటనైనను తానుండుగా శూద్రునకు భోజనముపెట్టగూడదు ఇందుకుభిన్నముగా నాచరించినయెడల శ్రాద్ధము భంగమైనదానిగాయెంచి శ్రాద్ధదేవతలుతత్క్షణమునందే వెళ్లిపోవుదురు.*

(ఆశౌచమధ్యేప్రాప్తప్రత్యాబ్దికస్యతదనంతరంశూన్యతిథావిషేధః)

వసిష్ఠః॥ శ్లో॥ ఆశౌచమధ్యేపిత్రోశ్చ భవేన్మృతతిథిస్తదా। అతీతింవర్జయిత్వాంతే ప్రత్యబ్దంకారయేత్సుతః॥

తా॥ తల్లిదండ్రుల మృతదినములు ఆశౌచాక్రాంతములైనప్పుడు శూన్యతిథియందు కుర్తిని చేసి యాదినమువిడిచి మరునాడు పెట్టవలయునుఅని వసిష్ఠుడుచెప్పెను.

దక్షః॥ శ్లో॥ ఆశౌచమధ్యే పిత్రోశ్చ యదా మృతతిథిర్భవేత్। ఆశౌచాంతే శూన్యతిథౌ న కుర్వీత తిథిం బుధాః॥

తా॥ ఆశౌచమందు తల్లిదండ్రుల మృతదినంబులు సంభవించినయెడల శుద్ధిదినము శూన్యతిథియగునేని యాదినంబున శ్రాద్ధము తెలిసినవారు విసర్జింతురని దక్షుఁడు చెప్పెను.

శూన్యతిథ్యనంతరదినే కర్తవ్యత్వవిధిః.

శ్లో॥ శూన్యతిథ్యాముపోష్యైవ శ్రాద్ధం కుర్యాత్పరేఽహని। కృత్వా సమ్యగ్విధానేన బంధుభిస్సహ భోజయేత్॥

తా॥ ఆశౌచశుద్ధిదినము శూన్యతిథియగునేని యాదినంబున నుపవాసముండి మరునాటిదినంబున యథావిధిగా శ్రాద్ధము నాచరించి బంధువులతోఁ గూడ భుజింపఁదగును.

సూతకాంతరిత శ్రాద్ధనిర్ణయః.

శ్లో॥ శుచిభూతేన దాతవ్యా యా తిథిః ప్రతిపద్యతే। సా తిథిస్తస్య కర్తవ్యా న చాన్యా వై కదాచన॥ ఇతి ఋశ్యశృంగః॥

తా॥ జాతాశౌచమృతాశౌచదినములలో నాబ్దికము సంభవించినయెడల శుద్ధిదినమునందు ఆబ్దికము పెట్టవలయునుగాని మఱియొక దినమునందు పెట్టకూడదు అని ఋష్యశృంగుఁడు చెప్పెను.

(సంవత్సరవిమోక శ్రాద్ధవిధిః)

శ్లో॥ వత్సరాంతే విమోకాఖ్యం శ్రాద్ధం పార్వణవద్భవేత్। మృతస్య తృప్తయే కార్యం యద్వాఽశౌచదినేఽపి వా॥ ఆశౌచదినం నామ శూన్యతిథిః.

తా॥ మృతినొందినవాని తృప్తినిమిత్తమై సంవత్సరాంతమునందు శూన్యతిథియైనప్పటికిని సంవత్సరవిమోకమును పార్వణసహితముగా యథావిధిగా నాచరింపవలయును.

శ్లో॥ అబ్దస్యాంతే విమోకాఖ్యం శ్రాద్ధం ప్రథమవత్సరే। కుర్యాత్పార్వణవచ్చైవ శ్రాద్ధహీనతిథౌ యది॥ శ్రాద్ధహీనతిథిశ్శూన్యతిథిః॥

తా॥ సంవత్సరాంతమునందు సంవత్సరవిమోకమను శ్రాద్ధమును మొదటివత్సరాంతమునందు ప్రథమాబ్దికమును శూన్యతిథి సంభవించినప్పటికిని పార్వణసహితముగా శ్రాద్ధమును యథావిధిగా నాచరింపవలయును.

శ్లో॥ మృతస్య వత్సరాంతే తు యది శూన్యతిథిర్భవేత్। తస్మిన్దినే విమోకాఖ్యం కర్తవ్యమవిచారతః॥ సంవత్సరవిమోకాఖ్యమకృత్వా ప్రథమాబ్దికం। యశ్శ్రాద్ధం కురుతే మోహాత్ తత్కృతం కర్మ వినిష్ఫలం॥

తా॥ సంవత్సరాంతమందు శూన్యతిథి సంభవించినప్పటికిని యాదినమునందు మృతి బొందినవానియొక్క తృప్తికొఱకు సంవత్సరవిమోకమును శ్రాద్ధమును జేయవలయును ఏమియు నాలోచింపనక్కఱలేదు.

స్మృతిదీపికాయాం॥ శ్లో॥ ఆశౌచాదినిమిత్తైశ్చ విమోకాఖ్యమతిక్రమేత్। తదాయది విమోకాఖ్యం నకర్తవ్యమితీరితం॥

తా॥ సంవత్సరవిమోకమను శ్రాద్ధము నాచరింపక అజ్ఞానముచే ప్రథమాబ్దికమును బెట్టినయెడల ఆచేసినకర్మమంతయు నిష్ఫలమగును.

దేశాంతరగతభ్రాతౄణాం ప్రత్యాబ్దికాను మాసికామావాస్యాది విధిః॥

శ్లో॥ విభక్తోవావిభక్తోవా దేశాంతరగతస్సుతః। పృథక్ఛ్రాద్ధం ప్రకుర్వీత మాతాపిత్రోర్మృతేహని। అవిభక్తావిభక్తావా దేశాంతరగతాయది। కర్తవ్యం తైరమావాస్యా ప్రత్యబ్దమనుమాసికం॥ గ్రంథాంతరే॥ అవిభక్తస్సుతాఃకుర్యాదేకః పిత్రోర్మృతాహికం। స్థానాంతరే పృథక్కుర్యాద్దర్శశ్రాద్ధానుమాసికే॥

తా॥ కుమారుడు విభక్తుడైనను విభక్తుడుకాకున్నను దేశాంతరము వెళ్లినప్పుడు తల్లిదండ్రుల శ్రాద్ధదినంబులు సంభవించెనేని యాదినంబున తాను శ్రాద్ధము తప్పక నాచరింపవలయును. తనయులు విభజించుకొన్నను విభజించుకొనకపోయినను దేశాంతరము వెళ్లినప్పుడు ప్రత్యాబ్దికము దర్శశ్రాద్ధము అను మాసికము వేరుగా నచ్చట నాచరింపవలయును, అన్నదమ్ములు వేరుపడకపోయినను వారిలో నొకడు దేశాంతరము వెళ్లినప్పుడు తల్లిదండ్రుల శ్రాద్ధములను అనుమాసికమును దర్శశ్రాద్ధమును తాను ప్రత్యేకముగానైనను జేయవలయునని మఱియొక గ్రంథమునందుఁగూడ చెప్పఁబడెను.

శ్రాద్ధసమంత్రితస్య గాయత్రీజపసంఖ్యా॥

శ్లో॥ ప్రత్యబ్దే త్రిశతంచైవ మాసికే శతపంచకం। ద్విసహస్రం సపిండేచ అయుతం ప్రేతభోజనే॥

తా॥ ప్రత్యాబ్దికమునందు మూడువందలును మాసికమునందు అయిదువందలును సపిండీకరణమునందు రెండువేలును ప్రేతభోజనకాలమునందు పదివేలును గాయత్రీమంత్రజపమును జేయవలయును.

ఉపనయనవివాహానంతరం షణ్మాసపర్యంతం శ్రాద్ధకర్తవ్యత్వవిధిః.

శ్లో॥ మౌంజీబధ్వా వివాహాచ్చ షణ్మాసం వత్సరమేవ వా। నకుర్యాత్పిండనిర్వాపం నదద్యాత్తు తిలోదకం॥ పుత్రీపుత్రవివాహయోశ్చ పరత ష

ణ్మాసాభ్యంతరే, పిత్రోరాబ్దికపైతృకేషు విధివత్ దూర్వాస్తు తైరర్చయేత్। దధ్యన్నంబదరీఫలైశ్చసహితం పిండాన్ వికీర్యాదికమపసవ్యంతిల తర్పణం చహి గాథాదర్భాన్ సిలాన్ వర్జయేత్॥

తా॥ ఉపనయనమైనపిమ్మటను వివాహమైనపిమ్మటను ఆఱుమాసములకఱకుగాని సంవత్సరముదనుకగాని పిండప్రదానము తిలతర్పణముచేయఁగూడదు. కుమార్తెకు కుమారుల వివాహములు జరిగినపిమ్మట ఆఱుమాసములలోపల తల్లిదండ్రుల ఆబ్దికములు సంభవించినయెడల గరికెలు అక్షతులతో శ్రాద్ధమునందు అర్చనచేయవలయును పిండములను పెరుగు రేగుపండ్లు మొదలగువానితో మిశ్రితముచేయవలయును వికిరాన్నము, అపసవ్యము, తిలతర్పణము, తిలలు, దర్భలు, మొదలగునవివిడువవలెను

## అనేకశ్రాద్ధసన్నిపాతే.

శ్లో॥ మాతాపిత్రోస్తుయుగ్మేప్రాప్తే యదిదర్శసమాగతే। పితృశ్రాద్ధంతుపూర్వంస్యాన్మాతృశ్రాద్ధమతఃపరం॥ దర్శశ్రాద్ధంతతఃపశ్చాత్పార్వణస్తుమహాలయే। దర్శసంక్రమణేప్రాప్తే తచ్ఛ్రాద్ధంతుకథంభవేత్॥ అమాశ్రాద్ధంపరిత్యన్య కర్తవ్యంసంక్రమోదితః। సంక్రమేగ్రహణేదర్శే తచ్ఛ్రాద్ధంతుకథంభవేత్। ఉపరాగాశ్రయయుక్తంతుసమకాలేసమాచరేత్। దర్శేతుమాసికేప్రాప్తేమాసికంపూర్వమాచరేత్। దర్శేప్రత్యాబ్దికేప్రాప్తే ఆబ్దికంపూర్వమాచరేత్। నిత్యనైమిత్తికేప్రాప్తే నిత్యంనపరిలంఘయేత్। నైమిత్తికం పురాకుర్యాత్తతోనిత్యంసమాచరేత్।

తా॥ ఒక్కదినంబున తల్లిదండ్రుల శ్రాద్ధంబులు దర్శశ్రాద్ధము మొదలగునవి శ్రాద్ధములుసంభవించినప్పుడు ముందుగ తండ్రితిథియు పిమ్మట మాతృశ్రాద్ధమును అనంతరము దర్శశ్రాద్ధమును పిమ్మట మహాలయశ్రాద్ధము నాచరింపవలయును ఒక్కదినంబున దర్శసంక్రమణ శ్రాద్ధంబులు సంభవించినయెడల సంక్రమణశ్రాద్ధము నాచరింపవలయును దర్శశ్రాద్ధము చేయనక్కరలేదు సంక్రమణగ్రహణ దర్శశ్రాద్ధంబులొక్కదినంబునసంభవించినయెడలగ్రహణసంక్రమణశ్రాద్ధంబులొక్కపర్యాయమునాచరింపవలయును దర్శశ్రాద్ధము మాసికము ఒక్కదినంబున సంభవించినయెడల ముందు మాసికముపెట్టి పిమ్మట దర్శశ్రాద్ధమునాచరింపవలయును దర్శశ్రాద్ధముఆబ్దికముఒక్కదినంబున సంభవించినయెడల ముందుగా నాబ్దికము పెట్టవలయును నిత్యనైమిత్తికములు సంభవించినప్పుడు, నిత్యకర్మను ఎప్పుడును విడువఁగూడదు ముందుగా నైమిత్తికకర్మను జేసిపిమ్మట నిత్యకర్మను జేయవలయును

—గ్రహణేఆశౌచస్నానతాభావః—

శ్లో॥ చంద్రసూర్యగ్రహేస్నాయా త్సూతకేమృతకేతథా। అస్నాయీమృత్యుమాప్నోతిస్నాయీమృత్యుంనవిందతి॥ సూతకేమృతకేచైవ నదోషోరాహుదర్శనే। తావదేవభవేచ్ఛుద్ధిర్యావన్ముక్తిర్నదృశ్యతే॥

తా॥ సూర్యచంద్రగ్రహణములయందును జాతాశౌచ మృతాశౌచములయందును స్నానముచేయవలయును, అట్లుస్నానముచేయనియెడల మృత్యువునుబొందును, స్నానముచేసినయెడల మృత్యుభయముకలుగదు జాతాశౌచమృతాశౌచదినములలో గ్రహణము సంభవించినయెడల గ్రహణవిముక్తిపర్యంతమాశౌచములేదుశుద్ధిగలవానిగానెరుంగవలెను

జీవత్పితృకస్య తర్పణనిషేధః

శ్లో॥ జీవమానఃపితాయస్య మాతాయదివిపద్యతే। మాతృశ్రాద్ధం సుతఃకుర్యాన్నకుర్యాత్తిలతర్పణం॥

తా॥ తండ్రిజీవించియుండగతల్లిమృతినొందినయెడల తల్లికిశ్రాద్ధకృత్యమునంతయు చేయవలయును తిలతర్పణముమాత్రము చేయనక్కరలేదు

బోధాయనామావాస్యానిర్ణయః

భూతేహ్న్యమాయుతేయుగ్మా వతూదేన్వాయుమొతిచేత్। బోధాయనానాంభూతేమా శ్రాద్ధంకుహ్వామితోన్యథా॥

సౌరమాసతిథినిర్ణయః.

శ్లో॥ జన్మర్క్షతిథ్యర్క్షమృతాన్యహాని ఇత్యేకమాసేచపునర్భవాని। పునర్భవేష్వేవహికర్మకుర్యాత్తేష్వేవసంక్రాంతియుతేషునైవ॥ మాస్యేకస్మిన్ద్వితిథేచేత్పరాహ్యాత్పూర్వస్తస్మిన్తూర్యసంక్రాంతియుక్తే॥ ద్వావప్యేతౌసంక్రమెచెత్పరస్యాత్పర్వం చైవంచంద్రసూర్యోపరాగే॥ వృశ్చికాదిత్రిమాసేషుమృతాహోనభవేద్యది। పూర్వమాసేతు కర్తవ్యమితిశాతాతపోబ్రవీత్। ఊర్ధ్వంముహూర్తంకుతపాత్సంక్రాంతిర్యదిదృశ్యతే॥ పూర్వమాసేనకర్తవ్యం కుర్యాత్ప్రాక్కుతపాదపి॥

శ్రాద్ధవిఘ్నేఆమశ్రాద్ధవిధిః.

శ్లో॥ శ్రాద్ధవిఘ్నేద్విజాతీనా మామశ్రాద్ధంప్రకీర్తితం। అమావాస్యాదినియతం మాససాంవత్సరాదృతే॥ ఇతిహారీతః॥

తా॥ శ్రాద్ధమునకు విఘ్నము సంభవించినప్పుడు దర్శశ్రాద్ధము మాసికము ఆబ్దికము మొదలగునవి ఆమద్రవ్యముల చేతనే బ్రాహ్మణులు చేయఁదగినవని హారీతుఁడు చెప్పెను. ఆమద్రవ్యమనగా భోజనసామాగ్రి

మరీచిః॥ శ్లో॥ అనగ్నికః ప్రవాసీ చ యస్య భార్యా రజస్వలా। ఆమశ్రాద్ధం
ద్విజః కుర్యాన్న తు కుర్యాన్మృతేఽహని॥

తా॥ ఆహితాగ్ని కానివాడును ప్రవాసమైనవాఁడును బహిష్ఠైనదాని పెనిమిటియు మృతదినమునందు ఆమశ్రాద్ధము నే చేయవలయును.

లోగాక్షిరపి॥ శ్లో॥ పుత్రవత్స్వపి దారేషు విదేశస్థోప్యనగ్నికః। అన్నేనైవా
బ్దికం కుర్యాద్ధేమ్నా వా మేన వా క్వచిత్॥

తా॥ భార్య బహిష్ఠ గాలైనను పరదేశము నందుండినను భార్యాగ్ని కానివాడైనను అన్నశ్రాద్ధమునే చేయఁగలయును అదిసంభవము కానిపక్షమునందు హిరణ్యశ్రాద్ధమును చేయవలయును అదిసంభవము కానిపక్షమున ఆమశ్రాద్ధమైనను చేయవలయును అని లోగాక్షిమతము.

అపుత్రాయాః రజస్వలాయాః భర్తృశ్రాద్ధవిధిః.

శ్లో॥ అపుత్రా తు యదా భార్యా సంప్రాప్తే భర్తురాబ్దికే। రజస్వలా భవేత్సా తు కుర్యాత్తత్పంచమేఽహని॥

తా॥ సంతానము లేనట్టి స్త్రీ బహిష్ఠై యుండగా అట్టిసమయమున పెనిమిటియాబ్దికము సంభవించినయెడల అయిదవస్నానదినంబున ఆబ్దికము పెట్టఁగలయును.

ప్రభాసఖండే॥ శ్లో॥ విశుద్ధా స్యాచ్చతుర్థేఽహ్ని స్నానాన్నారీ రజస్వలా।
దైవే కర్మణి పిత్ర్యే చ పంచమేఽహని శుద్ధ్యతి॥

తా॥ బహిష్ఠైనస్త్రీ నాలవదినమున స్నానము చేసిన శుద్ధి యగును గాని దేవపితృకార్యము విషయమైయైన అయిదవదినమందు శుద్ధి గలదియగునని ప్రభాసఖండమునందు చెప్పఁబడెను.

పాదప్రక్షాళన విధిః.

శ్లో॥ మండలాత్పశ్చిమే భాగే బహిరేవ స్థితో ద్విజః। తత్రైవ నిర్ణిజేత్పాద్యం క్షాళనం మండలోపరి। ఉదఙ్ముఖోపవిష్టానాం పాదానాం క్షాళనం చరేత్। అన్యథా క్షాళనే శ్రాద్ధే నిరాశాః పితరో గతాః॥

తా॥ మండలమునకు పడమటిభాగమున పాదములనుంచి పాద్యమును విడవవలయును. పాదప్రక్షాళనము పాదములను మండలముమీదనుంచిన పిమ్మట చేయవలయును బ్రాహ్మణులను ఉత్తరముఖముగ గూర్చుండబెట్టి పాదప్రక్షాళనము చేయవలయును లేనియెడల పితృదేవతలు ఆశారహితులై వెళ్లుదురు.

శ్లో॥ పాదమూలేపిత్రుస్థానం పాదమధ్యేపితామహాః। ప్రపితామహాస్తుపాదాగ్రే పాదప్రక్షాళయేత్క్రమాత్ ॥

తా॥ పాదముల మొదట పితృలును పాదములమధ్యమున పితామహులును పాదముల చివరను ప్రపితామహులునుందురు కాఁబట్టి క్రమముగా పాదములను ప్రక్షాళనచేయవలయును.

## పాదప్రక్షాళనోదకమార్జనవిధిః.

శ్లో॥ దేవపాదోదకంస్నానంస్పర్శనంపిత్రుమండలే।ఉభయోస్స్నానమాప్నోతి పునఃకర్తాపిధీయతే। పిత్రుబ్రాహ్మణపాదాంబు నధారంశిరసిక్వచిత్ ॥

తా॥ విశ్వేదేవులయొక్క పాదోదకమును పైనమార్జనముచేసికొనుటయు పితృస్థానముయొక్క మండలమును స్పృశించుటయును కర్తకుస్నానముతో సమానమైనవి. కాఁబట్టి పితృస్థానమందు నిమంత్రితుఁడైనబ్రాహ్మణుని పాదోదకమును శిరస్సునధరింపఁగూడదు మండలమునుమాత్రము స్పృశింపవలయును.

## ఆచమనప్రకారః.

శ్లో॥ మండలాత్పూర్వతో దేవాఃపిత్రువిప్రాస్తథోత్తరే।కర్తాచైవతదీశాన్యే అన్యత్రరుధిరోపమం ॥

తా॥ మండలమునకు తూర్పుగా విశ్వేదేవుఁడును ఉత్తరమున పితృబ్రాహ్మణుఁడును కర్తయీశాన్యభాగమందును గూర్చుండి యాచమనముచేయవలయును. దీనికి వ్యతిరేకస్థలముల యందుండి యాచమనము చేసినయెడల రక్తపానముతో సమానమగును.

శ్లో॥ కర్తురాచమనాత్పూర్వం భోక్తురాచమనంయది। శునోమూత్రసమంతోయ మిత్యేవంమనురబ్రవీత్ ॥

తా॥ కర్తయాచమనముచేయుటకంటే భోక్తయాచమనముచేసినయెడల శునకమూత్రపానముతో సమానమని మనువుచెప్పెను.

## గంధధారణమ్.

శ్లో॥ చందనంపిత్రుకార్యేషు ఫాలమధ్యేవినిక్షిపేత్ । కంఠేకక్షే తథాపృష్ఠే నిరాశాఃపితరోగతాః॥

తా॥ పితృకార్యములయందు ముఖమునందే మంచిగంధమును ధరించవలయును. గాని కంఠమునందును భుజములయందును వీపునందును ధరించినయెడల పితృదేవతలు ఆశాహీనులై వెళ్లిపోవుదురు.

### పరివేషణవిధిః.

శ్లో॥ మధ్యే అన్నం ప్రతిష్ఠాప్య దక్షిణే ఘృతపాయసే । శాకాది పురతశ్చైవ అంతే సూపస్తథైవ చ ॥

తా॥ అన్నమును మధ్యప్రదేశమందును దక్షిణభాగమునందు నేతిదొన్నెయు పాయసపుదొన్నెయు కూరలు మొదలగునవి ముందరను పప్పుచివరను ఉంచవలయును.

### భోక్తురన్నస్పర్శనిషేధః.

శ్లో॥ అత్యక్తమన్నం విప్రస్తు పాణినాతు న సంస్పృశేత్ । స్పృశతే యదిమోహాత్స రౌరవం నరకం వ్రజేత్ ॥

తా॥ అన్నమును త్యక్తము చేయక పూర్వము భోక్తముట్టుకొనగూడదు, అజ్ఞానముచే ముట్టుకొనినయెడల రౌరవమను నరకమును బొందును.

### పరివేషణపాత్రాణి.

శ్లో॥ హస్తదత్తాస్తు యే స్నేహా లవణం వ్యంజనాని చ । దాతారం నోపతిష్ఠంతి భోక్తా భుంజీత కిల్బిషం ॥ సౌవర్ణరజితాభ్యాం చ ఖడ్గేనౌదుంబరేణ చ । దత్తమక్షయ్యతాం యాతి ఫల్గుపాత్రాణి వా హ్యధా ॥ పాకం సర్వం సమానీయ నివేద్య చ పృథక్ పృథక్ । విధివద్దైవపూర్వం తు పరివేషణమాచరేత్ ॥

తా॥ లవణము కూరలు మొదలగునవి చేతితో వడ్డింపగూడదు అట్లుంచబడినపదార్థములు కర్తకు ఫలమునియ్యవు. వానిని భుజించినయెడల భోక్త పాపమును భుజించినట్లేయగును కాబట్టి బంగారము వెండి మొదలగు పాత్రములతోను మేడికొయ్య మొదలగువానితో జేయబడినపాత్రములతోను వడ్డించినపదార్థము విశేషమైనఫలమునొసగును కాబట్టి యిటులుండబడిన సమస్తపదార్థములను వేరువేరుగా మొదట విశ్వేదేవస్థానమందును పిమ్మట పితృస్థానమునందునుంచవలయును.

### మధుదానవిధిః.

శ్లో॥ శ్రాద్ధే హోమే మధుమంత్రైః మధుదేయం ప్రయత్నతః । మధ్వలాభే జపేన్మంత్రం సుధాపానసమం భవేత్ ॥ మధ్వలాభే యదిగుడం మోదద్యాత్సర్వకర్మసు । వ్యర్థం భవతి తచ్ఛ్రాద్ధమితి శాతాతపోబ్రవీత్ ॥

తా॥ శ్రాద్ధమునందు (మధువాతా) అను మంత్రమును స్మరించి తేనెనుంచవలయును అది సంభవించకుండినయెడల మంత్రమును జపించినచాలును అమృతపానము జేసిన ఫలము

కలుగును మఱియు తేనెచేరకనియెడల బెల్లమునుంచినేని యాశ్రాద్ధముశ్రేష్ఠమగునని శాతాతపుఁడుచెప్పెను.

అథవికిరవిధిః.

శ్లో॥ భుంజానేషుచవిప్రేషు పిండదానంవిధీయతే। వికిరంతుతతః పశ్చాత్తతఉచ్ఛిష్టపిండకం ॥

తా॥ బ్రాహ్మణులు భుజించివారైయుండగా పిండప్రదానముచేయవలయును అటుపిమ్మట వికిరాన్నమునుంచవలయును అనంతరము ఉచ్ఛిష్టపిండము నుంచవలయును

శ్లో॥ సర్వవర్ణికమన్నాద్యం సన్నియాప్లావ్య వారిణా। సముత్సృజేద్భుక్తవతా మగ్రతోవికిరంభువి ॥

తా॥ ఆవికిరాన్నమును జలములోబాగాముంచి యాభోక్తలయొక్క ముందరను భూమియందువిడువవలయును

వికిరానంతరం ఆచమనాభావేదోషః.

శ్లో॥ శ్రాద్ధేషువికిరందత్వా యోనాచామేన్మతిభ్రమాత్। పితరస్తస్యషణ్మాసం భవంతి త్యుచ్ఛిష్టభోజనాః ॥

తా॥ శ్రాద్ధములయందువికిరాన్నముంచి పిమ్మట అజ్ఞానముచే నాచమనముచేయకుండినయెడల వానిపితృదేవతలారు మాసములపర్యంతము చ్ఛిష్టమునుభుజించుచుందురు

పిండప్రదానవిధిః.

శ్లో॥ సర్వమన్నముపాదాయ సతిలందక్షిణాముఖః। ఉచ్ఛిష్టసన్నిధౌపిండాన్ ప్రదద్యాత్పితృయజ్ఞవత్ ॥

తా॥ పాత్రమునందుంచఁబడిన యన్నమునంతయును నువ్వులతోకలిపి పిండములను జేసివానినిపిండపితృయజ్ఞపరికారముగా దక్షిణాభిముఖుఁడై పిండప్రదానముచేయవలయును

ఉచ్ఛిష్టసన్నిధస్వరూపమ్.

శ్లో॥ పిత్రూణామాసనస్థానాత్ అగ్రతఃత్రిప్వరత్నిషు। ఉచ్ఛిష్టసన్నిధానాంతంనోచ్ఛిష్టాసనసన్నిధౌ। అరత్నిమాత్రముత్సృజ్య పిండంతత్ర ప్రదాపయేత్ ॥

తా॥ పితృబ్రాహ్మణుఁడు కూర్చుండినప్రదేశముమొదలు ముందుమూడుపిడికెళ్ళు మూరలుండవలయును ఉచ్ఛిష్టపాత్రమునకుపిడికెళ్ళుమూరప్రమాణమువిడిచి అక్కడపిండ ప్రదానముచేయవలయును

శ్లో॥ యతో౽పస్సృశతోవాపి పాత్రసవంతిసబిందవః। మధుసర్పి

స్తిలయుతాంస్త్రీన్పిండాన్నిర్వపేత్సుతః । జానుకృత్వాతథాసవ్యం భూమౌ పితృపరాయణః ॥

తా॥ నీళ్లుపరివించినప్పటికిని కలియకుండనో అట్టిపరిదేశమునందు జేయవలయును తేనెనెయ్యినువ్వులు పెరుగువానితో గలిపిమూడుపిండములను జేసి యెడమమోకాలును భూమియందుంచి పితృదేవతులయందుభక్తిగలవాడై భూమియందు పిండప్రదానము జేయవలెను

## ఉచ్ఛిష్టపరిత్యాగః.

శ్లో॥ ఉచ్ఛిష్టాన్నంపరిత్యాజ్యం దేవానాంసర్వభాగతః । పిత్రాణాంపశ్చిమేభాగే విప్రోచ్ఛిష్టంప్రదాపయేత్ ॥ అసంస్కృతేభ్యోదాసేభ్య స్త్యజేదుచ్ఛిష్టసన్నిధౌ । నత్యజేత్తృప్తిపాత్రాభ్యా మన్యథానరకం వ్రజేత్ । అసంస్కృతప్రమీతానాం త్యాగినాంకులయోషితాం । ఉచ్ఛిష్టభాగదేయంస్యద్దర్భేచవికిరేచ్ఛయత్ ॥

తా॥ ఉచ్ఛిష్టాన్నమును పితృదేవతుల పాత్రమునకు పశ్చిమభాగమునవిడువవలయును సంస్కారములేనట్టివారును తమరినిఆశ్రయించుకొని మృతినొందినట్టివారికి ఉచ్ఛిష్టసన్నిధానమందుఉచ్ఛిష్టమునువిడువవలయును తానుతృప్తినొంది విడువవలయునుగాని తానుఆకలితోనుండి విడువగూడదు అట్లువిడిచినయెడల నరకమునుపొందును-సంస్కారములేకుండా మృతినొందినట్టివారికిని విడనబడిన కులస్త్రీలకును జెందునట్లుఉచ్ఛిష్టభాగమును దర్భలయందు విడువవలయును

## భోజనపాత్రచాలనమ్.

శ్లో॥ ఉచ్ఛిష్టపిత్రుపాత్రేషు భస్మమిశ్రంకరోతియః । తత్పితౄనరకంయాంతి యావచ్చంద్రదివాకరౌ ॥ అత్యజేషుచపాత్రేషు స్వస్తికుర్వంతియేద్విజాః । నిరాశాఃపితరస్తస్య శాపందత్వాసుదారుణం । పాత్రాణిచాలయేచ్ఛ్రాద్ధేస్వయం శిష్యోథవాసుతః । నస్త్రీభిర్నచబాలేన నానజాత్యేకథంచన । శ్రాద్ధేతూచ్ఛిష్టపాత్రాణి ఖనిత్రైవతునిక్షిపేత్ । పునరుచ్ఛ్వాసయేచ్ఛ్వాదియథానస్పృశేత్తథా ।

తా॥ భోక్తలయొక్క యుచ్ఛిష్టపాత్రములయందు బూడిదచల్లినయెడల వానియొక్కతండ్రిసూర్యచంద్రులుండునంతకాలమునరకమునుబొందును పాత్రలనుతీసివేయక ముందుబ్రాహ్మణులు స్వస్తిచెప్పినయెడల వానిపితృదేవతలు కఠినమైనశాపమునిచ్చి యాశారహితులై వెళ్లిపోవుదురు-కాబట్టితాను గానితనశిష్యుడుగాని తనకుమారుడుగాని

భోక్తృభోజనపాత్రములను తీసివేయవలయును- స్త్రీలుగాని పిల్లలుగాని విజాతీయులుగాని తీయఁగూడదు- శ్రాద్ధములయందు భోక్తలయొక్క యుచ్ఛిష్టపాత్రములను ఆకులు మొదలగునవి పెల్లగించవలయును అంతలోతుగొయ్యిత్రవ్వి దానిలోవేసి పూడ్చవలయును

## శ్రాద్ధశేషాన్నభోజనవిధిః.

శ్లో॥ తతశ్చవైశ్వదేవాంతే సభృత్యస్సుతబాంధవః। భుంజీతాతిథిసంయుక్తస్సర్వంపితృనిషేవితం॥ శ్రాద్ధమన్నమనుజ్ఞాతం భుంజీత తదనంతరం ॥ఇష్టైస్సార్థం తువద్బుద్ధిమాన్ తుసమాహితః॥ పృథక్పాకేన వైశ్వదేవకరణేపి శ్రాద్ధశేషాన్నభోజనంకర్తవ్యం ॥

తా॥ అటుపిమ్మట వైశ్వదేవము జేసికొని పితృదేవతలుచేననుజ్ఞపొందబడినపితృశేషమునంతయు తాను భృత్యులుతనయులు బంధువులుఅతిథులు మొదలగువారితోటి ఇష్టులు మొదలగువారితోను గూడిసావధానమనస్సుగలవాఁడై యథేష్టముగా భుజించవలయును వేరుపాకములందు వైశ్వదేవముజేసి శ్రాద్ధశేషాన్నమునుకర్తభుజించవలయును

శ్లో॥ ప్రదక్షిణమనువ్రజ్య భుంజీతపితృసేవితం ॥ శ్రాద్ధదినేపితృశేషాభావేపి పాకాంతరంకృత్వా అవశ్యంభోజనం కర్తవ్యం ॥ అభోజనే దోషః ॥

తా॥ భోక్తలకుప్రదక్షిణముజేసి వారికికొంతదూరముపంపించి పితృశేషమును భుజించవలయును పితృశేషములేకపోయినను వేరువంటచేసియాదినమునభుజించవలయును గాని యుపోష్యముచేయరాదు-

శ్లో॥ శ్రాద్ధంకృత్వాతు యోవిప్రో నభుంక్తేహి కదాచన । దేవాహవ్యంనగృహ్ణంతి కవ్యంసపితరస్తథా॥ పృథక్పాకేన వైశ్వదేవకరణేపి శ్రాద్ధశేషాదేనభోజనంకర్తవ్యం ॥

తా॥ ఏబ్రాహ్మణుండైనను శ్రాద్ధముజేసిభుజింపకుండునో ఆశ్రాద్ధమునందు దేవతలుహవ్యమునుగ్రహింపరు పితృదేవతలుకవ్యమును గ్రహింపరు- భిన్నపాకముచేవైశ్వదేవముజేసినను శ్రాద్ధశేషమునేభుజింపవలయును-

శ్లో॥ దంతధావనమభ్యంగం నఖకేశనికృంతనం । కర్తాకుర్వీత పూర్వేద్యుర్భోక్తాచైవపరేహని ॥

## ఏకాదశ్యుపవాసాదినియమే.

శ్లో॥ ఉపవాసేయదానిత్యే శ్రాద్ధంనైమిత్తికంభవేత్ । ఉపవాసంతదాకుర్యాద్ ఆఘ్రాయపితృసేవితమ్ ।

తా॥ నిత్యము గా జరుపుచుండెడి యుపవాసదినమునందు శ్రాద్ధము సంభవించిన యెడల శ్రాద్ధమును బెట్టిపిత్రుశేషము నాఘ్రాణించి యుపవాసము జేయవలయును.

### వైశ్వదేవవిధిః.

శ్లో॥ శ్రాద్ధంనిర్వర్త్య విధివ ద్వైశ్వదేవాదికంతతః । కుర్యాద్భిక్షాంతతోదద్యా ద్ధంతకారాదికంతతః ॥

తా॥ యథాశాస్త్రముగా శ్రాద్ధమును సమాప్తినింబొందించి అనంతరము వైశ్వదేవము మొదలగువానిని జేసిబంధువులు మొదలగువారితో గూడ భుజింపవలయును.

### శ్రాద్ధాంగతర్పణవిధిః.

శ్లో॥ తతఃపరేహ్ని కుర్వీత తర్పణంపురుషస్సుధీః । తచ్చైప్రోక్తైస్తిల దర్భైస్తుప్రాతః స్నాత్వామృతైర్జలైః ॥ శ్రాద్ధేయానంతరముద్దిష్టాః ప్రాతః స్నానేవతర్పయేత్ । తర్పణంత్వమృతంప్రాతః ద్వితీయేప్రహరేపయః ॥ తృతీయేజలమిత్యాహుః చతుర్థేరుధిరంభవేత్ ॥ తస్మాచ్ఛ్రాద్ధంతు పూర్వేద్యుః కృత్వాస్నాత్వాపరేహని । ప్రాతఃపితౄంశ్చ సంతర్ప్య పశ్చాత్సంధ్యాదికారయేత్ ॥ పరేహన్యుపసిస్నాత్వాకృత్వా శ్రాద్ధాంగతర్పణం । పునస్స్నాత్వైవకుర్వీతప్రాతస్సంధ్యాసమాహితః । ఉదితేతు రవౌస్నాత్వా సంధ్యాంకృత్వైవతర్పయేత్ । యస్తుతర్పయతిప్రాతః కృత్వాశ్రాద్ధంపరేహని । పితరస్తృప్తిమాయాంతి నకుర్వంతిచవైధవ్యం । పరేద్యుశ్శ్రాద్ధకృత్సర్వో యోనతర్పయతేపితౄన్ । అతృప్తాఃపితర స్తస్యశాపందత్వావ్రజంతితే ॥ తీర్థేశ్రాద్ధేగయాశ్రాద్ధే శ్రాద్ధేప్రేతాబ్దికేపిచ । పరేహనిద్విజఃకుర్యా త్తర్పణంతిలసంయుతం ॥

తా॥ అటుపిమ్మట విద్వాంసుడైనపురుషుడు శ్రాద్ధమునందు మిగిలినతిలలుదర్భల చేతనుమరునాడుదయమున స్నానముజేసిపరిశుద్ధమగు జలముచే పూర్వదినమందు శ్రాద్ధమునందుద్దేశించబడినపితృవర్గమునుగుఱించి తిలతర్పణజేయవలయును- ఆచేయబడినతర్పణ సంబంధమగుజలమును ప్రాతఃకాలమునందుజేసియెడలఅమృతముతో సమానమనియు రెండవ జాములో జేసియెడలపాలుతో సమానమనియు మూడవజాములో జేసినయెడల జలముతో సమానమనియు నాల్గవజామునజేసినయెడల రక్తముతో సమానమనియుచెప్పబడినది కాబట్టి పూర్వదినమునందు శ్రాద్ధముపెట్టినమరునాడుదయమునస్నానముజేసి పితృదేవతలగురించి తర్పణముజేసిపిమ్మట సంధ్యావందనాది నిత్యకృత్యములనుజేసికొనవలయును- మరునాడు దయమునస్నానముజేసి తిరిగిస్నానముజేసినపిమ్మటప్రాతస్సంధ్యావందనాది నిత్యకృత్య

ములను చేయవలయును-సూర్యోదయమగుచుండగ సంధ్యావందనము చేసుకరయే శ్రాద్ధాంగ తర్పణమును జేయవలయును-ఎవ్వడు శ్రాద్ధము పెట్టిరుమనాడు దయము శ్రాద్ధాంగతర్పణము ను చేయుచున్నాడో వానిపితృదేవతలు తృప్తినొందుచున్నారు-కోపమును పొందరు-నిశ్చయము శ్రాద్ధమును పెట్టినపురుషుడు మరునాడు శ్రాద్ధాంగతర్పణమును చేయకుండిలయెడల వానిపితృదేవతలు తృప్తిలేనివారై శాపమిచ్చివెళ్లిపోవుచున్నారు-తీర్థశ్రాద్ధమునందు గయాశ్రాద్ధమునందు ప్రత్యాబ్దికశ్రాద్ధమునందు పరేహానితర్పణము తిలసహితముగ చేయవలయును

## మహాలయతర్పణం.

శ్లో॥ శ్రాద్ధాంతే ప్రత్యహం దద్యాత్పక్షశ్రాద్ధాంగతర్పణమ్। సకృన్మహాలయే శ్రాద్ధే సతిలంతు పరేహని ॥

తా॥ పక్షశ్రాద్ధాంగతర్పణము శ్రాద్ధానంతరమునందే చేయవలయును, మహాలయశ్రాద్ధమునందు మరునాడు తిలతర్పణము చేయవలయును

## పితృవ్యాదికారుణ్యశ్రాద్ధే తర్పణవిధిః.

శ్లో॥ శ్రాద్ధాంగతర్పణం కుర్యాత్సతిలంతు పరేహని। పిత్రోర్విషయమేవస్యాన్న చాన్యవిషయే భవేత్ ॥

తా॥ మరునాడు తిలసహితముగ తర్పణము చేయుట తల్లిదండ్రుల విషయము గాని యితరుల విషయము కాదు

## సపిండీకరణాను మాసికాదిషు తర్పణవిధిః.

శ్లో॥ పక్షశ్రాద్ధే హిరణ్యేచ పశ్చాద్దద్యాత్తిలోదకం। తథాచైవాష్టకాశ్రాద్ధే శ్రాద్ధేచైవానుమాసికే ॥ వృద్ధిశ్రాద్ధే సపిండేచ ప్రేతశ్రాద్ధానుమాసికే। పరేహనివిమోకేచ నకుర్యాత్తిలతర్పణం॥ కృత్వానుమాసికంశ్రాద్ధం సపిండీకరణాత్పరం। వైశ్వదేవంతతఃకుర్యాత్తర్పణంతిలసంయుతం। సపిండీకరణశ్రాద్ధే ప్రేతశ్రాద్ధానుమాసికే। సంవత్సరవిమోకే చ నకుర్యాత్తిలతర్పణం ॥ ఇదంవచనం పరేహానితర్పణనిషేధపరం ॥ అన్యథాబహుస్మృతివిరోధస్స్యాత్ ॥

తా॥ పక్షశ్రాద్ధమునందు హిరణ్యశ్రాద్ధమునందు శ్రాద్ధానంతరమే తిలతర్పణము చేయవలయును అష్టకాశ్రాద్ధమునను అనుమాసికశ్రాద్ధమునందును వృద్ధిశ్రాద్ధమునందును సపిండీకరణశ్రాద్ధమునందును ప్రేతశ్రాద్ధమందును పరేహానితిలతర్పణము చేయనక్కరలేదు,

సపిండీకరణము జేసి మాసికము పెట్టి పిమ్మట వైశ్వదేవము జేసి అనంతరము తిలతర్పణము జేసికొనవలయును. సపిండీకరణమునందును ప్రేతశ్రాద్ధమునందును మాసికమునందును సంవత్సరవిమోకమునందును తిలతర్పణము జేయగూడదనెడుమాట పరేహనితర్పణవిషయము గాని నిత్యతర్పణవిషయము గాదు. ఇంతకంటె యతిరేకముగ జెప్పినయెడల ననేకస్మృతులకు విరోధముగానుండును.

## సువాసినీశ్రాద్ధే సువాసినీభోజనవిధిః.

నిర్ణయసింధౌ॥ శ్లో॥ మాతృశ్రాద్ధేతుసంప్రాప్తే బ్రాహ్మణైస్సహభోజనం। సువాసిన్యైప్రదాతవ్య మితిశాతాతపోబ్రవీత్॥ భర్తురగ్రేమృతానారీ సహదాహేనవామృతా। తస్యాస్థానేషుభుంజీత విప్రైస్సహసువాసినీం॥

తా॥ తల్లిసువాసినిగయుండి మృతినొందినయెడల అట్టితల్లి యాబ్దికమునందు బ్రాహ్మణులతోగూడ యొకముత్తైదువకు భోజనముపెట్టవలయునని శాతాతపుడుచెప్పెను. పెనిమిటికంటె భార్యముందుమరణించినను పెనిమిటితో సహగమనముజేసినను యామె శ్రాద్ధమునందు భోక్తలతోగూడ ముత్తైదువను భుజింపజేయువలయును.

## అశౌచదినేశ్రాద్ధవిఘ్నే.

శ్లో॥ దేయేపిత్రాణాంశ్రాద్ధంతు ఆశౌచంజాయతేతథా। ఆశౌచేతువ్యతిక్రాంతే తేభ్యశ్రాద్ధంప్రదీయతే॥

తా॥ జాతాశౌచమృతాశౌచదినములలో శ్రాద్ధముసంభవించినయెడల ఆశౌచము నివృత్తియగుదినంబున శ్రాద్ధమును పెట్టవలయును.

## రజస్వలాకర్తృకభర్తృశ్రాద్ధవిధిః.

శ్లో॥ అపుత్రాతుయదాభార్యా సంప్రాప్తేభర్తురాబ్దికే। రజస్వలా భవేత్సాతు కుర్యాత్తత్పంచమేహని। అశుద్ధాస్యాత్పంచమేహ్నిస్నాత్వానారీరజస్వలా। దైవేకర్మణిపిత్రేచ పంచమేహనిశుద్ధ్యతి॥

తా॥ సంతానములేనట్టిస్త్రీ బహిష్టయైయుండగ యామెభర్తయొక్క శ్రాద్ధము సంభవించెనేని అయిదవదినమందు స్నానముజేసినపిమ్మట పెట్టవలయును. బహిష్టయైనస్త్రీ అయిదవదినమందు స్నానముజేసినయెడల దేవపిత్రకార్యములకు నర్హురాలుగానుండును.

ఆమశ్రాద్ధంగృహీత్వాతు శ్రాద్ధాంతరభోజనదోషః.

శ్లో॥ ఆమశ్రాద్ధంగృహీత్వాతు యోన్యచ్ఛ్రాద్ధంతుభుంజతే । పతంతిపితరస్తేషాం ఘోరవేనరకేధ్రువం॥

తా॥ ఎవఁడైనను ఆమశ్రాద్ధమునందు పదార్థములుపుచ్చుకొని తిరిగి అన్యశ్రాద్ధమునందు భోక్తముగానుండెనేని వానిపితృదేవతలు ఘోరమగునరకమునుబొందుచున్నారు. నిశ్చయము.

ఆచమనవిధిః.

శ్లో॥ ఆదావంతేచపాద్యేచ పిష్టకేచవిశేషతః । వికిరేపిండదానేచ షట్సుతాచమనంస్మృతమ్॥

తా॥ మొదటను చివరను పాద్యసమయమందును విష్టరమిచ్చినప్పుడును వికిరసమయమందును పిండప్రదానకాలమందును ఈయారుసమయములయందును ఆచమనము చేయవలెను.

శ్రాద్ధేతంత్రదాననిషేధః.

శ్లో॥ పైతృకేషుచవిప్రేభ్యో దద్యాత్తంత్రంతుమూఢధీః। తత్తంత్రంరక్తమిత్యాహుః కాశ్యపిగార్గ్యగౌతమాః॥

తా॥ పితృకార్యములయందు భోక్తలకుమజ్జిగనిచ్చినయెడల యామజ్జిగరక్తముతో సమానమని కాశ్యపిగార్గ్యుఁడు గౌతముఁడు మొదలగువారలుచెప్పిరి.

పాదప్రక్షాళనం.

శ్లో॥ మండలాత్పశ్చిమేభాగే స్వాగతంతువిధీయతే। పాద్యందద్యాచ్ఛతత్రైవ క్షాళనంమండలోపరి॥

తా॥ మండలమునకు పశ్చిమభాగమునందు పాదములనుంచి స్వాగతమునుపాద్యమును జెప్పవలయును, మండలముమీదపాదములనుంచినపిమ్మటప్రక్షాళనము చేయవలయును

రజస్వలాపత్నీశ్రాద్ధనిమంత్రణనిషేధః.

శ్లో॥ రజస్వలాయాభర్తారం సూతికాయాశ్చనైపతిం। భాండస్పర్శనపర్యంతం శ్రాద్ధేతుననియోజయేత్॥

తా॥ తనభార్యబహిష్ఠయైయుండఁగగాని ప్రసూతయైయుండఁగగాని వానిని శ్రాద్ధములయందు నిమంత్రణఁజేయఁగూడదు. వానిభార్యకు కుండలుమొదలగువానిని ముట్టుకొనుటకు యోగ్యతకలిగినప్పుడు వానికియర్హతకలుగును.

## పితృపుత్రయోశ్శోకకాలక్షౌరవిధిః.

శ్లో॥ పుత్రపిత్రోస్సకృత్కాలే క్షౌరకర్మప్రవర్తతే। పుత్రస్యాదౌ తస్సంస్కారస్య పితుస్తదనంతరం। యస్తుక్షౌరదినేమోహాత్ మృత్తికాస్నాన మాచరేత్। ఆశౌచంత్రిదినంతస్యపునఃక్షౌరేణశుద్ధ్యతి॥

తా॥ తండ్రికుమారులిద్దరుఒక్కదినంబున క్షౌరముజేయించుకొనవలసినప్పుడుముందు కుమారుఁడు చేయించుకొని పిమ్మట తండ్రిచేయించుకొనవలయును. ఎవఁడైననుక్షౌరము జేయించుకొనిన దినమునందు మృత్తికస్నానము తెలియక చేసినయెడల వానికిమూఁడుదిన ములపర్యంతము ఆశౌచముండును. పిమ్మట తిరిగిక్షౌరకర్మను జేయించుకొనవలయును

## వామభోగజలపాత్రనిషేధః.

శ్లో॥ యథాభోజనకాలేతు వామభాగేస్థితంజలమ్। శ్వానమూత్రసమంతోయం పీత్వాచాంద్రాయణంచరేత్॥ స్కంధేకవాటేపాషాణే ఆర్ద్రవస్త్రంననిక్షిపేత్। నిక్షిపేద్యదిమూఢాత్మా సచేలస్నానమాచరేత్॥

తా॥ భోజనముజేయునప్పుడు జలపాత్రమును ఎడమభాగమందుంచుకొని జలపానముజేసినయెడల శునకమూత్రమును పానముజేసినట్లగును. అట్లుజేసినయెడల చాంద్రాయణము నాచరింపవలయును. భుజముమీదను తలుపుమీదను రాతిమీదను తడివస్త్రము నుంచగూడదు. తెలియకనుంచినవాఁడు ఆకట్టువస్త్రముతోనే స్నానముజేయవలయును.

## రజస్వలాసూతికాపత్యోరశుద్ధతా.

శ్లో॥ రజస్వలాచయానారీ ప్రసూతాయాచపాతకే। దైవేకర్మణిపిత్ర్యేచ తాసాంభర్తురశుద్ధతా॥

తా॥ బహిష్ఠైనదాని పెనిమిటియు ప్రసవమైనదాని పెనిమిటియు దేవపితృకార్యములవిషయమై అర్హులుగారు.

## వ్యుత్క్రమమృతానాం శ్రాద్ధవిధిః.

వా॥ వ్యుత్క్రమేణమృతానాం జీవంతమతిక్రమ్యతదూర్ధ్వగతాభ్యాంద్వాభ్యాంసహవర్గత్రయం సంపాద్యశ్రాద్ధంకుర్యాత్ జీవతికాలాంతరేవిలయేనతితత్సాపిండ్యాత్పరంపునః క్రమశః పిండ్యంకృత్వాక్రమేణ వర్గత్రయముద్దిశ్యశ్రాద్ధంకుర్యాత్॥

తా॥ తండ్రిజీవించియుండఁగ కుమారుఁడు మృతినొందినయెడల వర్గత్రయమువిషయమై జీవించియున్నవానియొక్క తండ్రితాతలగణ్యమునుజెప్పి శ్రాద్ధమునుచేయవలె

యును కొంతకాలమునకు తండ్రికూడ మృతినొందినయెడల సపిండీకరణమైనపిమ్మట క్రమముగా ముగ్గురియొక్క నామములను జెప్పవలయును.

వా॥ ఏవమేవ మాసికాన్యపి వర్గత్రయోద్దేశేన ప్రతిమాసమనుమాసికసంజ్ఞయా పార్వణవిధానేన కుర్యాత్ । శ్రాద్ధాంగతర్పణం సద్య ఏవ కుర్యాత్ ॥ ప్రతిమాసికే కర్తవ్య మాసికస్యాంతరాయే తన్మాసిక ముత్తర మాసికేన సహ సమానతంత్రేణ కుర్యాత్ ॥ మాసికద్వయమేళనే॥ అర్ఘ్యపాత్రషట్కం పిండషట్కం కుర్యాత్ । బహుమాసికమేళనే॥ త్రీణ్యేవార్ఘ్యపాత్రాణి త్రయ ఏవ పిండాః॥

తా॥ ఈప్రకారముగానే వర్గత్రయముతో ప్రతిమాసమునందు పెట్టునట్టి మాసికములను పార్వణవిధానముగా చేయవలయును. శ్రాద్ధాంగతర్పణము తత్కాలమునందే చేయవలయును. ఈమాసికములలో నేదైన నొకటివిఘ్నముసంభవించి యాగినయెడల ముందుమాసికముతోకూడ కలిపి సమానముగా జేయవలయును. అప్పుడు ఆరు అర్ఘ్యపాత్రలును ఆరుపిండములనుంచవలయును. అనేకమాసికములను బెట్టకలసివచ్చినప్పుడుమూడు దొన్నెలును మూడుపిండములనుమాత్రము నుంచవలయును.

ఏకోద్దిష్టవిధిః.

వా॥ కనిష్ఠభ్రాతృభగినీపుత్రాదిమాతులాదీనాం। ఏకోద్దిష్టవిధానేన పార్వణేనైకవత్కుర్యాత్ ।తత్ర విశ్వేదేవోఽపి ఏక ఏవ॥ రుద్రసంజ్ఞకోఽపి విశ్వేదేవః॥

తా॥ తమ్ముడు తోబుట్టువు కుమారుడు మేనమామ మొదలగువారియొక్క ఏకోద్దిష్టవిధానముగ ఏకపార్వణముగాచేయవలయును అప్పుడు రుద్రసంజ్ఞకుడైన విశ్వేదేవుడొక్కడు.

విశ్వేదేవాస్త్రయోదశ.

తద్యథా। శ్లో॥ దక్షస్యదుహితా సాధ్వీ విశ్వానామ ప్రకీర్తితా। తస్యాః పుత్రా మహావీర్యా విశ్వేదేవాస్త్రయోదశ॥

తా॥ దక్షప్రజాపతియొక్క కుమార్తెయు పతివ్రతయునగు విశ్వ అను పేరుగల యొక స్త్రీగలదు. ఆమెయొక్క తనయులు మిక్కిలిపరాక్రమవంతులునగు పదముగ్గురు విశ్వేదేవతలని చెప్పబడుచున్నారు.

తత్తన్నియమాః.

శ్లో॥ ఇష్టిశ్రాద్ధే క్రతుర్దక్షౌ సంకీర్త్యౌ వైశ్వదేవకౌ। నాందీముఖే సత్యవసూ సాపిండ్యే కాలకామకౌ। పురూరవార్ద్రవౌ చైతౌ పార్వణే సముదా

హృతౌ। హేమశ్రాద్ధే దనురుచీ తీర్థే ధూరివిలోచనౌ। ఏకోద్దిష్టే రుద్రసం
జ్ఞౌ విశ్వేదేవాః త్రయోదశ॥

తా॥ ఇష్టిశ్రాద్ధమునందు దక్షక్రతువులనువారు నాందీశ్రాద్ధమునందు సత్యవసులను వారు సపిండీకరణమునందు కాలకాములనువారు ప్రత్యాబ్దికమునందు పురూరవార్ద్రవులను వారు హిరణ్యశ్రాద్ధమునందు ధనురుచులనువారు తీర్థశ్రాద్ధమునందు ధూరివిలోచనులనువారు ఏకోద్దిష్టమునందు రుద్రుఁడొకరుఁడును మొత్తముపదముగ్గురు విశ్వేదేవతులు.

ఉపవీతినాకర్తవ్యస్థానాన్యాహ.

శ్లో॥ ప్రాణాయామేనమస్కారే స్నానేచైవప్రదక్షిణే। పైతృకేఽపితకృత్యేఽపి ఉపవీతంవిధీయతే॥

వా॥ స్వాగతేస్వస్తివచనే స్నపరివేషణేఘృతాదానేభివాదనే గోత్రవృద్ధౌదక్షిణాదానే విసర్జనేచోపవీతమేవ.

తా॥ ప్రాణాయామమునందును నమస్కారమందును స్నానమునందును ప్రదక్షిణమందును పిత్రుకార్యసంబంధమైనప్పటికిని పైనజెప్పినవాటియందు ఉపవీతముగానే చేయవలయును. స్వాగతముస్వస్తివచనములు అన్నమునొడ్డించుట అర్ఘ్యమిచ్చుట నమస్కారముచేయుట గోత్రవృద్ధిజెప్పుట దక్షిణనిచ్చుట విసర్జనచేయుట ఈకార్యములయందు ఉపవీతముగానే చేయవలయును.

అథ సోదకుంభశ్రాద్ధవిధిః.

వా॥ సోదకుంభబ్రాహ్మణభోజనమాసికశ్రాద్ధానంతరం పాకాంతరేణ త్రిపురుషోద్దేశేన సంకల్పవిధానేనకుర్యాత్॥ సంకల్పశ్రాద్ధే॥ ఆవాహనార్ఘ్యపిండప్రదాన స్వధావాచనాదికంవర్జయిత్వా భోజనానంతరంహస్తశుద్ధిమాత్రంకృత్వా తాంబూలదక్షిణాదీనిదత్వా ప్రదక్షిణప్రణామాన్ కృత్వావిసర్జయేత్॥

శ్లో॥ అర్ఘ్యావాహనపిండాశ్చ వికిరోచ్ఛిష్టపిండకాః। స్వధోచ్యతాన్నకరణం సంకల్పేసప్తవర్జయేత్॥

సోదకుంభశ్రాద్ధేవిశ్వేదేవవరణంనాస్తి, ఏవమేవమహాలయశ్రాద్ధం బహుదేవతోద్దేశేన పార్వణవిధానేనవాకుర్యాత్॥ పరేద్యుః ప్రాతఃకాలేమేవ శ్రాద్ధాంగతర్పణంకుర్యాత్॥ ఇతిపైతృమేధికకారికాస్సమాప్తాః.

గ్రంథశ్చాయంసమాప్తః.



# యాజుషస్మార్తమంత్రపాఠము.

## ప్రథమభాగము సస్వరము, సద్గ్రంథము

ప్రతి 1 కి రు 2—8—0 పోస్టుఖర్చులు ప్రత్యేకము, వెంటనే వ్రాసి తెప్పించుకొనవలెను.  అయ్యా!

భగవదనుగ్రహముచే చతుర్థముద్రణము తీరెను ఇది ముద్రింపించుచుండగా మహాజనులు పదేపదే పంపుమని జాబులు వ్రాసిరి. అప్పట్లో పైగ్రంథమును పంపలేకపోతిమి "శ్రేయాంసి బహువిఘ్నాని" అనునట్లు ముద్రింపించుచుండ కాగితములు, కాటుక, బైండు సామానులు మొదలగునవి ఒకటికి పదిరెట్లు హెచ్చి కొన్ని సమయములలో దొరకకుండుటవలన కలిగిన యాలస్యమును గూర్చి చదువరులే గ్రహింతురు గాక— గ్రంథస్థవిషయము లెవ్వియనిన, నమకము, చమకము, పురుషసూక్తము, శ్రీసూక్తము భూసూక్తము, అరుణము, హోమము. త్రిచ, వివాహమంత్రప్రశ్న, ఉపనయనమంత్రప్రశ్న, నక్షత్రేష్టి, ఉపనిషత్తులు అనగా— బత్తి, శిక్ష, ఆనందవల్లి, భృగువల్లి, నారాయణము, పితృమేధము, అధిశ్రవణము, మన్యుసూక్తము, రుద్రసూక్తము, పవమానసూక్తము, దేవీసూక్తము, రాత్రిసూక్తము, హిరణ్యసూక్తము, నీళాసూక్తము, సరస్వతీసూక్తము, లక్ష్మీసూక్తము, నాగసూక్తము, అన్నసూక్తము, న్యాసపఞ్చ, మహాన్యాసము, దశాంగరౌద్రీకరణము, షోడశాంగరౌద్రీకరణము, ఆత్మరక్షా, శివసంకల్పములు, దశశాంతులు, సామ్రాజ్యపట్టాభిషేకము, బిల్వాష్టోత్తరశతనామపూజా ఇన్ద్రాక్షీస్తోత్రము, రుద్రకవచము, నవగ్రహమంత్రములు మొదలగు స్మార్తమంత్రవిషయము లన్నియును గలవు. ఇది స్మార్తగృహస్థులకును విద్యార్థులకును, శ్రోత్రియులకును, యాజ్ఞికులకును, స్వస్తివాచకులకును, శివాలయ విష్ణ్వాలయపూజారులకును, ఋగ్వేదులకును అత్యవసరముగ నుండదగినది గురువునద్ద 1. 2 సార్లు పాఠము చెప్పించుకుని, స్వయముగా గ్రంథసహాయ్యముచే పఠింపదగును, మఱియు నీగ్రంథమునందుగల రుద్రాభిషేకము, నవగ్రహశాంతులు, నవగ్రహజపము, మొదలగునవియును, వివాహోపనయనాదిషోడశకర్మలు మొదలగు స్మార్తకర్మలన్నియు పూర్తిగా చేయించుకొనుటకు సమర్థులగుదురు ఈగ్రంథముగలవారందఱు వెంటనే వ్రాసి తెప్పించుకొనగలరు ప్రతి 1 కి రు 2—8—0 తమపేరు మారుజాబు వ్రాయునప్పుడు తమగ్రామం, పోస్టు, జిల్లా, తాలూకా, మొదలగునవి విస్పష్టముగా తెలుగుభాషలోగాని ఇంగ్లీషుభాషలోగాని వ్రాయవలెను సందేహములుండకూడదు 5 ప్రతులు ఒకేసారి వ్రాయునప్పుడు తమకు చేరువనున్న రైల్వేస్టేషను పేరు తెలియపర్చవలెను. రైల్వేపార్సిల్ ద్వారా తెప్పించుకొనునప్పుడు మీకు ఖర్చులు చాలా తగ్గును మా కేటలాగులు గ్రంథములతో పంపుదుము.

# యాజుష శ్రౌత స్మార్తానుక్రమణిక

ఈచతుర్థముద్రణమునందు, ఇందుగృహ్యసూత్రధర్మశాస్త్ర-సస్వర - సప్రయోగ శ్రౌత సహితము గా నుండెను. ఈఅపూర్వమైనసద్గ్రంథమునుజదివినంతనే సకలవైదికప్రాచీనసాంప్రదాయములు విస్పష్టముగాఁదెలియును. ఇట్టిఉత్తమగ్రంథమిదివఱకెవ్వరునుబయలు వెడలలేదు. ఎంతధనమువెచ్చించినను సరే ఇన్ని విషయములను బోధించువారు దొరకరనియీపుస్తకమునుజదివిన గొప్పవారందఱును తెలియపఱుచుచున్నారు. ఇదివరకుమూడుమారులుముద్రించిన ప్రతులన్నియువిక్రయమైనవి. మఱియుయజుర్వేదులాచరించు సకలస్మార్త విషయములును చేరినపుస్తకములలోనిది ప్రాముఖ్యమైనది. ఇందుండువిషయములు విఘ్నేశ్వర విష్వక్సేన పూజలు స్వస్తివాచనకర్మణః పుణ్యాహవాచనములు, తత్ప్రమాణములును-పిమ్మట-అగ్నిముఖమునుఅందుపాత్రాసాధనములునుజయాదిపూర్ణాహుతిహోమములును, అంకురారోపణాదిదేవతాహ్వానములును పంచదశకర్మలకును ప్రాముఖ్యమైన గృహ్యసూత్రమును నిత్యముజరుపవలసిన ఔపాసనాదివిషయములును, గర్భాధాన-పుంసవన-సీమంత, జాతకర్మ, నామకరణ, అన్నప్రాశన, చౌలోపనయనాదిసద్విషయములును వేదవ్రతములును స్నాతకవ్రతము పిమ్మట సూత్రీయ వివాహమును భట్టీయవివాహ ప్రయోగమును వివాహదీక్షయందు 5దినములు జరుపవలసిన హోమాదిప్రయోగములును పిమ్మట, గృహ్య

ష్ఠలు నిత్యముజనుపవలసిన స్నానాదికృత్యములును దేవతార్చనవిధాన ములును ఇందుఆధానపంచకమును మాసశ్రాద్ధాదిసప్రయోగములును పుత్రస్వీకారదత్తహోమ ప్రకరణములును కదళీవివాహాదివిషయములు ను ద్విజులయొక్క జన్మోత్సవాదులును అందుఆయుస్సూక్తమంత్రము లును- అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడైన శ్రీరాములవారియొక్క కళ్యాణోత్సవములును పితృమాతృలయొక్క ప్రత్యాబ్దికములును మరి కొన్ని ధర్మశాస్త్రవిషయములును మహాలయాదిశ్రాద్ధప్రకరణములును రథసప్తమీస్నాన మాఘస్నానవిర్ణయములును ఇత్యాదిఅనేక సద్వి షయములుగలిగిన గొప్పగ్రంథము ఇది బ్రాహ్మణమాతృల కందరికిని ప్రతిగృహమునందు 1 పుస్తకముతప్పకనుండదగినది. ఈగ్రంథమువలన ప్రయోజనమును తమకే ముందుచెప్పగలరు. గురుసహాయము కోరన క్కరలేని అతిసులభముగా ప్రయోగమునుజర్పింపగల సామర్థ్యమిచ్చు ను వెంటనేవ్రాసి తెప్పించుకొనదగును. ప్రతి 1—కి రు. 4—0—0

పురాణోక్త వైశ్యాఅక్షరము, ఇందుజ్యోతిషధర్మశాస్త్ర, సప్ర యోగసహితముగానుండెను. తాత్పర్య సహితము యాజ్ఞికులకుమహా ధనము ప్రతి 1 కి రు 1—4—0

పోస్టుఖర్చులుప్రత్యేకము.

☞ ఆర్యానంద ముద్రాక్షరశాల, మచిలీపట్టణము.



